

నవజనార్దన గ్రంథ ప్రచురణ సహాయకులు

**శ్రీ రెడ్డి వేంకట కృష్ణానందచౌదరిగారు**

**వారి కుటుంబ సభ్యులు**



పిఠాపురం రాజా

శ్రీశ్రీశ్రీ **రావు** వేంకట మహీపతి గంగాధర రామరావు

బహద్దూరువారు



పూజ్య గురువులైన శ్రీమతి పెండ్యేల సత్యభామ గారూ, మీ ఛాయా చిత్రం కోసం ప్రయత్నించి విఫలుడ నయ్యాను. అందుకు నేను ఎంతో చింతిస్తున్నాను. మీ ఆశీర్వాదం వల్ల నాకు లభ్యమయితే మీ ఛాయా చిత్రాన్ని నేను వ్రాస్తున్న సంపూర్ణ "నవజనార్దనం" గ్రంథంలో ప్రచురిస్తాను.

మీకు ఇవే నా జోహార్లు!

నటరాజ రామకృష్ణ

# ఒక్కమాట

ప్రసిద్ధ ఫ్రెంచి తత్వవేత్త, కవి, రచయిత శ్రీ రోమన్ రోలాండ్ భారతీయ వేదాంతాన్ని సంపూర్ణంగా అవగాహన చేసికొన్న పవిత్ర హృదయుడు. రామకృష్ణ పరమహంస, వివేకానందుల పవిత్ర జీవిత చరిత్రలను తన రచనల ద్వారా విదేశీయులకు ప్రబోధం చేసిన మహనీయుడు. "నాకే మరొక జన్మంటూ ఉంటే నేను భారతీయునిగా పుట్టలేక పోయినా కనీసం నా చివరి దినాలను పవిత్ర గంగా నదీ తీరాన గడిపి నా అస్థులను బాసే అదృష్టాన్ని ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అని అతనొకసారి అన్నాడు.

అలాగే "నటరాజస్వామీ! నాకు మరల మరొక జన్మ అంటూ ఉంటే నేను మళ్లా ఆంధ్రప్రదేశంలోనే పుట్టాలి. మధురమైన ఆ ధ్రి భాషలో నిన్ను కీర్తించి, ఆడి, పాడి నేను తరించాలి" అని నేను కోరుకొంటున్నాను.

తీయనైన తెలుగు భాషలో క్షేత్రయ్య పొందు పరచిన మువ్వగోపాలుని పదాలలోని భావ సౌందర్యంలో ఆ గోపాలుణ్ణి ఆరాధించి, అభినయించి, ఆయన సాక్షాత్కారాన్ని పొంది మరొకసారి తరించాలని నా కోరిక. రసనిలయమైన అటువంటి పద కవిత మన తెలుగులోనే కాదు మరే భాషలోనైనా ఉందా? లేదు!

ఒక కళారాధకునిగా, నాట్య పరిశోధకునిగా నేను అన్వేషిస్తూ కన్యాకుమారి నుండి కాశ్మీర్ వరకు, మణిపూర్ నుండి గుజరాత్ వరకు వర్యటించాను.

కృష్ణ దేవుళ్ల నెందరినో నేను చూశాను, దేవుళ్లను వివిధ భాషల్లో కీర్తించగా విన్నాను. కీర్తనలకు నృత్యం చేయగా చూశాను, అభినయించగా చూశాను. అందరిదీ ఒకే తీరుగా ఉంది. కానీ మన వేణుగోపాలుని తీరే వేరు. ఆయనపైని రచింపబడిన పదకవిత, దానిలోని భావవికాసం మాటల్లో చెప్పడానికి వీలు లేనివి. ఆ సుమధుర రసానుభూతిని అనుభవించిన వారికే అది ఎరుక.

అంతటి విశిష్టత మన తెలుగు గడ్డ కొక్కదానికే ఉంది, అది తెలుగు భాషకే ఉంది, తెలుగు కవితకే ఉంది, తెలుగు కళలకే ఉంది, కనుక మన తెలుగుదేశంలో మళ్లా జన్మించడం ఎంత ధన్యం, ఎంత పుణ్యం! పూర్వ జన్మలో నేను చేసికొన్న పుణ్యం వల్లనే నేనీ తెలుగుదేశంలో నాట్య కళాకారునిగా జన్మించాను. జన్మ జన్మలకు తెలుగు దేశమే నా మాతృభూమి కావాలని కోరుకొంటున్నాను,

ప్రాచీన కాలంనుండీ తెలుగు దేశ శ్రీ కళావేత్తలు ప్రదర్శిస్తూ వచ్చిన దివ్య నర్తనమే ఆంధ్రనాట్యం.

తెలుగు సుందరుల పసుపు పారాణి పాదాల నలంకరించిన మువ్వల సందడిలో మధురంగా పలికి, తెలుగు వారి గాన మాధుర్యంలోని భావవికాసాన్ని కలువ కన్నుల లేజవ్వనుల అభినయం ద్వారా లోకానికి చాటి, ఆంధ్ర జాతికి, ఆంధ్రభాషకు, సంగీతానికి, సాహిత్యానికి ఆంధ్ర నాట్యం వన్నె తెచ్చింది.

ఆంధ్ర నాట్యంలోని ఒక భాగమే పారిజాత నర్తనం. అదే భామాకలాపం. సామాన్య తెలుగు ప్రజల సాంస్కృతిక వికాసం కోసం రూపొందించిన కళారీతి ఇది. పీఠికాపురంలో వెలిసిన కుంతి మాధవునికి అంకితంగా ఆయన సాన్నిధ్యంలో తొమ్మిది రాత్రిళ్లు ఈ పారిజాతం ప్రదర్శింపడుతూ ఉండేది. అందుకే దీనికి నవజనార్దనం, నవజనార్దన పారిజాతం అన్న పేర్లు వచ్చాయి.

ఈ నవజనార్దన పారిజాతానికి కూచిపూడి భామాకలాపానికి ఎటువంటి సంబంధం లేదు. ఈ నవజనార్దనం లాస్యరీతికి చెందింది. ఆట పాటల్లో, నృత్త, నృత్య, అభినయాల్లో దీనికి ఇదే సాటి. ఇదొక సంపూర్ణ శృంగార దృశ్య ప్రబంధం. మరే యితర భారతీయ భాషల్లోను ఇంతటి సుందర ప్రబంధం నాకు కనబడలేదు. ఇది ఆంధ్ర కళాకారుల అదృష్టం, ఆంధ్రజాతికే గర్వ కారణం.

ఈ నవ రాత్రుళ్ల నవజనార్దనాన్ని ఏడు రాత్రుళ్ల సప్తాహంగా రూపొందించి నా శిష్యుడు చిరంజీవి కళాకృష్ణకు నేర్పాను. ఏడు రాత్రుళ్లు ఆడించే అవకాశం నా కింకా కలుగలేదు. మూడు రాత్రుళ్లు మాత్రమే ఆడించగలుగుతున్నాను. అందువల్ల ఈ మూడు రాత్రుళ్ల గ్రంథాన్ని మాత్రమే ప్రస్తుతం ప్రచురిస్తున్నాను.

శ్రీకృష్ణుని తన చెప్పు చేతల్లో పెట్టుకొని ఆడించిన లోకైక సుందరి సత్రాజిత్తు కుమార్తె సత్యభామను ఒక చక్కని కళామూర్తిగా రూపొందించి, ఆమెచే ఆడించి, పాడించి, ఆ యవతార పురుషుని ప్రేమ విలాసాన్ని దర్శించి ఆనందించే అదృష్టం లోకంలో ఒక్క తెలుగువారికే దక్కింది. తెలుగువారికి కలిగిన మహాభాగ్యం!

నా కృషిని అభినందించి ఆశీస్సుల నందజేసిన బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారికి అంజలి ఘటిస్తున్నాను.

పూర్వం ఈ పారిజాతాన్ని ప్రదర్శించిన కళావేత్తల, సభికుల, కేళికల వివరాలతో ఈ గ్రంథానికి తిలకం దిద్దిన నాట్యకళోపాసకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణమూర్తిగారికి నా కృతజ్ఞతలు.

ఈ బృహత్కలాపాన్ని ప్రచారం చేస్తున్న నా శిష్యులకు ఆశీస్సులు.

ఈ గ్రంథాన్ని చక్కగ రూపొందించుటలో సహకరించిన సోదరులు శ్రీ గిడుగు రామమూర్తిగారికి ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని వెలుగులోకి తేవడానికి తమంతట తామే ముందుకు వచ్చి ఆర్థిక సహాయాన్ని అందజేసిన సహృదయులైన శ్రీ రెడ్డి వేంకటకృష్ణానందచౌదరిగారికి కళాలోకం నిత్యం ఋణపడి ఉంటుంది. వారికి నా ధన్యవాదాలు.

నటరాజ రామకృష్ణ

1-8-1984
అశోక్ నగర్
హైదరాబాదు-20

# అభినందనము



నాట్యవేదము, నాట్యశాస్త్రము, భరత శాస్త్రము అను పేర్లతో యుగయుగములనుండి భరతఖండ మంతటను ప్రసిద్ధిగాంచిన మహావిద్యను ఉపాసించి దేశము నలుమూలలా వ్యాపింపజేయు దీక్షలో నున్న శ్రీ నటరాజు రామకృష్ణ మహాశయుని గూర్చి ఎంత ప్రశంసించినను పూర్ణము కానేరదు. వేదోదితమైన యజ్ఞమునకు ఎంత ఉన్నత స్థానము కలదో దీనికిని అంత ఉన్నత స్థానము కలదు.

చతుర్వేదసారము గనుకనే పరమార్థ దృష్టిగల భరతాదిమునులు దీనిని ఉపాసించి లోకములో ప్రచారములోనికి తెచ్చినారు. అధీతి, బోధ, ఆచరణ, ప్రచారము లను ఈ నాలుగును వేదవ్యాప్తికి హేతువులైన సూత్రము. ఈ సూత్రమునే శ్రీ రామకృష్ణగారు అక్షరాలా నడుపుచు దేశమున కొక ఉద్బోధమును కలిగించు చున్నారు. ఇది సామాన్య విషయము గాదు. ఇట్టి అపూర్వ విద్యలకు జన్మాంతరమందు బీజము హృదయమునందు లేకున్న యెడల; ఆ విద్యలు ఎంత బుద్ధిమంతున కైనను అంటవు. ఈ విషయమునే కాళిదాస మహాకవి కుమార సంభవమున పార్వతీదేవిని వర్ణించుచు "...ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః"— అని చెప్పెను.

ఇట్టి మహా విద్యలు తపస్సు చేత గాని సాధ్యము గావని శాస్త్రములు చెప్పుచున్నవి. తపస్సునకు ముఖ్యము బ్రహ్మచర్యమే గదా! ఆ విద్యావ్యసనము సహజముగా రామకృష్ణ గారికి కలిగి, ఆ విద్యకొఱకై ఆజన్మ బ్రహ్మచారి యైనాడు. విద్యావ్యసనమును భర్తృహరి మహాపురుష లక్షణముగా చెప్పి, అట్టి నిర్మల గుణులైన వారికే తాను నమస్కరించుచున్నానని చెప్పినాడు.

మన ప్రాచీన దేవాలయ విమాన గోపురముల మీది వివిధ నాట్యభంగిమలతో కూడిన స్త్రీ పురుష శిలాశిల్పమూర్తులను చూచినప్పుడు, ఈ నాట్య విద్య ఒకప్పుడు ప్రాచీనముతో పాటు ఎంత ప్రాచుర్యమును కూడ వహించెనో అని దిగ్భ్రమను పొందక మానము. గతించిన ఏడువందల సంవత్సరముల నుండి మన దేశము తురుష్క పాశ్చాత్య వ్యామోహములో పడి ఈ విద్య యెడల మన వారు చిన్నచూపు వహించుటచే కృష్ణపక్ష చంద్రకళవలె నానాటికి క్షీణింపజొచ్చినది. నేటి మన దేశస్థితి చూచినచో అర్థకామములకే గాని ధర్మమోక్షములకు స్థానము లేకున్నది. ఈ నాట్య శాస్త్రమును మన పూర్వులు మోక్షసాధనోపాయము గానే ఉపాసించినారు గాని... అర్థప్రయోజన మాత్రముగా నెన్నడు అభ్యసింపలేదు. రామకృష్ణ

గారు మన పూర్వ ఋషులు చెప్పిన మార్గమునే అనుసరించుచున్నారని నా దృఢమైన అభిప్రాయము.

పాశ్చాత్య వ్యామోహముచే చిన్నచూపు చూడబడిన ఈ నాట్య విద్యను; ఈనాడు అనేకులు సంపన్నులు, విద్యావంతులు, కులీనులు ఉత్సాహముతో ముందునకు వచ్చి ఈ నాట్యకళను తమ సంతానమునకు అభ్యసింపజేయుచున్నారన్నచో; అదంతయు రామకృష్ణ గారి తపఃఫలితమే! ఆంధ్రదేశము నందలి అన్ని పట్టణములందు గల వివిధ విద్యాలయముల యందు; ఆయన నాట్యకళ యొక్క ఔన్నత్యమును గురించి ఉపన్యసింపని చోక్కటైనను లేదనుట కేవలము పొగడ్తకాదు, సత్యమును అంగీకరింపుటయే యగును.

"నృత్తరత్నావళి" లో జాయ సేనాపతి చేత చెప్పబడిన "పేరిణి" తాండవమును మఱియు తూర్పుగోదావరి జిల్లాలో ఒకప్పుడు విరివిగా ప్రచారములో ఉండి కాలమహిమచే మఱుగున పడిన "నవజనార్దన పారిజాతము" అను మధురలాస్యమును రామకృష్ణగారు అధిక వ్యయప్రయాసల కోర్చి, తా మభ్యసించి పెక్కురకుపదేశించి ఆంధ్రదేశమునకు మహోపకార మొనర్చినారు. నే నెఱిగినంతవరకు నాట్యకళకు ఈ శతాబ్దములో ఇంత సేవ యొనర్చి గుర్తింపు పొందిన వారు వేరొకరు లేరనియే చెప్పవచ్చును. ఇప్పట్లు వారికి ఆంధ్రదేశ మంతయు యెంతయో ఋణపడియున్నట్లు నేను భావించుచున్నాను.

రామకృష్ణగారు ఆంధ్రదేశమున స్థిర నివాస మేర్పఱచుకొని యుండకపోయినచో, "పేరిణి" యును మఱియు "నవజనార్దన పారిజాతము" ను మనకు దక్కెడివి గాదనుట నిశ్చయము. వా రా పవిత్ర కార్యమును నిర్వహించుటకుగాను దైవముచే నిర్దేశింపబడి అవతరించిన అవతారపురుషు లనియే నా నమ్మకము.

ఆ యవతారమెత్తుటలో ఆంధ్రునిగా జననమొందుట మఱియు ఆంధ్రదేశముననే స్థిర నివాస మేర్పఱచుకొనుటయు అనునవి, అది వారి దురదృష్టము మన అదృష్టము !!!

సాహిత్యోపాసకులు నా చిరకాల మిత్రులునగు చిరంజీవి విశ్వనాథ సత్యనారాయణమూర్తి ఈ గ్రంథమునకు "తిలక" మను పేరిట వ్రాసిన విపులమైన పీఠికా రూపమైన వ్యాసమును నాకు పూర్తిగా చదివి వినిపించినాడు. అందు నాట్య శాస్త్రమునకు దర్శన ప్రతిపత్తి కలదని నిరూపించుటలో అతను చూపిన అసాధారమైన నైపుణ్యమునకు నా హృదయము ఉప్పొంగినది. ఇదివర కెవరును నాట్యమును ప్రయోగ ప్రధానమైన కళగానే చెప్పిరి గాని జ్ఞాన ప్రధానమైన దర్శనముగా నిరూపించి యుండలేదు. ఆయన నా నుండియు మఱియు ఇతరుల నుండియు చాలా అమూల్య విషయములను సేకరించి పీఠికలో పొందుపఱచినాడు.

పీఠికను పెంచి వ్రాసినచో అదే ఒక ఉత్తమ గ్రంథమగునంత విషయపరిజ్ఞానముతో వ్రాసినాడు. రామకృష్ణగారు ఈ పీఠికను చి॥ మూర్తికి అప్పగించుటలో ఉభయులు న్యాయ పక్షపాతులైనా రని నా తలంపు. పీఠికను వినిన తదుపరి, రామకృష్ణగారి ఆదేశానుసారముగా నా ఆనందమును కూడ దానితో జోడింపదలచి ఈ నాలుగు వాక్యములను వ్రాసినాను. నాట్యకళామూర్తులగు రామకృష్ణగారికి సకలాభ్యుదయములను సర్వదా జగదంబయగు శారదాంబ అనుగ్రహించుగాకయని హృదయ పూర్వకముగా ఆశీర్వదించుచున్నాను.

—రక్తాక్షి ఉగాది పర్వదిన శుభాకాంక్షలతో—

రామారావు పేట — ఇట్లు

కాకినాడ — కళాప్రపూర్ణ

2.4.1984 — వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

# తిలకం

## నర్తనారామంలో విరిసిన నవపారిజాతం....నవజనార్దనం
## అభినయ మయూరి పురి విప్పిన సీమ....కోనసీమ



### నాట్యశాస్త్రం - దర్శన ప్రతిపత్తి

నాట్య తత్వం అనాది. అది నిర్గుణం-నిరాకారం—అఖండం—అద్వయం. అదే పరబ్రహ్మ తత్వం లేదా మూల ప్రకృతి. నాట్యతత్వం నుండి "నటరాజు" యొక్క ఆవిర్భావం జరిగి...ఆయన యొక్క సృష్టి తాండవంనుండి సమస్తమైన చరాచర జగత్తు (ఆయన రోమ కూపాలనుండి) ఆవిర్భవించింది. నటుడు నాట్యం చేసేటప్పుడు అతని రోమ కూపాలలోనుండి ఒకానొక తపన (వేడి) పుడుతుంది. అదే "తపస్సు". తపస్సు సాధనంగానే నటరాజు తాను సృష్టికర్త కాగలిగాడు. నటరాజులో స్త్రీ పురుష తత్వాలు అప్పటి కింకా విభాగింపబడలేదు. దానినుండి...ఆ యంశతో రుద్రుడు ఆవిర్భవించాడు. అట్టి రుద్రుడు ఉమా సంబంధాన్ని పొందడంతో తన శరీరాన్ని రెండుగా చేసుకొని, ఏకకాలమందే వామ దక్షిణ భాగాలతో లాస్య తాండవ నిరూపణాన్ని చేశాడు. అందుకే ఆయన మహానటుడు. ఆయన నాట్యంనుండే వ్యాకరణాది విద్యలు, సమస్త కళలు పుట్టాయి. లాస్య తత్వం నుండి స్త్రీ...తాండవ తత్వం నుండి పురుషుడు ఆవిర్భవించారు.

సృష్టి-స్థితి-లయలు, మూడూ నాట్యంలోనే నడచి పోతూంటాయి అనేదే "నటరాజ" తత్వార్థం. నిజానికి ఈ మూడూ వేరువేరు నాట్యాలు కావు...లేవు! అనాది నుండి అంతం వరకు...జ్ఞానంతో కూడిన చైతన్యం యొక్క "నృత్తహేల" తైలధారావచ్ఛిన్నంగా సాగిపోతూనే ఉంటుంది.

జాయ సేనాపతి తన "నృత్తరత్నావళి"లో "నృత్తప్రశంస" చేస్తూ—"భూమిమీద రత్నకాంతుల మిలమిలలు, నీటిమీది తరంగాల లలిత విన్యాసం, అగ్నిజ్వాలల్లో డోలనం, సమీరంలో అలసగమనం, ఆకాశంమీద మెరిసే మెరుపు తీగలోని వంపులు (లాస్యం)... ఇలా సహజ సుందరమైన "నృత్తహేల" ప్రకృతిలో సహజంగా పంచభూతాల్లోను అవిచ్ఛిన్నంగా సాగిపోతూనే ఉంటుంది!" అని లో చూపుగలవారితో అంటాడు!

"మనం ఘన పదార్థా లనుకునేవికూడా శక్తివంతమైన భూతద్దంతో చూస్తే; అవి అణువుల సముదాయ మని... ఆ యణువులు కూడా స్థిరంగా ఉండక లయతాళబద్ధంగా కదులుతూ ఉంటాయని... ఆ కదలిక ఒక అద్భుతమైన నాట్యంగా తోస్తోందని"- ఒక భౌతికశాస్త్రవేత్త అన్నాడు.

అందువల్లనే "నాట్యమయం జగత్" ఐంది. మనమంతా నటుల మైనాము! పరమాత్మ మహానటు డై నాడు! నటుడు... తాను నటించే పాత్రయొక్క సుఖదుఃఖాలు నిజంగా తనవి కావని; తాను కేవలం అభినయిస్తున్నాడనే జ్ఞానంతో ఎలా నటిస్తాడో... అలాగే మన మంతా ఈ జగత్తనే రంగస్థలం పైని నటులమనే జ్ఞానంతో జీవించడమే...ముక్తి. అలా కాకుండా సుఖదుఃఖాలు మనవి అనుకోవడం...భ్రమ. లేదా అజ్ఞానం, లేదా బంధం.

ఏ తత్వం తెలుసుకొంటే...సృష్టి తత్వం కరతలా మలక మౌతుందో...అలాటి అనాది ఐన నాట్య తత్వాన్ని తెలియజెప్పడం కోసమే భరతాది మునులు ప్రయత్నించి...ఆ యనంత తత్వం ముందు మేము కించిజ్ఞుల మని వినయంతో మోకరిల్లారు. అనాది-ఏకం-రసం-సమం...ఈ శబ్దాలు పరబ్రహ్మ తత్వా నికే అంటే నాట్యతత్వానికే అన్వయిస్తాయి.

అలా నాట్యం కంటే అభిన్నమైన పరమాత్మ తత్వాన్ని తెలియజెప్పడంతో...నాట్యశాస్త్రానికి దర్శన ప్రతిపత్తి ఏర్పడి...లోకంలో నాట్యం మోక్ష సాధన మార్గాలలో ఒక టైంది. నాట్యాచార్యులు దర్శ కులైనారు...నర్తకులు సాధకులైనారు.

## భూలోకంలో నాట్యోత్పత్తి

నాట్యం అంటే నటించటం అని అర్థం. నేడు వాడుకలో ఉన్న డాన్స్ మరియు డ్రామా...ఈ రెండూ ఇందులోనే ఇమిడి ఉన్నాయి.

నాట్యం చతుర్వేద సంబంధమైనది. ఋగ్వేదం నుండి పాఠ్యాన్ని (సాహిత్యం), సామవేదం నుండి గీతాన్ని (సంగీతం),యజుర్వేదంనుండి అభినయాన్ని, అథర్వణవేదం నుండి రసాన్ని తీసికొని పితామహుడు నాట్యవేదాన్ని (ఉపవేదం) పుట్టించి ఇంద్రాది దేవతలకు బోధించాడు. అక్కడనుండి భరతాది మునులు గ్రహించి లోకహితార్థంగా భూలోకంలో వ్యాపింప జేశారు.

## నాట్య ప్రశంస

అలా అనాది ఐన నాట్యాన్ని ఎందరో ప్రశంసిం చారు తమ గ్రంథాల్లో! కవికులగురువు కాళిదాసు అందరి కంటె మిన్నగా సుకుమారంగాను, సూటిగాను ఒక్క శ్లోకంలో చెప్పాడు...తన మాళవికాగ్ని మిత్రంలో.

"క్రతు భుజులైన దేవతలు ఈ నాట్యాన్ని శాంత రసప్రధానమైన చాక్షుష క్రతువుగా భావిస్తారని మునులు తలపోస్తారు. (ఎందుకంటె కొన్ని క్రతువు లలో హింస ఉంటుంది. నాట్యం హింసారహితమై నయనా నందకరంగా ఉంటుంది).

త్రిగుణాత్మకం, నానారసభావ సమ్మిశ్రితం ఐన లోకచరితం...భిన్న రుచులు గల జనులచే అభినయ కాలంలో బహు విధాలుగా చూడబడినా...అనుభూతి యొక్క తత్వంలో మాత్రం ఏకం అనగా ఒక్కటైన పరమాత్మనే అనగా రసానందాన్నే పొందుతున్నది" అంటాడు.

యజ్ఞాంగాల్లో నర్తకులు ఒకరు - వైదిక పరమైన అన్ని క్రతువులలోను నాట్యవినియోగం ఉంది.

దశరథుని పుత్రకామేష్టి కోసం వశిష్ఠుడు సమ కూర్చిన యజ్ఞసంభారాలలో "గణకాన్ శిల్పిన శ్చైవ తథైవ నట నర్తకాన్"–నటులు, నర్తకులు ఉన్నారు.

అశ్వమేధ క్రతువులో కృష్ణ యజుర్వేదం ఇలా చెప్పింది. "...బ్రాహ్మణౌ వీణా గాథినౌ గాయతః..."–వీణను పాడుతూ వాయించాలి.

క్రతువులన్నీ దేవతలను రంజింపజేసి వారి నుండి ఇష్టకామార్థ్య సిద్ధిని పొందడం కోసం ఉద్దేశింప బడ్డవి గనుక...రంజక సామగ్రిలో నాట్యం విధిగా ఉంది.

అలాగే దేవాలయాలలో జరిగే స్వామివారి కల్యాణ మహోత్సవాలలో ఈ తౌర్యత్రికం (నృత్య-గీత-వాద్యాలు) యొక్క వినియోగం విధిగా ఉంది. దేవాలయం అంటే సమస్త దేవతాగణ పరివృత స్థానం. "అంకురారోపణ-ధ్వజారోపణ-బలిహరణ-ధూపసేవ-మందబయలు-సదస్యం..." ఐదు రోజులు నాట్యావసరం ఉంది. స్వామివారి నిత్యసేవలలోను నాట్య వినియోగం ఉంది.

శైవ, వైష్ణవ ఆగమాల ననుసరించి—అధిష్ఠాన మూర్తి యొక్క పరిచారక దేవతాగణాన్ని—అష్ట దిక్పాలకులను ఆహ్వానించేటప్పుడు వార వారికి ఇష్టమైన రాగ, తాళ, నాట్యాలతో ఆహ్వానించాలి.

అందుకొరకు ప్రత్యేకంగా నియమింపబడిన వారే దేవదాసీ జనం. "గుడిసేవ" వారి వృత్తి.

రాజసభల్లో ఆ నాటి నాట్య వైభవం వర్ణనాతీతం.

సంఘ ప్రయోజనం అన్నికాలాల్లోను అంతర్లీనంగా నాట్యాచార్యుని నేర్పు ననుసరించి ఇమిడే ఉంటుంది.

## సంఘంలో నర్తకుల స్థానం

"గాంధర్వేచ భువిశ్రేష్ఠో బభూవ భరతాగ్రజః"—అంటాడు వాల్మీకి. రాముడు గాంధర్వవేద నిష్ణాతుడట!

రామ పట్టాభిషేక సమయంలో (ఏర్పాట్లు) "సర్వేచ తాళావచరా గణికాశ్చ స్వలంకృతాః,కక్ష్యాం ద్వితీయ మాసాద్య తిష్ఠంతు నృప వేశ్మనః". ద్వితీయ కక్ష్యలో గణికలను కూర్చోబెట్టండి అంటాడు. రెండవ వరుస అంటే ఎంత ఉన్నత స్థానమో చూడండి!

'క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భా స్సుమనసః పయః,వేశ్యాశ్చైవ శుభాచార స్సర్వాభరణా భూషితాః'.

## ఆంధ్ర సాహిత్యంలో నాట్యవర్ణన

పంచామృతాలతో కూడి, సర్వాభరణ భూషితులై ప్రవర్తిచేత మంగళ ప్రదలైన వేశ్యలట వారు.

ఇలా అనాదియైన నాట్యతత్వం— ప్రజాపతిచేత రూపకల్పన చేయబడి—భరతాది మునులచేత ప్రచారంలోకి తేబడి—ప్రాంతీయ భేదంచేత ఆంధ్ర నాట్యం, తంజావూరు, కూచిపూడి, కథకళి, ఒడిస్సీ, కథక్ అనే పేర్లతో ప్రచారంలోకి వచ్చింది.

తాండవం-నటనం - నాట్యం - లాస్యం - నృత్యం - నృత్తం-నర్తనం—ఈ శబ్దాలన్నీ సాహిత్యంలో మాత్రం సమానార్థకాలే ఐనా ; నాట్యశాస్త్రంలో మాత్రం వాటిలో పరస్పర భేదం ఎంతైనా ఉంది. సర్వరస ప్రధానమైనది నాట్యం.

ఆంధ్ర సాహిత్యంలో ప్రతి గ్రంథంలోను నాట్య సందర్భం వచ్చిన చోట, ఆనాటి నర్తన కేళిక వర్ణించబడింది.

"......బంగరు టందెలు ఘల్లు ఘల్లనా తుకుఝుకు తక్కు ధిక్కు తక ధిక్కిట ధిక్కిట తక్కిడాంగు ఝం తకధిక యంచు మేనక యధావిధి నాట్యము సల్పె వింతగన్"—అంటాడు గోగుల పాటి కూర్మనాథుడు తన మృత్యుంజయ విలాస యక్షగానంలో. ఈ యక్షగానాన్ని మారంపల్లి సోదరీ మణులు, చిత్రజల్లు వైదేహి మరియు ఇందువదన వారి బృందంతో పూర్తిగా...కైలాసం దిగివచ్చిందా అన్నట్లుగా ఆడేవారు.

అలాగే సారంగం తమ్మయ తన వైజయంతీ విలాసంలో "...హవుదప్పా పాత్రరాయా యిహహ బళి బళీ యంచు..." సభ్యులు ప్రశంసిస్తూండగా. "నాయకుడు బాపురే! బాపురే! యటంచు..." కట్నాలు పంపగా; "లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు"—అంటూ వర్ణిస్తాడు దేవదేవి నాట్యాన్ని

## సిద్ధేంద్రులువారి భామా కలాపం-గొల్ల కలాపం

తెనుగులో మాత్రం ఒక పురాణ కథను తీసుకొని...రసాన్ని పోషిస్తూ, సర్వాంగ సుందరంగా నాట్య ప్రబంధంగా రచించి "భామా కలాపం' లేదా 'పారిజాతం' మరియు 'గొల్ల కలాపం'—ఈ రెంటిని ప్రదర్శింప జేసిన వారు భగవాన్ సిద్ధేంద్రులు. వీరు ఏ శతాబ్దంవారో చెప్పడం కష్టం. ఒక్కొక్క పండితుడు ఒక్కొక్క కాల నిర్ణయం చేస్తున్నాడు. పండితులు విమర్శకులు పరిశోధనచేసి యోగీంద్రుల వారి కాల నిర్ణయం చేయుట అత్యవసరం. వీరేకాక అనేకమందికవులునాట్యాచార్యులు అనేక రీతుల శ్రీకృష్ణ సత్యభామల ప్రణయ కలహాన్ని ఒక దివ్య శృంగార దృశ్య ప్రబంధంగా సర్వాంగ సుందరంగా రూపొందించారు. అదే నవజనార్దన పారిజాతం. భరత సంగీత, అభినయ కళలకు సిధి నిక్షేపం వంటి దిది.

ఇందు పొందుపరచని తాళలయ గతి ప్రస్తార గమక విన్యాసాలు, రాగ సంచార పద్ధతులు; అభినయ పోకడలు, సంచారుల విన్యాసాలు, వివిధ నాయికల వికాసము నే నెరిగింత వరకు, చూచినంత వరకు, పెద్దలు పండితుల నుండి విన్నంత వరకు లేదు. కనుకనే నవజనార్దనమునకు ఇంతటి విలువ వచ్చింది. "ఈ పారిజాతం సంపూర్ణంగా అభ్యసించిన కళాకారులకు భరతాభినయ శాస్త్రాల్లో మరిం కేమీ మిగలదు" అన్న నటరాజుగారి అభిప్రాయం వాస్తవం.

"భామక్రోధే". భామ అంటే అవశ్యం కోపగించుకొనే స్త్రీ అని అర్థం. కలాపం అంటే విస్తరించి చెప్పటం. సత్య తనకు స్వామివారికి మధ్య నడిచిన ప్రణయ కలహ వృత్తాంతాన్ని విస్తరించి చెప్పిన దగుటవలన "భామా కలాపం" ఐంది. అలాగే గొల్ల పడుచుకి బ్రాహ్మణునికి మధ్య నడిచిన వృత్తాంతం విస్తరించిన దగుటవలన "గొల్ల కలాపం" ఐంది.

## సిద్ధేంద్రుల వారి కలాపరచనోద్దేశ్యం

యౌవనంలో శృంగార రస ప్రధానంగా "భామా కలాపాన్ని"; మునివృత్తిలో శాంతరస ప్రధానంగా "గొల్ల కలాపాన్ని" రచించి లోకానికి శృంగార వేదాంతాల సారాన్ని తెలియజెప్పారు. ఒకటి ప్రవృత్తి మార్గం. రెండవది నివృత్తి మార్గం.

ఆనందంలోనే సృష్టి...ఆనందంలోనే లయం...అదలుంత్యా ఆనందమేకాగా...కనిపించే సృష్టి అంతా పరమాత్మ స్వరూపమని...ఆ పరమాత్మ ఆనంద స్వరూపుడని...జీవితం ఇక్షుఖండాన్ని పోలి మొన నుండి కొనవరకు మాధుర్యమే తప్ప మరేమీ కాదని ...వయస్సు ఒక్కొక్క దశకమే పైబడే కొలది ఆ ...ఆనందాన్నే అన్వేషించుకొంటూ అనుభవంలోనికి తెచ్చుకోవాలన్న ఉపనిషత్తుల సారాన్ని (బోధ)...లోకం మీది కరుణతో ఒకా నొక సమాధి స్థితిలో నుండి లోకానికి ఆ రెండు కలాపాల ద్వారా తెలియ జెప్పారు...భగవాన్ సిద్ధేంద్రులు.

## నవజనార్దన పారిజాతం-మధురలాస్యం

అలా సిద్ధేంద్రుల వారి రచన లోకంలో బాగా వ్యాప్తిలోనికి వచ్చిన తరువాత, అనేకమంది నాట్యాచార్యులు దానికి అనేక మార్పులు చేర్పులు చేశారు. కాలానుగుణంగా సంగీతంలోను—నాట్యంలోను ప్రజల అభిరుచులలో వచ్చిన మార్పులను అనుసరించి, రస పుష్టిని చేకూరుస్తూ చేసిన మార్పులు అవన్నీ! అలా రూపు దిద్దుకొన్న వాటిల్లో తలమానికం ఈ "నవ జనార్దనం". ఇది తూర్పు గోదావరి జిల్లాలో బాగా ప్రచారంలో ఉంది.

ఈ "నవజనార్దనం"లో ఒక ప్రత్యేకత ఉంది. నవ అంటే తొమ్మిది అవి మరియు నూతనమైనదని ...అర్థం. ఆడిన దరువు ఆడకుండా ఆడే తొమ్మిది రాత్రుల గ్రంథ కనుక...ఇది "నవ-జనార్దనం".

గీత — నృత్య — వాద్య — అభినయాదులతో,...

నూతనత్వంతో కూడి ప్రదర్శింపబడుతున్నది కనుక ఇది "నవజనార్దనం".

ఇందులో ఏకాదశ భావాలు (సాహిత్యం), సప్త తాళాలు, అష్టాదశరాగాలు (సంగీతం), చతుర్దశ నాట్యాలు, దశవిధ తీరికలు, రెండు అలంకారాలు ఉన్నాయి. అభినయంతో కూడి...సంగీత-సాహిత్య నాట్యాలు మూడూ ఈ గ్రంథంలో మూడు పాయలుగా అల్లుకొని...త్రివేణీ సంగమంలా కలిసి రసజ్ఞ లోకానికి రమ్యాలోకనం అయింది.

## ఏకాదశ భావాలు (సాహితీ పరంగా)

ప్రస్తావ—విరహ - దూతిక - స్వప్నావస్థ-ఆరడి-భామాసంవాద-మన్మథోపాలంబన-చంద్రోపాలంబన-వాయూపాలంబన - మూర్ఛావస్థ-సవతుంకయ్యం.

## సప్తతాళాలు (తాళప్రకరణం)

ఆది-అట-త్రిపుట-మఠిమ-రూపక జంపె-ధృవ.

## అష్టాదశరాగాలు (రాగప్రకరణం)

నాట-రేగుప్తి-అసావేరి-హాయిరి-కాంభోజి- యరుకుల కాంభోజి-సావేరి-సారంగ-బిల్హరి - కేదారగౌళ-కళ్యాణి-ఆనందభైరవి-భైరవి-వరాళి-తోడి-సౌరాష్ట్రి-శంకరాభరణ-భూపాల.

## చతుర్దశ నాట్య విన్యాసం (నాట్య ప్రకరణం)

సమయడుగు - ఉశియడుగు-దంపఅడుగు - కత్తెర యడుగు - ఉమయడుగు - వాలుఅడుగు - విడంబపు అడుగు - విషమయడుగు - హాలాయఅడుగు - నీటు అడుగు - తేటఅడుగు -జరుపుఅడుగు-అండయడుగు-పుళితేటి యడుగు.

కొన్ని అడుగులను చేర్చి ఒక తాళంలో తీర్మానం చూపించవచ్చు. చారి-కరణ-అంగహారాదులన్నీ... అడుగులలోను, తీర్మానంలోను ఇమిడి పోతాయి.

## దశవిధ తీరికలు (లయ విన్యాసం)

తాతకి ధిత్తక-ధాతకి-ధింతకిట ధిత్తక-తధాకట-ధిమితత్తోదిగణ-కిటతక ఝుందిగిదిగి-తరికిట-తకతక తరికిట తకితక-ధెయ్యతక్క-ధా.

## రెండు అలంకారాలు

తారి తాంధణతాం-ఔరౌర సరి,
చతుర్వేదాలకు ప్రజాపతి స్థానం యెట్టిదో...చతుర్విధ అభినయానకి ఈ "నవజనార్దనం" అట్టిది.

సంయోగ...వియోగాలనబడే రెండు విధాలైన శృంగార రసానికి; అందు వియోగ విప్రలంబానికి దశావస్థలు చెప్పబడ్డాయి. పదవ అవస్థ ఐన మరణాన్ని చూపించటం భారతీయ మర్యాద కాదు కనుక ......తొమ్మిది రోజులు తొమ్మిది అవస్థలు అభినయించి మరణ ప్రయత్నాన్ని చూపించి...సత్యాకృష్ణుల కలయికతో నవజనార్దనం పూర్తవుతుంది.

ఇంతటి విశిష్టమైన ఈ గ్రంథానంతా డాక్టర్ రామకృష్ణగారు చిన్ననాడే కీ॥ శే॥ పెండ్యేల (పెండేల) సత్యభామవద్ద (పిఠాపురం) నేర్చి, ఇంత గొప్ప కళ తనతో అంతరించి పోకూడదనే తపనతో తన శిష్యుడైన "కృష్ణకు" మూడు రోజుల గ్రంథం నేర్పి ...బంగారాన్ని ఆభరణంగా మార్చినట్లు "కళాకృష్ణ"గా తీర్చిదిద్దారు. భామా కలాపాన్ని ఆంధ్రదేశంలో ఎందరో కళాకారులు ఎన్నో రీతులలో ప్రదర్శనలిస్తున్నా...ఈ బాణీ చాలా గొప్పది. మణులలో కౌస్తుభం వంటిది.

"కళాకృష్ణ" నవజనార్దనాన్ని దర్శించడం... నిజంగా జీవితానికి చరితార్థతను కల్పించే మహోజ్జ్వల ఘట్టం.

ఈ జీవితానికి ఈ ఒక్క క్షణం చాలనిపించే... మధురస్మృతి! మననం చేసుకొనే కొలది మధురానుభూతిని కలిగించే ప్రియురాలి పరిరంభణంలోని పులకరింత!

సహృదయ చక్రవర్తులకు స్వ స్వరూపానుసంధానం!

కళాభిజ్ఞులకు కనులముందు కదలాడే కలియుగ వైకుంఠం ! ! !

అస్తు!

నాట్యాచార్యుని లక్షణాలను వర్ణిస్తూ "కులీనో నృత్య శాస్త్రజ్ఞః తత్వవేదీ జితేంద్రియః" అని అంటూ "...చతురః శిష్య శిక్షాయాం నర్తనే నిపుణః స్వయమ్—సంగీత మేలనాభిజ్ఞో నానా దేశీయ నృత్యవిత్"—అంటాడు జాయప.

శాస్త్రంలో చెప్పబడిన నాట్యాచార్య లక్షణాలకు రామకృష్ణగారు సరియైన లక్ష్యం. అలాగే "కళాకృష్ణ" కూడా!

నవజనార్దనాన్ని లోకంలో ప్రకాశింపజేయటానికి ప్రభవించిన సూర్యచంద్రులు..ఈ గురుశిష్యులిద్దరూ.

## మయూరి సీమ కోనసీమ పారే గోదావరి జలాలు పారాడే పాద మంజీరాలు

పూర్వం ఉభయ గోదావరి జిల్లాలు ఒకటిగానే ఉండేవి. అందు కోనసీమ...వికసించిన వేయిరేకుల పద్మానికి...కర్ణిక (దుద్దు) వంటిది. వేద పండితులతో పాటు గాంధర్వ వేద నిష్ణాతు లెందరో ఉండేవారు.

(1) రాపూరి కోటయ్యగారు (సమరస) (2) ఆత్మకూరి సుబ్బయ్యగారు (అనాతవరం) (3) ఆకెళ్ళ సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారు (4) పురిఘళ్ళ వేంకట సుబ్బారాయుడుగారు (5) గడ్డం సుబ్బారాయుడుగారు (6) దువ్వూరి విస్సన్నగారు (7) మిక్కిలి దుర్గయ్య శాస్త్రిల్లుగారు (8) చంద్రాభట్ల కనకాద్రి శాస్త్రిగారు (9) ఆకెళ్ళ లక్ష్మీనారాయణ సోమయాజులు (10) నరసింహదేవర నరసింహంగారు (ఆలమూరు) (11) కాండూరి విశ్వనాథంగారు (ఉండి)...ఇంకా ఆరామద్రావిడులలో రాపూరి వారు పొదిలివారు ఇంకా ఎందరో ఉండేవారు.

వీరంతా స్థితిమంతులు వేదశాస్త్ర పారంగతులు. శ్రోత్రియులు. భరత శాస్త్ర నిష్ణాతులు. వీరే గోదావరి జిల్లా అంతటా అభినయ విద్యను...కలాపాలను నేర్పిన గురువులు. వీరివద్ద విద్య నేర్చిన కొందరు కళామూర్తులు శ్రీమతులు (1) దుగ్గిరాల మాణిక్యం (2) దు. కాంతం (3) దు. ఎలనాగ (4) దు. భామామణి (5) దు. శ్రీ విరాజితం (6) పందిరి వెంకటరత్నం (7) నాయుడు భాగ్యవతి (8) నాయుడు రామచంద్రం (9) చింతా వీరభద్రం (10) చింతా పెదగనిరాజు (12) చిన గనిరాజు (12) కాంద్రేగుల వీరవెంకటనారాయణ (13) అన్నాబత్తుల బులి వెంకటరత్నం (14) అ. వెంకట విజయ గోపాలరత్నం (15) వాల్మీకి పారిజాత పుష్పావతి (పేరూరు) (16) ఐనవిల్లి వీరాచలం (17) మద్దుల పరహేలు (మానేపల్లి) (18) నీలాచలం (19) చాటపర్రు సుందరి (20) చిత్తజల్లు వైదేహి (21) చి॥ ఇందువదన—ఇంకా లెక్కకు మించి ఉన్నారు.

వీరంతా అభినయంలోను కలాపవిద్యలోను ఆరితేరిన విద్వత్ కళామూర్తులు. వీరిలో కొందరు గతించారు, కొంద రున్నారు.

## ఆనాటి గురువులు - శిక్షణ

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాతనే పాండిత్యాలు పలుచబడ్డాయని పలువురు విద్వాంసుల భావన. ఆనాటి గురువులది...కలతగొట్టు పాండిత్యాలు కావు. వారి భాగవతాలు గరిటె భాగవతాలు అసలే కావు. గరిటె భాగవతం అంటే గరిటెలో చెంచాడు నూనె పోసి వత్తి వెలిగించి ఆ వెలుగులో అది ఆరిపోయే వరకు ఆడటం అంటే ఒక్క దరువు కూడా కాదన్న మాట.

నర్తకి కావలసిన బాలిక ఐదవ యేటనే సాహిత్యం, సంగీతం, నాట్యం నేర్చుకొనడం ప్రారంభించేది. శబ్ద

మంజరి, అమరం, పంచకావ్యాలు ముగించేది. అలాగే సంగీతం. ఆ పైని అభినయానికి దోహదపడే నాట్య శాస్త్రం, అభినయ దర్పణం, భరత రస ప్రకరణం, ప్రతాప రుద్రీయం, పుష్పబాణ విలాసం, పంచబాణ విలాసం, అమరుకం, రసమంజరి—ఇత్యాది గ్రంథాలు ఎన్నో గురుముఖతః నేర్చుకొనేది. అలా అన్నిటా నిష్ణాతులైన పిమ్మటనే ప్రదర్శనకు సిద్ధపడేవారు. ఇప్పటిలా సంవత్సరం పూర్తికాకుండానే "మా అమ్మాయికి పళ్లెంమీద డాన్సు ఎప్పుడు నేర్పుతారండీ"—అనే అలుసులు కారు వారు. అభ్యాసంతో అలవడి... విద్వత్తో నిమిత్తం లేకుండా చేసే దొమ్మరిసాని తీగ మీది ఆట ఇంత కంటె గొప్పదేమో విజ్ఞులు ఆలోచించాలి! మా ఊళ్ళో (విశ్వేశ్వరుని అగ్రహారం అంటే పేరూరే) వేషాల వెంకయ్యగారు పచ్చికుండ మీద నాట్యం చేసేవాడు.

కళకు విద్యకు చాలా తేడా ఉంది. అభ్యాసంతో వచ్చేది కళ. మూగవాడు కూడా దానిని చెయ్యగలడు. "శక్తో మూకోపి యత్కర్తుం తత్కలా సంజ్ఞికం విదుః"—అని.

మేధతో వచ్చేది విద్య. వాచికం కర్మ. శాస్త్రం పిడివేసి వల్లించాలి. ఒక పట్టాన లొంగదు.

## కోనసీమలో కలాపవిద్య - కొన్ని ముచ్చట్లు

పూర్వం మండపేటలో దుగ్గిరాల మాణిక్యం అనే గొప్ప కళాకారిణి ఉండేది. "సంగీత సరస్వతి" అని ఆమెకు బిరుదు. దాదాపు తొంభై సంవత్సరాలు జీవించింది. గతించి ఏభై సంవత్సరాలు కావస్తోంది. ఆ రోజులలో "మాది మండపేటండీ!"- అని ఎవరైనా అంటే... మాణిక్యం ఉండే మండపేటేనా?" అని అడిగే వారంటే... మండపేటకు ఎంతటి పేరు ప్రఖ్యాతులు తెచ్చింది ఆమె! మండపేటనే మాండవ్యపుర మని అనేవారు.

ఆమె నవజనార్దనాన్ని తొమ్మిది రోజులు ఆడేది... ఆడిన పదవు ఆడకుండా! ఒకసారి... [illegible]— నేటికి ఆ పై సంవత్సరాల క్రితం మండపేట [illegible] జనార్దన స్వామివారి కళ్యాణ సంబరాల్లో [illegible] మంది సత్రకేళీయులు భామ వేషం [illegible] నవజనార్దనం ఆడారు. పెద్ద [illegible] పట్టాలు [illegible] జడలు తెరమీద వేశారు. [illegible] జడలు... తళతళ మెరిసి పోయాయి. "[illegible]" అన్నారు. మాణిక్యం బృందానికి [illegible]. దువ్వూరి విస్సన్నగారు హాస్యం. [illegible] భరత గురువులు. [illegible] మంతులు... సదాచార సంపన్నులు. [illegible] వారిది. ఆయన [illegible] చేశారు! ఆమె పాలిటి మువ్వగోపాలు డాయన. [illegible] బృందానికి సూత్రధారు డాయనే.

"దేవ సభాపైకి [illegible] ఆనాటి సభా వైభవం" అన్నారు ఈ నాటికీ జీవించి [illegible] కొందరు పెద్దలు.

కాదా మరి! తొమ్మండుగురు భామలు... అప్సరస్త్రీలను మించిన అందచందాలతో... మెరుపు తీగల్లా మెరిసిపోతూ లాస్యం చిందిస్తూంటే... తొమ్మండుగురు మార్దంగికులు క్షీరసాగర మథనాన్ని మించిన [illegible] గుబ ధ్వనులతో మృదంగాలను చేవమోదా పద్ధతిలో పలికిస్తూంటే... తొమ్మండుగురు తాళాన్ని [illegible] తాళాలతో లయ చెపకుండా, తాళాన్ని ప్రస్తరిస్తూంటే. తొమ్మండుగురు వంతలు రాగాన్ని ప్రస్తరించి షడ్జమంలోకి తీసుకొని వెడుతూంటే— [illegible] సభ [illegible] తీసికట్టే!

ఇక సభ్యులెవరు?

గ్రామగ్రామానికి వర్తమానం వెళ్ళిందేమో జిల్లా అంతా విరగబడి పోయింది. అంతా వేద పండితులు. శాస్త్రపండితులు.

మిగతా ఎనిమిది రోజులు మాత్రం మాణిక్యంగారే ఆడారు. దానితో పాటు క్రతువు కూడా కొనసాగింది.

"భామనే! వయ్యారి సత్యభామనే!" అనే దరువు ఒక్కటే విని భామాకలాపం అంటే ఇంతే అనుకొనే రసజ్ఞులు, కళాకారులు ఉన్న నేటి స్థితిలో; మన కళ్ల ముందే ఎంత గొప్ప కళాస్వరూపం అంతరించి పోయిందో తెలుసుకొంటే దిగులు కాదా మరి!

ఆనాడు కోనసీమలో భామాకలాపం ప్రజల జీవన విధానాల్లోకి ఎంతగా చొచ్చుకు పోయిందంటే...

ఎంతటి శ్రోత్రియులైనా పెళ్ళికి వెళ్ళి వచ్చిన వారిని "పెండ్లికూతురు ఎలా ఉంది శాస్త్రుల్లుగారూ?" అని అడిగితే–"ఏం చెప్పమంటావు! అచ్చం భామ వేషంలా ఉందిరా!" అనేవారు.

మరో వైకుంఠం!

దాదాపు నేటికి సంబై సంవత్సరాల క్రితం మాట! మహా పండితులు చతుశ్శాస్త్రపారంగతులైన మరువాడ శంభన్న శాస్త్రిగారి షష్టిపూర్తి సందర్భంగా వారి శిష్యులు కర్రా కోగయ్యగారు తలపెట్టిన గురుపూజా కార్యక్రమం అది. అమలాపురం చేరువనే బుచ్చమ్మ అగ్రహారం, వారి ఇంట్లోనే సభ.

ఉదయానికే వచ్చింది చింతా వీరభద్రం. వస్తూనే శాస్త్రిగారి పాదాలకు మొకరిల్లింది. ఆమెకు పండితులంటే మక్కువ. సజల నయనాలతో స్వరం గాద్గదికం కాగా—

"మీరు మహా పండితులు కనుక శిష్యులంతా చేరి మీకు గురుపూజ చేస్తున్నారు. నా విద్యలో నేనూ పండితురాలనే! నాకూ శిష్యురాండ్రు ఉన్నారు, కాని నాకు గురుపూజ చెయ్యరు. నాకూ అరవై దాటింది. మీ పూజలో నా పూజ కూడా పూర్తి చేసుకొందామని వచ్చాను," అంది వినయంగా.

"ఐతే మమ్మల్నందరిని కూడా శిష్యులుగా చేసుకొన్నావటే!"–అన్నారు తర్కవేదాంత కేసరులు పేరి లక్ష్మినారాయణ శాస్త్రిగారు. సభంతా నవ్వులు.

ఆ రోజు రాత్రి తెల్లవారే వరకు గొల్లకలాపం ఆడించి చింతా వీరభద్రం. శ్యామవర్ణం ఆమెది. కళ్లు పద్మ పత్రాలే. రవ్వ పొదిగిన ముక్కు పుడక శోభా కరంగా మెరిసేది. గుండ్రని ముఖం. ఎప్పుడూ చిరునవ్వుతో వెలిగిపోయేది. భారీ విగ్రహం. అనాతవరం ఆత్మకూరి సుబ్బయ్యగారు గురువులు.

కలాపం ప్రారంభమైంది. "సత్యాచార సభా, గుణోజ్జ్వల సభా, సద్ధర్మ కీర్తి స్సభా, వేదాలంకృత విప్రపండిత సభా, విఖ్యాత వీరస్సభా..." అంటూ సభావర్ణన చేసింది. నిజంగా ఆ సభ అలాంటిదే! ఆ సభనలంకరించిన పండితుల పేర్లు వింటేనే కంపం పుట్టుకు వస్తుంది.

పేరి లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, మంగిపూడి వేంకట శాస్త్రిగారు (ఇరుసు మండ), వడలి లక్ష్మీ నారాయణ శాస్త్రిగారు (పిఠాపురం)...ఇంకా ఎందరో షడ్దర్శనీ పారంగతులు...భాష్యాంత వైయాకరణులు...అలంకార శాస్త్ర మర్మజ్ఞులు సభాసీనులై ఉన్నారు.

ఆమెకి అరవై దాటిందేమో నాట్యంలో పండి పోయింది. తమలపాకు పండినా పండితుడు పండినా వన్నె-వాసి తగ్గవన్న నానుడి అభినయించే నర్తకికి... ఆనందించే పండితులకు అతికినట్టే సరిపోయింది. ఇక ఆడేసింది...ఆ ఆటా పాట వర్ణనాతీతం. గుణగ్రహణ పారీణు లున్నారేమోనని విద్యనంతా ప్రదర్శించింది. ఆమె అభినయంలో ప్రత్యేకత ఏమిటంటే...సభ్యులు ఎవరిమటుకు వారే వారి వైపే అభినయిస్తోం దనుకొనే వారు. తెల్లవారింది. శాస్త్రిగారితో పాటు పండితులంతా కూర్చున్నారు.

"పెద్దలు...వారిని బాధపెట్టేవే" – అన్నారు పేరివారు.

"ఆయన కూర్చోక పోతే నే బాధపడనా?"– అంది వవీమని. అసలు మనిషి సూటి. మాట సూటి.

కాలికి కట్టిన గజ్జెలు విప్పుతూ అంది..."నా జన్మ

చరితార్థ మైంది! నా విద్య సార్థక మైంది! నేటితో భరతానికి భరతవాక్యం పలుకుతున్నాను. ఇక గజ్జె కట్టేది లేదు—ఆడేది లేదు. ఇక ఈ తరం వారు రసం అంటే తెలియని వట్టి నీరసపు మనుషులు. వారి ముందు శాస్త్రాన్ని అభినయించటం — శాస్త్రాన్ని అవమానించటమే అవుతుంది!"—అంటూ గజ్జెలు కళ్ళ కద్దుకుంది. అలాగే తిరిగి గజ్జె కట్టలేదు.

## భామ వేషం - ఆహార్యం

తెల్లటి లాగు (నెహ్రూగారి పైజమా వంటిది) సీల మండ వరకు తొడుక్కొనే వారు. దానిపైని జరీఅంచు గల తెల్లని పట్టుచీరను మోకాళ్ల వరకు బిళ్లగోచీ పెట్టి విరిచి కట్టేవారు. మోచేతులకు పైగా జాకెట్టు. రెండు చేతులకు వంకీలు. మెడలో హారాలు. పిరుదుల వరకు జడ. దాని మీద సమస్త దేవతామూర్తుల శిల్పం. జడ బిళ్ల, గాజులు, ఉంగరాలు, రవ్వల దుద్దులు, ఆపైని జూకాలు, చెంప స్వరాలు, కొప్పు గొలుసులు, నుదుట దోసగింజ ఆకారంలో తిలకం. దానిపైన నుదుట పాతిక అంగుళం వెడల్పు వెండిరేకు "చంద్రరేఖ" (అంటారు) తళతళ మెరిసేది. నల్లని దారంతో నెత్తికి కట్టుకొనే వారు. ముఖానికి అరదళం కోటా...కొద్ది పాటి ఎరుపు. చెక్కిళ్లపై మకరికా పత్రాలు. పాపిడి పిందెలు. ముక్కుకు ముక్కెర. నడుముకు ఒడ్డాణం. మువ్వలు పలికేవి. ఏడు వారాల నగలు శరీరంపైని కనిపించేవి. ఇప్పుడైతే గూడకట్టేస్తున్నారు! ఎంత దోషం!! ఎంత దారుణం?

గొల్లవేషానికైతే రంగుచీర, గుండ్రటి బొట్టు, కొప్పు.

* * *

## సభా మర్యాదలు - సరసప్రసంగాలు - రసజ్ఞత

ఆనాటి సభల్లో రసజ్ఞతను మాటల్లోను చేతల్లోను శక్తికి మించి ప్రదర్శించిన వారనేకు లుండేవారు.

ఒకసారి రాజమండ్రిలో హోతా వీరభద్రయ్య గారింట్లో ఐదురోజుల వివాహం జరిగింది. జమీం దారులు వారు.

చాటపర్రు సుందరి అభినయానికి వచ్చింది. ఆ సభలో చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిల్లుగారు, ఆకెళ్ళ లక్ష్మీనారాయణ సోమయాజులుగారు, మిక్కిలి దుర్గయ్య శాస్త్రిలుగారు మహాపండితు లంతా సదస్యా నికి వచ్చి కూర్చున్నారు.

సుందరి అంటే అన్నిటా సుందరే! మాంచి మృదు వైన వాక్కు. సంస్కృతాంధ్రాల్లో మంచి పండితు రాలు. శ్లోకాలు బాగా అభినయించేది. అభినయ కేళిక ప్రారంభమైంది. వర్ణం అయింది. ఇక పదం అభినయించాలి.

"ఏ నాయికను అభినయించమంటారు శాస్త్రుల్లు గారూ?"-అడిగింది.

"చూడు! సుందరీ! బెల్లపచ్చుకు ఒక మూల తీపి ఒక మూల పులుపు ఉంటుందంటావా! నువ్వు ఏ నాయి కను అభినయిస్తే బాగుండదు!"-అన్నారు చెళ్ళపిళ్ళ వారు. అదీ రసజ్ఞతను ప్రకటించే తీరు.

"ఖండిత" నాయికను అభినయించింది.

ప॥ ఎల్లకాల మిట్లయితే-ఎవతె ఓర్తురా! స్వామి!

అ॥ ప॥ తెల్లవారిన దాక-ఇల్లు చేరవైతివి!

అఠాణారాగం—రూపకతాళం.

"ఖండిత నాయికకు అశ్రుపాతం ఉంటుందం టావా?"-అనడిగా రాయన.

వెంటనే "......అస్యాస్తు చేష్టా నిశ్వాస తూష్ణీం భావోఽశ్రుయోచనం, ఖేద భ్రాంత్య స్ఫుటాలాపా ఇత్యాద్యా విక్రియా మతా"—అంటూ ఏకరువు పెట్టింది ఖండిత లక్షణాన్ని.

"అవును! మరి! చదువుకొన్న దానివి గనుక చెప్ప

గలిగావు! అవన్నీ నే నెక్కడ చూచాను!"—అంటూ ఉపరి చమత్కారం విసిరేరు ఆయన.

*　　*　　*

నేటికి నలభై ఏండ్ల క్రితం మాట. కాకినాడలో గణపతి ఉత్సవ సందర్భంగా భరత కళాప్రపూర్ణ అన్నాబత్తుల వెంకట రత్నంగారి గొల్ల కలాపం సాగుతోంది. సభలో దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి గారు, ముక్కవిల్లి కృష్ణమూర్తి శాస్త్రిగారు (భాష్యాంత వైయాకరణులు) ఉప్పులూరి దక్షిణామూర్తి శాస్త్రిగారు (గణపతి శాస్త్రిగారి సోదరులు) ఇంకా ఎందరో పండితు లున్నారు.

కలాపం అద్భుతంగా సాగిపోతోంది. యజ్ఞ ఘట్టం పూర్తయ్యింది. (శ్రౌత కలాపమంతా దోషరహితంగా అభినయించింది...వ్యాకరణ యుక్తమైన వాక్కుతో! ఆనందం పట్టలేక దక్షిణామూర్తి శాస్త్రి గారు (ప్రాయశ్చిత్తార్థ్యం మెరుగని నైష్ఠికులు) తన శిష్యుడు మైలవరపు శ్రీరామమూర్తిని పిలిచి "అబ్బాయి పిన్ని నడిగి కొత్త చీర నూటపదారు రూపాయలు నే నిమ్మన్నానని అడిగిపట్టుకురా" అన్నారు. పండూ తాంబూలంతో సత్కరించారు. అందుకొని "ధన్యోస్మి" అందామె.

పది నిమిషాల తర్వాత శాస్త్రిగారిని వేదిక మీదికి అహ్వానించి, చీర ఉంచుకుని వడ్డీతో కలిపి సత్కరింపబోయింది. ప్రతి గ్రహణం చెయ్యటం మానేసి చాలా సంవత్సరా లయింది అంటూ తిరస్కరించారు.

"ధర్మం తప్పుతారా! బ్రాహ్మణులకు షట్కర్మాధికారాలున్నాయి గదా!"—అంటూ ఇరుకున పెట్టింది. తీసుకొన్నారు.

అలా ఒకరిని మించి ఒకరు రసజ్ఞతను ప్రకటించారు.

*　　*　　*

మరో భువన విజయం. 1940 ప్రాంతం.

అన్నవరం శ్రీ సత్యనారాయణ స్వామి వారి కళ్యాణ సందర్భంగా ఏర్పాటైన సదస్యం అది. ఉదయం 9-00 గంటల కాలం. సభలో చర్ల భాష్యకార శాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు, పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు, వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, బులుసు అప్పన్న శాస్త్రిగారు, పుల్య ఉమామహేశ్వర శాస్త్రిగారు, పిశుపాటి చిదంబర శాస్త్రిగారు—ఇంకా ఎందరో కొమ్ము లేనుగుల్లాంటి పండితులున్నారు.

ఆ సభలోనే పిఠాపురం పెండ్యేల సత్యభామ కూడా ఉంది.

"సత్యభామా! పండితుల కంతా సదస్యంలో ఒక్కటే తాంబూలం. నీకు మాత్రం రెండు తాంబూలాలు!"—అన్నారు రాజా ఇనుగంటి ప్రకాశరాయణింగారు. (రెండు తాంబూలాల మర్యాద ప్రాచీనంలో శ్రీహర్షునిది...జయచంద్రుని ఆస్థానంలో)

రెండు తాంబూలాలంటే...స్వామి కళ్యాణంలో నవజనార్దనానికి నూటపదార్లు, సదస్యంలో పండితులతోపాటు నూటపదార్లు...సత్కారం ఆమెకుంది.

"అది స్వామివారి అనుగ్రహం" అందామె.

తరువాత సంభావన నవరస భరితంగా సాగుతోంది. సత్యభామను ఏదైనా అభినయించమన్నారు రాయణింగారు. స్వామివారికి లేఖను వ్రాస్తూ, విదిక్కులను నిషేధించి, ప్రాగ్దిశ ప్రాశస్త్యాన్ని పొగడుతా ప్రాఙ్ముఖంగా కూర్చుని వ్రాసింది. ఆపై శ్లోకాన్ని పద్యాన్ని అభినయించింది.

"భళా!" అన్నారు చిదంబర శాస్త్రిగారు

'సంతోషించటం గాదు. సమ్మానించాలి"—అన్నారు వెంటనే రాయణింగారు.

"మా దగ్గరేముంది సమ్మానించటానికి? మీరిస్తే పుచ్చుకోటానికి మేం వచ్చాం".

"ఏమీ లేదా? ఏమీ లేదా? అంటూ రెట్టించి సాభిప్రాయంగా చూశారు శాస్త్రిగారి చెవులకేసి.

"ఈ కమలాలున్నాయి" రవ్వల కమలాలవి!

"అవే ఇవ్వండి"

సందేహిస్తున్నారు శాస్త్రిగారు. ఎందుకంటే వాటి విలువ గురించి కాదు. వాటికో చరిత్ర ఉంది. రాజా వారి దర్బారులో ఆయన శతావధానం చేస్తే రాజా వారు మెచ్చి స్వయంగా ఇచ్చిన వజ్రాల కమ్మలు అవి. ఒక నట్టువరాలి కిస్తే రాజావారికి కోపం వస్తుం దేమో! రాజావారు అసలే యాంటీనాచ్!

ఐనా సరే! తీసి ఆమె కిచ్చేశారు! దోసిలొగ్గి గ్రహిం చింది! కొద్దిసేపయాక వాటిని తిరిగి శాస్త్రి గారి ముందుంచి 'స్వామీ! వీటిని నేను భరించలేను! భరించలేను! విప్రధనము కన్న విషమే మేలు అన్నారు పెద్దలు. మీది మీరే గ్రహించండి! ఇంత మంది పండితుల మధ్య ఈ గౌరవం చాలు నాకు"— అంది వినయంగా.

"సత్యభామా! నీ గంతులో నీవయసు కనుపించ టం లేదు—"అన్నారు కవి సమ్రాట్ సత్యనారాయణ గారు.

రాయల వారిచ్చిన కర్ణకుండలాలను ఒక భట్టు కిచ్చేశాడు ముక్కు తిమ్మన్నగారు...తనమీద చెప్పిన ఒక పద్యానికి సంతోషించి.

అదీ...రసజ్ఞత!!! వెల్లువకాలి!!!

* * *

## అరసికులు-అమాయకులు

"అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ"—అరసికుల దగ్గర కవిత్వం చెప్పే దౌర్భాగ్యం నా నొసటను వ్రాయ కని ముమ్మారు మొరపెట్టుకొన్నాడో కవి

"గాఢా లింగన సౌఖ్యము, ప్రౌఢాంగన ఎరుగు గాక బాలే మెరుగున్" అన్నాడింకో కవి.

కవులకు కళాకారులకు అరసికులతో బాధలు తప్పవు.

అలాంటి అరసికులవల్ల గాయపడి నాట్యవిద్యకు ఉద్వాసన చెప్పిందొక...కళామూర్తి.

ఒక గ్రామంలో...కమాచి వర్ణం "సామిని రమ్మ నవే!"...అభినయిస్తూంటే; చుట్ట నోట్లో పెట్టుకొన్న ఒక మోతుబరి "స. ప. స. లోనే తోసేత్తన్నావు కాలమంతా! అపనతనమన ఆడేహె" అన్నాడు. పండి తులు ముందున్నారు సభలో! కాని నోరు మెదపలేదు. కారణం అప్పటికి మనకు స్వతంత్రం వచ్చేసింది.

"బాబూ! మా గురువులు ఆ విద్యలు మాకెప్పుడూ చెప్పలేదు. మేము నేర్చుకోనూలేదు. అసలటువంటివి ఉన్నాయని కూడా తెలీదు. మీరిప్పుడు అడిగారు కనుక నేర్చుకొని రేపు ఆడతాను"—అని చెప్పి కారెక్కి ఇంటికి వచ్చేసింది.

కలికాలం దోషం కాబోలు! శాస్త్రం చెరుకుముక్క లాంటిది. అది అందరి పన్ను దిగదు, అని అను కొని ఆ రోజునుండే తన కళాజీవితానికి స్వస్తిచెప్పింది.

* * *

ఒకసారి కోనసీమలో భామాకలాపం జరుగుతోంది మాధవి కృష్ణుని బ్రతిమాలుతోంది సత్యభామవద్దకు రమ్మనమని. ఎంత బ్రతిమాలినా స్తంభంరాటకు చేర బడి కూర్చున్న కృష్ణ పాత్రధారి మాత్రం వినటం లేదు. "పోవే!!"అంటున్నాడు.

అదంతా చూస్తున్నాడు దూరాన్నుండి...ఎవరు? ఒక గొల్లవాడు! "గొల్లని సాహిత్య విద్య" ఊరికే పోతుందా మరి! ఒక్క ఉదుటున లేచాడు...కఱ్ఱ ఊతతో! నోట్లో చుట్ట అవతల పారేశాడు.

"జాము సేపట్నుంచి సూత్తన్నాను! మాలచ్మి లాంటి పేరంటాలొచ్చి అంతల్లా బతిమాల్తోంటే అలా గునుస్తావేటి? లెగెహ్! లెక్కపొయ్యేవంటె మునగాల కఱ్ఱు (ముల్లుకఱ్ఱ)చ్చుకుని ఒక్క పోటొడుత్తాను!"— అంటూ తన రాసిక్యాని వెల్లడించాడు.

* * *

ఇలాటి అరసికులు అందరిలోను ఉంటారు. తెల్ల

వార్లూ భామాకలాపం చూసి వచ్చిన ఒక పండిత మ్మన్యుణ్ణి అడిగారట...ఎవరో...భామ ఎలా ఉందిరా? అని.

"ఏం చెప్పమంటావు! ఒరే! జడ కూర్చిలా ఉంది! ముక్కు ఉచ్చిష్ట పింఢంలా ఉంది. కళ్ళు పవిత్రాల్లా ఉన్నాయి! స్తనాలు పార్వణ ముద్దల్లా ఉన్నాయి! ఇహ...అది అభినయిస్తోంటే...ఇదమిద మన్నం... ఇదమిద మన్నం..,అంఛోందిరా!"—అన్నాడుట.

అవును మరి అపర కర్మలు చేయించేవాడికి అంత కంటే ఉదాత్తమైన ఉపమానాలేం దొరుకుతాయి?

ఇంకో అరసికుడు కోనసీమలో వాడపల్లి వెంకటే శ్వరస్వామి తీర్థానికి వెళ్ళాడు. అక్కడ భామాకలాపం చూశాడు. తన స్నేహితులతో ఆ ముచ్చట చెప్తున్నాడు.

ఉ॥ చేరువ వాడపల్లి నరసిమ్మడి తీరతమ్మోయి బోగమ
మ్మోరుల యాట సూత్తి దని ముంగల దేముడదెంత విద్దెలో
తీరు పయాస గంటి ఒక తిత్తిని గున్కిడి ఊదువాని కా
లూరక మొక్క బుద్ధి యనుచుండును మూర్ఖుడు..."

బోగమమ్మోరుల ఆట తీరు ప్రయాస చూశాడుట! కాని తిత్తి (శృతి) ఊదేవాడిదేనట అసలు కష్టం అంతా! అందుకని తిత్తిగాడి కాలికి దండం పెట్ట బుద్ధివేసింది అంటాడా మూర్ఖుడు!

"అల్ప విద్వాంసుడు ఆక్షేపణకు పెద్ద
మూర్ఖచిత్తుడు కోపమునకు పెద్ద"

ఇలా ఎన్నో ఉన్నాయి అరసికులతో పండితులు పడే పాట్లు.

## కలాప విద్య - హాస్యం

సాధారణంగా నర్తకికి భరతవిద్య నేర్పిన గురువులే హాస్యం కూడా చెప్పేవారు. ఇటీవలనే పరమపదించిన నరసింహంగారు (అలమూరు) కొండూరు వినన్నగారు (ఉండి అగ్రహారం) వీరితో ఒక తరం హాస్యం ముగిసిందని చెప్పవచ్చు. వీరంతా శ్రోత్రీయులు.

హాస్యం అంటే తేలికైనది గాదు. నవరసాలలోను అదీ ఒకటి. కలాపంలో హాస్యగాని పాత్రయొక్క ఔచిత్యం గురించి నరసింహంగారు చక్కని నిర్వచనం చెప్పారు.

కలాపంలోని ఇతివృత్తం పురాణంలోనిది. సాహిత్యం ప్రాచీనం. ఇక సభ మాత్రం నవీనం. అందుకని పురాణంలోని ఇతివృత్తం ఆధారంగా ప్రాచీన సాహిత్యంలో రచింపబడిన కథని నవీన కాలానికి (సభకి) సభారజంకంగా ఉండేటట్లు (మర్యాదకు భంగం లేకుండా) అన్వయించి చెప్పడంలోనే హాస్యపాత్ర యొక్క చతురత ఉంటుంది.

ఎంత అందమైన నిర్వచనం! ఎంత విప్లవ తత్త్వం!!

అంటే విదూషకునికి గ్రంథం లేదని కాదు. దరువుకు దరువు, పద్యానికి పద్యం, వచనానికి వచనం, కందుకకు కందువ, ముచ్చటకు ముచ్చట భామ కున్నంత గ్రంథం విదూషకునికి ఉంటుంది.

నరసింహంగారు మంచి రూపసి. చెవులకు దుద్దులు చేతులకు మురుగులు ఉండేవి. రావూరి కోటయ్య (సమరస) గారి దౌహిత్రుడు. కోటయ్యగారంటే కోనసీమలో భరతవిద్యకు వ్యాసపీఠం. ఒకసారి కలాపంలో కృష్ణవేషానికి ఎవరూ లేకపోతే నరసింహం గారిని కూర్చోపెట్టారు వాళ్ల తాతగారు. అదుగో అలా అంటుకొంది ఈ మరద నరసింహంగారికి.

నరసింహంగారు గొప్ప చతురులు. ఆయన హాస్యం ఒక్కొక్కప్పుడు రోహిణీ కార్తె ఎండలా మలమల మాడ్చేసేది. ఆయనను అవమానించాలని ప్రత్యేకించి ఒక కులం పెద్దలు భామాకలాపం ఏర్పాటు చేసి ఆ పద్ధతి చూశారు.

ఒక్కొక్కప్పుడు ముల్లు గుచ్చుకున్నట్లు చురుక్కు మనేవి!

ఒకసారి శ్రీవిరాజితం ఆడుతోంది. "నృత్యం కరోమి భూదేవి క్షమ్యతాం పాదతాడనం" అంటూ నాలుగు అడుగులు కొలిచి ఒక గంతు వేసింది.

"కొలు!కొలు! కోనసీమంతా కొలిచే శావు!" అన్నాడు. విద్యచేత సౌందర్యంచేత రసజ్ఞులను వశం చేసుకొన్నావని తాత్పర్యం.

మరొకచోట...మరోసారి.

"పదపద్మములు తడబడ సాగెనోయమ్మా!" అనే దరువు ఆడుతోంది.

"ఇంక...ఇప్పుడు పరవాలేదులే! అది ముసుపు. మందు పుచ్చుకొన్నావుగా! తగ్గిపోయింది" అన్నాడు. ఆమె జబ్బు సంగతి మందు పుచ్చుకోవటం సంగతి లోకానికి వెల్లడయింది.

ఒక్కొక్కసారి ఆయన హాస్యం శీతాకాలపు ఎండలా గిలిగింతలు పెడుతుంది.

ఒకసారి ఐనవిల్లిలో శివరాత్రికి శ్రీ విరాజితం భామాకలాపం ఆడుతోంది, నరసింహంగారే హాస్యం.

"ఏడమ్మా! నానాథుడు? ఇందరిలోన..."-అంటూ సభలో ఒక్కొక్కరినే చూపించి అభినయిస్తోంది. ఎదురుగా పెద్ద పెద్ద పండితులంతా ఉన్నారు. అందులో బులుసు అచ్చయ్య శాస్త్రిగారున్నారు. పాపయ్య శాస్త్రిగారి పుత్రులు. పాపయ్య శాస్త్రిగా రంటే అప్పయ్య దీక్షితుల వారంతటి పండితులు. "శ్రీమాన్ సర్వదిగంతరాళ విదితత్రైయర్థ నిర్ధారణ ప్రజ్ఞా శాలిషు పండితేష్వ చరమః పాపయ్య శాస్త్రీ మహాన్" అంటూ సముద్రాల అప్పలాచారిగారు కీర్తించారు వారిని.

అలా అభినయించటంలో అచ్చయ్యశాస్త్రి గారి వైపు హస్తం చూపించింది.

"అయ్యో! అయో! అచ్చయ్య శాస్త్రిగారే! ఆయన మీద పడిందేమే నీ కన్ను?"

"నామీద పడిందేమిరా నరసింహం నీకన్ను అన్నారు శాస్త్రిగారు.

సభంతా నవ్వులు.

నరసింహంగారు ఒక హాస్య నిఘంటువు. ఆయన హాస్యంలో లోకం అంతా ప్రతిఫలించేది.

"నీ నాథుడు ఏ ఊరివాడో ఏ పల్లెవాడో ఏ అందం వాడో ఏ చందం వాడో చెప్పు చూద్దాం?" అనగానే "శంఖం ధరించి నటువంటివాడే ఓయమ్మా! అంటుంది భామ. "జంగంకాడు కదా"—అని జంగాల పుట్టు పూర్వోత్తరాలు చెపుతాడు.

"చక్రం ధరించి నటువంటి వాడే ఓయమ్మా!" అంటే "కుమ్మరి కాదు గదా"—అంటూ కుండను చెయ్యటం అంతా అభినయించి చూపేవాడు.

ఇంతలో పంతగాడు అడుగుతాడు 'స్వామీ! ఏమిటి చేస్తున్నారు?" అని.

"ఉండరా! మాట్లాడకు! కడుపు చేస్తున్నాను",

"ఎవరికి?"

"ఎవరికా? కుండకి"—అలాగే పీక కోస్తున్నాను అనేవాడు. ఈ మాటలు వృత్తి రీత్యా కుమ్మర్లు అనే మాటలు.

ఈ కథకే క్రాపనుంచి వచ్చారు నలుగురు మార్దంగికులు. ఆ నలుగురూ అన్నదమ్ములు. విశ్వ బ్రాహ్మ ణులు. నలుగురు నాలుగు జాములు వాయించారు. ఒకరిని మించి ఒకరు అపరనందీశ్వరులు. మూడో జాములో వస్తుంది "పద పద్మములు తడబడ సాగె నోయమ్మా!" అన్న దరువు. "సప్తతాళాలు తిప్పే శాడు మూడో ఆయన.

నరసింహం గారి హాస్యానికి అందరూ నవ్వేవారు ఒక్క నాయుడు మాణిక్యం (భామ) తప్ప. భామ నవ్వితే రసభంగం.

* * *

# అభినయ కేళికా సరసిలో జలకేళి పచరించిన సీమ-కోనసీమ

## అభినయ కేళికలు ఆనంద డోలికలు

"ప్రయోగ ప్రధానంహి నాట్యశాస్త్రమ్"

నాట్య విద్యలో రెండు భాగా లున్నాయి. ఒకటి ఆట- రెండవది అభినయం.

సుఖదుఃఖములచే మిశ్రమమైన లోక చరితాన్ని అనుకరించి చూపటమే నాట్యం. ఆ యనుకరణ అభిముఖంగా (ఎదురుగా) జరుప బడుతుంది గనుక "అభినయం" అని పిలువబడుతోంది. అది నాలుగు రకాలు. అంగికము (చేష్టలు), వాచికము (మాటలు), సాత్త్వికము (భావం), ఆహార్యం (వేషము). ఈ నాలుగురకాల అభినయాల్లోను సాత్త్వికాభినయం చాలా గొప్పది. సత్త్వమనగా పరుల కష్ట సుఖాలను భావించుటకుగాను మనస్సు మిక్కిలి అనుకూలంగా ఉండడం. అట్టి సత్వం వలన పుట్టిన భావం కనుక "సాత్త్వికం" అంది. అవి మొత్తం ఎనిమిది. వ్యభిచారి భావాలు ముప్పైమూడు. వీటికి నాయికా నాయకులు ఆలంబనం. అలంకార శాస్త్రాదులలో రస ప్రకరణంలోను, నాయక ప్రకరణంలోను విపులంగా ఈ విషయాలు చర్చించ బడ్డాయి.

## అభినయ స్వరూపం

అభినయ మేళానికి కావలసిన కనీస జట్టులో— అభినయించే అభినేత్రి (అమె నాయకురాలు) ఆమె కిరువైపుల వంత పాడుతూ తాళం వాయించే కళా మూర్తు లిద్దరు. మృదంగం, ఫిడేలు, శ్రుతి ఉంటాయి. ఇంకా కొందరు నట్టువరాండ్రుండవచ్చు.

"కేళిక" ప్రారంభంలో సభావందనం చేసి సభా వర్ణన చేసేవారు. "వినాయక కౌతం"తో గణపతి ప్రార్థన. దేవీ స్తుతి చేసి, ఆపైని జతి విన్యాసంతో సభను అలరింప చేసి, వర్ణం ఎత్తుకొనేవారు. సంగీత కచేరీలలోనైతే...తానవర్ణం, అభినయానికి పదవర్ణం వేర్వేరుగా ఉంటాయి. అలాటి వర్ణాలు చాలా ఉన్నాయి. అందులో కొన్ని-

1. నవరోజు వర్ణం-ఇంతైనా దయలేదా ఇంతిపైన
2. మోహన ,, -సరిగా దానిపై నెనరుంచి
3. తోడి ,, -దానికే తగు జాణర
4. భైరవి ,, -నీ సాటి దొర నీవని నెఱ నమ్మినానుర
5. బేగడ ,, -తిరిగి చూడవదేమిర
6. కమాచి ,, -సామిని రమ్మనవే
7. శంకరాభరణం -మరులు నిలుప జాలరా
8. మోహన ,, -నిన్నే కోరి వచ్చినాను
9. భైరవి ,, -సామీ! వినరా! చెలిసాటి
10. ధన్యాసి ,, -ఏ మగువ బోధించెరా

ఇందులో కొన్ని నాయిక వాక్యాలు. కొన్ని దూతి వాక్యాలు. వాక్యం అంటే నాయక పరంగాను దూతి పరంగాను చెప్ప బడ్డవి. నాయిక లక్షణం అంతర్భూతం. సాహిత్యానికి వర్ణంలో స్వరం ఉంటుంది. సాహిత్యాన్ని, స్వరాన్ని మూడుకాలాల్లోనూ పాడి అభినయించేవారు...హస్తాలు ముద్రలు చూపుతూ. వర్ణం పూర్తి అయేసరికి గంటన్నర పట్టేది.

ఆపైని పదం ఎత్తుకొనేవారు. పదాలు కొన్ని వేలున్నాయి. పదానికి స్వరం ఉండదు. ప్రతి పదానికి నాయకుడు—నాయక సహాయకులు, నాయిక—నాయిక సహాయులు ఉంటారు. అష్టవిధనాయికలు...స్వీయ, పరకీయ, సామాన్య భేదం చేతను...స్వీయలో ముగ్ధ, మధ్య ప్రగల్భ (వీటిలో తిరిగి అవాంతర భేదాలున్నాయి) భేదం చేతను; పరకీయలో కన్య-పరోఢ భేదం చేతను(అవాంతర భేదాలున్నాయి) సామాన్యలో ఉత్తమ-మధ్యమ-అధమ భేదం చేతను—మొత్తం 384 భేదములు గలవా రగుతారు. ఇంకా సూక్ష్మంగా

విచారణ చేస్తే స్త్రీ ప్రకృతి 16 వేల సంఖ్య కలదిగా తేలుతుంది.

సాధారణంగా పదాలు శృంగార రసాత్మకంగా ఉంటాయి. ఇలా అరణ్యంలా విస్తరించుకొంటూ పోయిన నాయిక ప్రకరణంలో నుండి నాయికాభావాన్ని గుర్తెరిగి ఆ భావాన్ని పోషించుకొంటూ; హస్తాలు, ముద్రలు పట్టి అభినయించేవారు. ఒక పదం ఒక గంట పట్టేది.

ఆపైని ఒక జావళీ అభినయించేవారు. ఈ జావళీలు రచనలోను, అభినయంలోను బహు సుకుమారంగా ఉంటాయి.

ఆపైని ఒక శ్లోకంతో ఆఖరు. ఈ క్రమం పూర్తయ్యేసరికి మొత్తం మూడు లేదా నాలుగు గంటల కాలం పట్టేది. ఇదంతా కూర్చునే అభినయించేవారు. సభ్యులు కూడా అభిముఖంగా కూర్చుని చూసి ఆనందించేవారు. నాలుగు గంటల కాలం విసుగు లేకుండా కూర్చునే వారంటే..ఆ యభినయం ఎంత రసాత్మకంగా ఉండేదో ఊహించుకోవచ్చు.

కోనసీమలో ఒకసారి అభినయం సాగుతోంది. సభ్యులంతా పద్మాసనాసీనులై ఉన్నారు. ముందు వరుసలో కూర్చున్న ఒకాయన కాలిక్రిందికి కుమ్మరి పురుగు దూరింది. దానిని అభినేత్రి గమనించింది. ఆయన మాత్రం కదలలేదు. ఆ పదం పూర్తయ్యాక ఆమె అడిగిందాయనను, "కుమ్మరి పురుగు మిమ్ములను బాధించలేదా?" అని. దాని కాయన చెప్పిన సమాధానం వింటే ఆశ్చర్యం వేస్తుంది. "రసభంగం కలుగుతుందేమోనని...కదలలేదు" అన్నాడాయన. భారతంలో కర్ణుడు గుర్తుకు వస్తాడు. అలా ఉండేవి అ సభలు.

* * *

1850 నుండి 1950 వరకు ఈ వంద సంవత్సరాల మధ్యకాలంలో, అభినయంలో ఆరితేరిన విద్వాంసురాండ్రు వందల కొలది ఉండేవారు. 1925కే కొందరు గతించగా కొద్దిమంది 1950 లేదా 1960 వరకు ఉన్నారు. ఇప్పటికీ ఇంకా కొందరు ఈ ప్రచారయుగంలో పేరు పడలేక చరిత్ర హీనులుగా మిగిలి ఉన్నారు. కొందరు కీర్తిమూర్తుల పేర్లు ముందే ఇచ్చాను. అభినయ విద్యలోను, కలాప విద్యలోను కించిత్తు కూడా కొరతలేని పూర్తి పాండిత్యం వారిది. సభ్యులంతా అలంకార శాస్త్ర మర్మజ్ఞులే!

* * *

## వేద ఘోష-గజ్జెల మ్రోత

1950కి పూర్వం స్వామివారి కళ్యాణాలైనా, ఆసామీల వివాహాలైనా ఐదురోజులు జరిగేవి. అన్ని రోజులు అభినయం సాగేది. రాత్రి 10-00 గంటలకు ప్రారంభమైతే తెల్లవారేది. మళ్ళీ మధ్యాహ్నం 3-00 గంటల నుండి 6-00 గంటల వరకు. ఎన్ని వర్ణాలో ఎన్ని పదాలో జావళీలో...అదొక రస ప్రపంచం. పందిరి వేసి తోరణం కడితే ఆ పందిట్లో వేద ఘోష గజ్జెల మ్రోత వినిపించక పోవటం అంటూ లేదు.

చింతా వీరభద్రం అభినయిస్తూంటే అది అభినయంలా తోచేదిగాదు. అంత సహజంగా ఉండేది. అసలే కళ్ళు పెద్దవేమో ఆ కళ్ళతో చూసి కోపాన్ని అభినయిస్తూంటే ఎంతటి వారైనా జంకేవారు. మీద పడిపోతున్నట్లుండేది. మామూలు వాళ్ళెవరూ ముందు కూర్చునేవారు కారు. తోడి వర్ణం ఆమె సొత్తు.

శ్రీ విరాజితం (గంగలకుఱ్ఱు) మహా సౌందర్య రాశి. ముంగురులు కత్తిరించిన జాలరులా ఉండేవి. కర్ణాటకం (సంగీతం) ఆమె సొత్తు. అభినయం అక్కర లేకుండా పాట ఒక్కటే సుబ్బలక్ష్మి కచేరీలా ఉండేది. ఇంక అభినయం తోడైతే బంగారానికి పరిమళం తోడైనట్లే!

ఒకసారి చింతా వీరభద్రం పేరూరు జమీందారు గారి దేవిడీలో ఆనంద భైరవి-అట తాళంలో, 'స్త్రీయ'

నాయిక పదంతో తన దుస్థితిని చెలికత్తెతో చెప్పుకొనుటను అభినయించి కరుణరసం చిప్పిల్లచేసి, పట్టుచీర బహుమానంగా పట్టుకెళ్ళింది.

మద్దుల వరహాలు (మానేపల్లి) జావళీలు వందల కొలది పూలజల్లులా కురిపించేసి.

మా గ్రామంలో అంటే పేరూరు శివారు విశ్వేశ్వరుని అగ్రహారంలో వేంచేసియున్న శ్రీ విశ్వేశ్వర స్వామి వారి కళ్యాణ సందర్భంగా...(పెద్దల వలన వినిన చరిత్ర కందినంతవరకు) గత నూటయాభై సంవత్సరాలనుండి ఎందరో కళామూర్తులు తమ అభినయ కళా కౌశలాన్ని ప్రదర్శించేరు. 1930 నుండి వరుసగా దాదాపు నలభై సంవత్సరాలు అన్నాబత్తుల వేంకట విజయ గోపాలరత్నం తన అభినయ విద్యను ప్రదర్శించి ఇప్పుడు విశ్రాంతి తీసుకొంటున్నారు

వర్తమానంలో ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ సప్తమినుండి దశమి వరకు సాగే స్వామి వారి కళ్యాణ సందర్భంగా భరత కళాప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులి వెంకట రత్నం మనుమరాలు శ్రీమతి లక్ష్మీ మంగతాయారు వచ్చి కొడిగట్టిన దీపంలా ఉన్న విద్యను ప్రతి సంవత్సరం ప్రదర్శించి పెంచుతోంది.

పేరూరు శివారు
విశ్వేశరుని అగ్రహారం
2-3-1984

## ముగింపు

ఇదంతా ఒకనాటి మాట! కాలగర్భంలో కలిసిపోయిన విద్వత్ కళామూర్తుల స్మరణ! స్మృతిపథంలో మాత్రమే నిలిచియున్న కళావైభవం! వేయి రేకులతో వికసించి విద్యుత్ ప్రభలు విరజిమ్మిన పద్మం... రేకులన్నీ రాలిపోగా...ఒక్క రేకు మిగిలి...ఒంటి కాలి భరతంలా...దీనంగా చూస్తోంది.ఆ వైభవాన్ని ఎరిగి... దాన్ని పానం చేసిన భ్రమరం మాత్రం... కమలాన్ని విడువలేక...కన్నీళ్లతో లోకానికి తెలియని పాటలు ఏవో పాడుకొంటూ...అక్కడే తిరుగుతోంది!

## కృతజ్ఞతలు

కళామూర్తుల చరిత్ర పోయింది పోగా, కొంతైనా చరిత్రపుటల కెక్కించాలనే సత్సంకల్పంతో రామకృష్ణగారు ఈ తిలకం నన్ను దిద్దమన్నారు. శక్తివంచన లేకుండా వ్రాశాను. రసజ్ఞుల ముందుంచుతున్నాను. ఇదంతా వ్రాయటానికి పూర్తిగా విషయాలన్నీ చెప్పిన బ్ర॥ శ్రీ॥ వేదమూర్తులు, కవితా భూషణ, విద్వత్కవిశేఖర బిరుదాంకితులు, కళా ప్రపూర్ణ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారికి (88 సం॥) నా నమస్కారాలు. అలాగే కొన్ని విషయాలు చెప్పిన బ్ర॥శ్రీ॥ మైలవరపు శ్రీరామమూర్తి, వేదుల జనార్దనం,కాశీభట్ల సత్యనారాయణ, యమ్.ఏ. వడ్లమాని సుబ్బారావుగార్లకు నా కృతజ్ఞతలు.

ఇట్లు
విశ్వనాథ సత్యనారాయణ మూర్తి

# నవజనార్దనం

## సత్యభామా కలాపం

మన భారత దేశంలో వెలువడ్డ నృత్య సంగీత రూపకాలలో ముఖ్యమైనవి సంస్కృతంలో జయదేవుని గీతగోవిందం, తెలుగులో భామా కలాపం. మన దేశంలోని ఇతర ప్రాంతాలలో ఇటువంటివి కనపడవు. పూర్వం ఈ కలాపాన్ని పారిజాతం అనడం ఆచారంగా ఉండేది. పారిజాతం ఒక దృశ్య ప్రబంధం.

జయదేవుని గీతగోవిందాన్ని అభినయించడానికి ముందు దైవపరమైన చూర్ణికను పఠించాలి. నా గురువుగారైన పూజ్యులు, నృత్యసరస్వతి శ్రీమతి నాయుడుపేట రాజమ్మగారు ఈ అభినయ విధానాన్ని నాకు నేర్పారు. చూర్ణికను పఠించిన తర్వాత

'జయదేవ కవి రచిత ప్రబంధ బృందం
సమస్త రస భావన మూలకందం
నానా విధ రాగ బృందం, గీత గోవిందం
సర్వ జనానందం,
భరత శాస్త్రానుసారేణాభినయ
హం కరోమి...'

అంటూ ఆలపించి, పూవులను సమర్పించి, "ప్రళయ పయోధి జలే-" అనే దశావతార నర్తన నృత్య రేఖను చేయడం ఒక పద్ధతిగా ఉండేది.

బ్రహ్మశ్రీ భరతకళానిధి వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు నాకు కూచిపూడి నాట్యానికి గురువులు. వారివద్ద 'కూచిపూడి భామా కలాపాన్ని' అభ్యసించాను.

"అభ్యుదయ పరంపరాభివృద్ధిగా, నా
యొనర్పంబూనిన
పారిజాత ప్రబంధంబునకు, శృంగార
కావ్యంబునకు,
నాటకాలంకారంబునకు, భావజ్ఞానంబునకు, రాగ
జ్ఞానంబునకు, తాళ జ్ఞానంబునకు, శ్రీకృష్ణ చిద్విలాసంబునకు కథాక్రమంబెట్టి దనిన..."

పూర్వం ప్రబంధ సంప్రదాయంలో విశిష్టమైన రచనలు వెలువడినట్లు మనం పై రెండు గద్యాల వలన గ్రహించవచ్చును. అత్యంత రమణీయంగా, రస నిలయాలుగా నృత్త, నృత్య అభినయాలతో అలరారుతూ, శాస్త్రకారులూ, పండితులూ, పామరులచే విశేషంగా కొనియాడబడి ఆదరింపబడుతూ ఉండేవని కూడా చెప్పవచ్చును.

## పారిజాతం - నవజనార్దనం

సత్యభామా కలాపాన్ని నవరాత్రుళ్ల గ్రంథంగా రూపొందించి, ప్రదర్శించిన సంప్రదాయం ఒక్క పిఠాపురంలో మాత్రమే ఉండేది. అక్కడకూడా ఒక్క శ్రీమతి పెండ్యేల సత్యభామగారి వంశీయులు మాత్రమే ఈ విశిష్ట కళారీతిని చేపట్టి ప్రదర్శించారు. ఇటువంటి అద్వితీయమైన నృత్య కళారీతి భారత

దేశంలో మరెక్కడా లేదని చెప్పగలను. ఆంధ్ర నృత్య కళాకారులు నృత్య కళా సరస్వతికి సమర్పించిన అమూల్యమైన కానుక ఇది. తెలుగు జాతి గర్వించదగిన విషయ మిది.

కథ ఏమీ లేకుండా, ఒక చిన్న సంఘటనను తీసికొని ఒకే నర్తకి అలంకారాలతో, వర్ణనలతో, ఛందోరీతిని గానంచేస్తూ, నృత్త, నృత్య అభినయాలతో తొమ్మిది రాత్రుళ్లు ప్రదర్శించి, రసజ్ఞులను, విమర్శకులను, పండితులను, పామరులను మెప్పించడం ఎంత కష్టమైన కార్యమో మనం ఊహించవచ్చును. అయితే యిటువంటి కష్టమైన కార్యాలను సులువుగా సాధించడం మన తెలుగువారికి వెన్నతో పెట్టిన విద్య.

పిఠాపురం నృత్య కళాకారిణులలో ఎవరైనాసరే ఈ నవ జనార్దనాన్ని పూర్వం తొమ్మిది రాత్రిళ్లు ప్రదర్శించేవారు. దీనినే మండపేట కళాకారులు మరొక విధంగా ప్రదర్శించేవారు. సంగీత సరస్వతి శ్రీమతి మండపేట మాణిక్యంగారి కాలంలో ఒకే రంగస్థలంపైని తొమ్మిదిమంది కళాకారిణులు ఒకరాడిన దరువు వేరొకరు ఆడకుండా కేళిక చేసేవారని నాకు శ్రీమతి పందిరి వేంకట రత్నమ్మగారు చెప్పారు. ఇది మరొక విశేషమైన ప్రక్రియ.

ఆంధ్రదేశంలో ఈ భామాకలాపపారిజాతం వివిధ రీతుల్లో వికసించి ఆంధ్రకళాకారుల హృదయసీమల్లో చిరస్థాయిగా నిలిచిపోయింది.

ఈ కృష్ణ సత్యల ప్రణయగాథలోని సత్యభామ పాత్ర ఒక అపూర్వమైన, అపూరూపమైన, అద్వితీయమైన, అత్యంత రమణీయమైన ఆంధ్రుల కళాసృష్టి. మరెక్కడా, ఏ భాషలోను ఇటువంటి కళాసృష్టి మనకు కనబడదు. ఇది ఆంధ్రుల ప్రత్యేక ప్రక్రియ, రాయలసీమకు చేరువలోనున్న కర్ణాటక ప్రాంతాల లోని నృత్య కళాకారులు మన పారిజాత ప్రబంధాన్ని అనుకరించి కన్నడ భాషలో కృష్ణ పారిజాతాన్ని రూపొందించి ప్రదర్శిస్తున్నారు.

గుజరాతు, ఒరిస్సా, వంగ మొదలైన యితర ఉత్తరాది రాష్ట్రాలలో సత్యభామకు ప్రాముఖ్య మివ్వకుండా రాధకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. రాసలీల, రాసక్రీడ, మహారాస దండియారాస మొదలైన వాటిలో రాధామాధవుల విరహ వియోగాలతో గూడిన వారి ప్రణయ గాథలను ప్రదర్శించడం ఉత్తరాది వారి ఆచారం.

ఉత్తరాదివారి ప్రబంధాలలోని రాధ నందుని చెల్లెలయిన కృష్ణుని మేనత్త కాదు. రాధామాధవులను సంబంధించిన కథలలోని రాధ ఒక భక్తురాలు. మధుర భక్తి ఉపాసకులైన రచయితలు సృష్టించిన ఒక ఉన్నత పవిత్ర మూర్తి ఈ రాధ. ఈమె ఒక ఊహా సుందర మూర్తి. ఉత్తరాది వారు ఈ రాధా మాధవుల కల్యాణ మహోత్సవాలను గూడా చేస్తూ ఉంటారు.

నాట్యకళోపాసకునిగా భారత దేశమంతటా పర్యటించాను. ఎన్నో దివ్య క్షేత్రాలను సందర్శించాను. ప్రాచీన ఉత్తరాది వైష్ణవభక్తులు, కవులు రచించిన మధుర భక్తి ప్రబోధక ప్రబంధాలను ఒరియా, బెంగాలీ, వ్రజ, గుజరాతీ భాషల్లో నున్నవి చదివాను. కాని నాకు ఎక్కడా కూడా మన భామాకలాపం వంటి సుందర దృశ్య కావ్యం గోచరించ లేదు.

మన భామా కలాపంలోని సత్యభామ శ్రీకృష్ణుని అర్ధాంగి. ఆయన అగ్నిసాక్షిగా పరిణయమాడిన రాచకన్య, ఆ యుగంలో అత్యంత ధనవంతుడైన సత్రాజిత్తు మహారాజు కుమార్తె, అత్యంత సుందర మూర్తి, సౌందర్య, గర్విత, స్వాధీన పతిక, ప్రగల్భ నాయిక. వీటన్నింటినీ మించి ఆమె వీర వనిత. ముల్లోకాలను కృష్ణభగవానుడు శాసిస్తే ఆయన్నే ఆమె తన చెప్పు చేతల్లో పెట్టుకొంది. ఈ గుణాలన్నీ కలిగిన ఈ సత్యభామ ఆంధ్రుల ఆడబడుచుగా ఆంధ్రుల హృదయ సీమలో స్థిరనివాసం ఏర్పరచుకొంది.

తెలుగుజాతి జీవించి యున్నంత వరకు తెలుగు కృష్ణ పారిజాతం, సవ జనార్దనం అంటే భామా కలాపం జీవించి యుంటుంది. దీనికి తిరుగులేదు.

ఈ పారిజాత ప్రబంధ రచనయు చేసినవారిలో కొందరు ముఖ్యుల గురించి తెలియజేయడం అవసరం.

యోగి సిద్ధేంద్రుడు : ఈయన ఈ కృష్ణ సత్య భాముల కథను రచించి కూచిపూడి నాట్య కళాకారు లను నేర్పాడు. ఈ పవిత్ర భాగవతకళను వీరు ఆరా ధించి, తరించి భాగవతోత్తములైనారు. అందుచే వీరికి కూచిపూడి భాగవతులన్న పేరు వచ్చింది.

మరి ఇంకా ఎందరో కవులు ఈ కలాపాన్ని రచించారు. వారిలో కొందరు తమ పేర్లను అంకిత చరణాల్లో ఉటంకించారు: వేంకటకవి, బంరామభక్త, మంగువారు, మజ్జి వేంకటనాయుడు మొదలైనవారు. మరి కొందరు ఆ యా ప్రాంతీయ దేవతామూర్తులకు తమ రచనలను అంకిత మిచ్చారు. వారి పేర్లు తెలి యవు. కాని వారు అంకితమిచ్చిన దేవతా మూర్తుల పేర్లు: కుంతి మాధవుడు, నెల్లిమర్ల మాధవుడు, ర్యాలి మోహినీ కేశవుడు, చెన్న కేశవుడు, కోరకొండ నర సింహుడు, ద్వారకా తిరుమల వేంకటేశుడు, రంగపురి వేంకటేశుడు, కొడవల్లూరీశుడు, కలువాయి కృష్ణ, మొదలైనవారు. వీరి పేరట చేయబడిన రచనలు నవ జనార్ధన కేళికలుగా ప్రచరింపబడుతున్నవి.

## భామాకలాప ప్రాంతీయ ప్రదర్శనలు:

సాంస్కృతికంగా ఆంధ్ర ప్రదేశాన్ని నాలుగు ప్రాంతాలుగా ప్రస్తుతం విభజించవచ్చును :

1. తూర్పుప్రాంతం, 2. సాగరసీమ, 3. తెలం గాణం, 4. రాయల సీమ.

### 1. తూర్పుప్రాంతం :

గంజాం, శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లా లలో భామాకలాపం విశేష ప్రచారంలో ఉంది. ఇవి ప్రాచీన క్రమపద్ధ వాణికి చెందినవి. ఈ వాణిలో కృష్ణ కేశవుని పురుషుడే ముఖ్యంగా చెబుతాడు. ఇక్కడి కలాపాలు ముఖ్యంగా పురుషులే ఆడుతున్నారు.

### 2. సాగరసీమ :

[illegible] జిల్లాల్లో [illegible] త్రైతే కలాపాలు ప్రసిద్ధంగా ప్రదర్శింపబడుతున్నా [illegible] ఈ వాణి [illegible] ప్రాశస్త్యం. కృష్ణా జిల్లాలోని కూచిపూడి భాగవతుల ప్రదర్శన సంప్రదాయం [illegible] ఈ భాగవతంలో సిద్ధేంద్రుని [illegible] పాల్గొంటూ ఉన్నారు.

### 3. తెలంగాణం :

ఈ ప్రాంతంలో కలాపాలు ప్రదర్శించి [illegible] వారు కనబడ లేదు.

### 4. రాయలసీమ :

ఈ జిల్లాల సీమలో పూర్వం పారిజాతాలనే పేరుతో కలాపాలు ప్రదర్శించేవారు. కాని ఇప్పుడు అవి లేవు. కాలగర్భంలో ఈ సంప్రదాయం కలిసి పోయి, అంతరించిపోయింది. అయితే దేవాలయ మాత్రం ఈ సంప్రదాయాన్ని [illegible] పారిజాతాలను ప్రదర్శిస్తున్నారు.

నేను ఇంతవరకు కలాపాలను సేకరించాను. [illegible] లోని ప్రముఖ కళాక్షేత్రం [illegible] కథా విషయం ఒక్కటే అయినా [illegible] రచనా విధానాలు వేరు వేరుగా ఉన్నాయి.

కృష్ణ సత్యభామల సంవాదాలు [illegible] యుగా వీటిలో కనిపిస్తున్నవి.

1) పదకవితలో [illegible] సత్యభామను శ్రీకృష్ణుడు [illegible] ఆభరణాలు ధరింప చేసి, నిలువుటద్దం ముందు [illegible] యుండగా "సత్యా నీవా [illegible] నేనా." అని అడిగినాడు. [illegible]

భామ "నేనే!" అని సమాధానం చెప్పగా కృష్ణుడు అలిగి వెళ్లినాడు. ఆంధ్రదేశమంతటా ఇది ప్రచారంలో ఉంది.

2) సత్యభామ చేత సర్వాభరణాలు ధరింపచేసి, కృష్ణుడు తాను మోహినీ రూపంలో దేవదానవులకు అమృతం పంచినప్పుడు ధరించిన బంగారు జడను నరకాసురుని వధానంతరం సత్యభామను మెచ్చి యిచ్చిన దానిని గూడ ధరింపజేసి, ఆ జడతో తనను కొట్టమని (ఇదొక శృంగార చేష్ట) ముద్దుగా సత్యభామను శ్రీకృష్ణుడు కోరాడు. తన స్వామికి నొప్పి కలుగ వచ్చునని ఆమె నిరాకరించింది. అందుకు అలిగి అతడు వెళ్లిపోయాడు. మొదటి దానితోపాటు ఇది ఉభయ గోదావరి జిల్లాలో ప్రచారంలో ఉంది.

3) హద్దులు మీరిన శృంగారం. ఇరువురు రతి కేళిలో తేలియాడుతున్న సమయంలో "ప్రియా! నేనెంత గొప్పవాడినో నీకు తెలుసా? పద్నాల్గు భువనాలను నా చిరుబొజ్జలో పెట్టుకొని మోస్తున్నాను!" అని కృష్ణుడు అన్నాడు. అందుకు ఆమె తేలికగా నవ్వి, "ఓస్! ఇంతేనా నా చక్కని స్వామీ? ఆ పద్నాల్గు భువనాలతో కలిపి నిన్నుగూడా నా చను మొనలపై మోస్తున్నాను. కనుక నీ కంటే నేనే గొప్పదానిని!" అని చల్లగా అందిట! దాంతో కృష్ణునికి కోపం వచ్చి అలిగి వెళ్లి పోయాడు. ఈ రచనలోని కలహ కారణంతో శృంగారం హద్దులు మీరింది. ఒక్క నరసింగబిల్లివారు మాత్రమే ఈ కలహాన్ని అభినయిస్తున్నారు.

## మేము ప్రదర్శిస్తున్న పారిజాతం :

"నవ జనార్దన పారిజాతం" తొమ్మిది రాత్రుల గ్రంథం. ప్రతి రాత్రి 10 గంటలకు ప్రారంభించి ఉదయం నాలుగు గంటల వరకు తొమ్మిది రాత్రుల్లు దీనిని ప్రదర్శిస్తూ ఉండేవారు.

ప్రతి దినం రెండున్నర గంటల పాటు వరుసగా ఏడు రాత్రుల్లు ప్రదర్శించడానికి అనుకూలంగా ఉండేటట్టు ప్రస్తుతం ఆ గ్రంథాన్ని నేను రూపొందించాను. ఇందులోని హాస్య భాగాన్ని, మాధవీ వ్యాఖ్యానాన్ని తీసివేసి, కథా వివరణ కోసం మధ్య మధ్య సంధి వచనాలను చేర్చి, ప్రత్యేకంగా సంగీత నృత్య ప్రాధాన్యంతో ఉండేటట్టు చేశాను.

నేటి భామాకలాప ప్రదర్శనలలో హాస్యం హద్దు మీరి ఉంటున్నది. కొన్ని సమయాలలో ఆ హాస్యం సత్యభామ పాత్ర ఔన్నత్యాన్నే కించపరుస్తున్నట్టు అపహాస్యంగా కనపడుతున్నది. అందువల్ల ఆ హాస్యం లేకుండా దరువుల కూర్పుతోనే కథను నడిపించేటట్టు రూపొందించవలసి వచ్చింది. ప్రసిద్ధ కళాకారులు మను కునే కొందరు మాధవి పాత్రను కొజ్జా పాత్రగా ప్రవేశపెట్టి ఆ పాత్ర యొక్క హుందాతనాన్ని చెడగొడుతున్నారు. హిందువులు పవిత్రంగా భావించే భాగవతానికే కళంకం చేకూరుస్తున్నారు. మన మతంలో, ధర్మాలలో, మన పురాణేతిహాసాలలో విశ్వాసం గల మనమే వాటిని చౌకబారు హాస్యంతో కించపరచడం, ప్రేక్షకులను నవ్వించి, ఆకర్షించడం కోసం వాటిని అపవిత్రం చేయడం నన్ను బాధించాయి. ఇలాంటి హాస్యం లేనంత మాత్రాన కథకు నష్టం లేదు, కథ కుంటుపడదు, అపచారంగాని, అవమానంగాని, అపకారంగాని జరగదు. ఇలాంటి హాస్యాన్ని ప్రదర్శించిన పెద్దల్ని చూశాను. వారిలో కొందరు గొప్ప పండితులు, విజ్ఞానవంతులు, సర్వ శాస్త్ర పారంగతులు. వీరు పాత్ర ఔచిత్యానికి భంగం కలుగకుండా చక్కగా పోషించారు. ఈనాడు అలా లేదు. అందువల్ల అలాంటి హాస్యాన్ని మా ప్రదర్శనలలో ఉండకూడదనే 'నవజనార్దనాన్ని' హాస్యం లేకుండా రూపొందించాను.

## నేను నేర్చిన నవజనార్దనం

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత సంస్థానాలు భారత దేశంలో విలీనమైనాయి. ఆ కాలంలో పిఠాపురం సంస్థానానికి స్వర్గీయ ఉప్పాల

యున్నాను. అందువల్ల నవజనార్దనాన్ని అభ్యసించా లన్న ఉత్సాహం అప్పుడు నా అంతగా కలగలేదు.

ఆ రోజుల్లో విశాఖపట్నంలో నేను ఉంటూండే వాణ్ణి. విశాఖలోని సీతమ్మధార వద్ద శాంతినికేతనం వంటి ఒక నృత్య నికేతనం స్థాపించాలన్న గొప్ప ఆశయంతో నన్ను ప్రముఖ దేశ భక్తుడు స్వర్గీయ తెన్నేటి విశ్వనాధంగారు ఆహ్వానించారు. అందువల్ల నేను విశాఖలో ఉంటూ అనేక మంది పిల్లలకు శాస్త్రీయ భరత నాట్యం నేర్పాను. శ్రీ సుందరంగారు ఒకసారి విశాఖ వచ్చినప్పుడు నన్ను పిఠాపురం రమ్మనమని ఆహ్వానించారు. కనీసం ఒకసారైనా ఆ వృద్ధ కళా మూర్తి ప్రదర్శించే నవజనార్దనం చూడమని బల వంతం చేశారు. అందుకని నేను పిఠాపురం వెళ్లాను. ఆమెను దర్శించాను. ఆమె పాట విన్నాను. ఆమె ఆట చూశాను. ఆమె అభినయం తిలకించాను. ముగ్ధుడ నయ్యాను. ఆమె ఒక కళానిధి అని గ్రహించాను. ఆమెతో శాస్త్ర విషయాలను చర్చించాను. ఆమె వద్ద నవజనార్దనం నేర్చుకొనాలన్న నిశ్చయానికి వచ్చాను. నాకు నవజనార్దనాన్ని నేర్పుమని ఆమెను కోరాను. ఆమె సంతోషంతో అంగీకరించారు.

ప్రతి శుక్రవారం సాయంత్రం రైలులో విశాఖ నుండి పిఠాపురం వెళ్లేవాణ్ని. రెండు రోజులు అక్కడ ఉంటూ ఆమె వద్ద నవజనార్దనం రెండు సంవత్సరాలు అభ్యసించాను.

ఆ రెండు సంవత్సరాలు నన్ను తమ సొంత బిడ్డ కన్నా మిన్నగా చూసుకొని, ఆదరించి అన్ని సౌకర్యాలు నాకు కలుగజేసిన ఆదర్శమూర్తులు ఇద్దరు, ఒకరు శ్రీ అల్లంరాజు సుందరంగారు, ఇంకొకరు శ్రీ మాధవుని గుడిలోని శ్రీ సుబ్బారావు గారు. వీరిరువురి ఆదరణే నాకు ఆనాడు లభించకపోయుంటే నేనీనాడు ఈ నవజనార్దన కళారీతిని ప్రచారం చేయడం జరిగేది కాదు. ఈ విద్య కాల గర్భంలో కలిసి పోయి యుండేది.

శ్రీ సుందరం గారు ఈనాడు లేరు. వయోవృద్ధులైన శ్రీ సుబ్బారావు సజీవులై ఆ మాధవుని సన్నిధిలోనే ఉన్నారు. మరుగుపడి యుండిన ఈ ప్రాచీన కళ మళ్లీ నూతన కాంతులను సంతరించుకొని ప్రకాశించడాన్ని స్వర్గీయ సుందరంగారికి చూపించే అదృష్టం నాకు లేక పోయినా శ్రీ సుబ్బారావుగారు చూశారన్న సంతృప్తి నాకు కలిగింది. అదే ఒక అదృష్టం !

నాకు నవజనార్దనం నేర్పిన గురువు, శ్రీమతి పెండేల సత్యభామగారు, పై యిద్దరు కళాభిమానులు నాకు పూజ్యులు, ఈ త్రిమూర్తులకు నా హృదయాంజలి ఘటిస్తున్నాను.

ఈ నవజనార్దనం మళ్లీ ప్రాచీన వైభవంతో ప్రభవిల్లగలదని ఆశిస్తున్నాను.

## పెండేల వారు

పెండేల నాగి, పెండేల గంగి అని ఇద్దరు కళా మూర్తులను గురించి మన చరిత్రలో కవులు, పండితులు, శాస్త్రవేత్తలు ముచ్చటించారు. పెండేలనాగమ్మ పెండేల గంగమ్మ అని వారిని ఈనాటి కళాకారులు కూడా స్మరిస్తూ ఉంటారు. అయితే వారి తల్లిదండ్రులు వారికి నాగమణి, గంగారత్నం అని నామకరణం చేశారు.

ఆ యిద్దరు కళామూర్తులు భాగవత యక్షగానాలను కేళికలు చేస్తూండేవారన్నది చారిత్రిక సత్యం. వారి వంశీయులలోని చివరి కళాకారిణి శ్రీమతి పెండేల సత్యభామగారు. ఈమె తమ అమ్మమ్మయిన పెద్ద సత్యభామగారివద్ద ఈ భాగవత కళను అభ్యసించారు. ఈమె తల్లి ఈ కళలో అంతగా ప్రసిద్ధురాలు కాలేదు. ఈమె తన ఐదవ ఏట నుండి అమ్మమ్మతో గూడ ప్రదర్శనలకు వెళ్లి వస్తూండేవారు.

ఈమె ఈ కళను అభ్యసించిన తర్వాత కేళికలు చేయడం ప్రారంభించి నిష్ణాతులైనారు. సుమారు 70 సంవత్సరాలపాటు ఈమె నవజనార్దన పారిజాతం,

నేను ఈ పారిజాతాన్ని రూపొంగించి నా శిష్యులను తర్ఫీదు చేసి, ప్రదర్శనలు ఇప్పిస్తున్నాను.

సుమారు 30 సంవత్సరాల క్రితం కాకినాడ సరస్వతీ గాన సభ స్వర్ణోత్సవం జరుపుకొంది. ప్రముఖ దక్షిణాది నాట్యశాస్త్రవేత్త స్వర్గీయ ఈ. కృష్ణయ్యరుగారు ఆ స్వర్ణోత్సవానికి ప్రత్యేకంగా ఆహ్వానింపబడ్డారు. ఇంకా అనేకమంది భారతదేశంలోని ఉత్తర దక్షిణ ప్రాంతాల నాట్యశాస్త్రవేత్తలు, ఆ ఉత్సవానికి వచ్చారు. అప్పటికి కొద్దికాలం క్రిందటే నేను నాగపూరు నుండి వచ్చి ఆంధ్రదేశంలో నృత్యకళను ప్రచారం చేస్తున్నాను. అందువల్ల ఆ ఉత్సవ కార్యకర్తలు నన్నుగూడా ఆహ్వానించి సమ్మానించారు.

అయితే ఆ యుత్సవాంలో జరిగిన సదస్సులకు గాని, చర్చలకుగాని, సమ్మానాలకు గాని, దురదృష్టవశాత్తు ఏ యొక్క వృద్ధ తెలుగు కళామూర్తి ఆహ్వానింపబడ లేదు. శ్రీ కృష్ణయ్యరు గారు నాకు పరిచితులు, అందువల్ల వారు నన్ను ఈ విషయమై ఆశ్చర్యంతో అడిగారు. ఆంధ్రలోని వృద్ధ కళాకారులతో చర్చించి వారి వారి కళా విశిష్టతలను తెలిసి కొనాలని వారు అభిలషించారు.

అప్పటి కప్పుడు నేను ఒక కారును పిఠాపురం పంపించి శ్రీమతి పెండేల సత్యభామగారిని రమ్మనమని ఆహ్వానించాను.

ఆనాటి సాయంత్రం శ్రీ బొగ్గవరపు వీరరాఘవరావు జమీంధారుగారి ఇంట్లో చిన్న పండిత సభ జరిగింది. ఆ సభలో "మీ పేరు ఏమిటి ?" అని శ్రీ కృష్ణయ్యరు శ్రీమతి సత్యభామగారికి అడిగారు.

"వినవమ్మ నేను దెల్పెద
ఘనుడగు శ్రీ కృష్ణు బాసి, గానక నేనున్
పని బూని వెదుక వచ్చితి
అను వందగ సత్యభామ అందురు నన్ను" అని

ఆమె సమాధానం చెప్పారు.

"ఆ సత్యభామ కలాపంలోని సత్యభామ! మీ పేరు?" అని కృష్ణయ్యరు మళ్లీ అడిగారు.

"ద్వాపర యుగంలో సత్రాజిత్తు కుమార్తెను, మాధవుని అర్ధాంగిని, ఆ సత్యభామయే ఈ సత్యభామ!" అని స్వగర్వంగా సమాధాన మిచ్చారు.

ఆ హుందాతనం, ఆ ఠీవి, ఆ దర్పం, ఆ రాజసం, ఆ కంఠ మాధుర్యం, ఆ గాంభీర్యం, ఆ హొయలు, ఆ వయ్యారం! ఆమెకు ఆమే సాటి! ఆమె సమాధానం విని, ఆమెను చూస్తూ కృష్ణయ్యరు ఆశ్చర్యపోయారు.

అలనాటి సత్యభామను నేను చూడలేదు గాని ఈమెను చూస్తే ఆ సత్యభామే ఈ సత్యభామ అనిపించింది నాకు. నా 'నవజనార్దనం' శిక్షణ ముగిసినప్పటి నుండి ఆమె వేషం కట్టి ఆడితే చూడాలన్న కోరికనాలో ఉండి పోయింది. అందువల్ల ఆనాడు ఆ అవకాశం తీసికొని నవజనార్దనాన్ని ప్రదర్శించమని ఆమెను కోరాను. నా అదృష్టం పండింది కాబోలు ఆమె అంగీకరించారు.

ఆనాటి రాత్రి మాధవుని ఆలయంలో ఆమె కేళిక ఏర్పాటయింది. బహుకొద్దిమంది విశిష్ట కలాభిమానులు మాత్రం ఆహ్వానింపబడ్డారు. హాస్యగాడు వృద్ధుడు, మార్దాంగికుడు వృద్ధుడు, వంతపాడిన వారు వృద్ధులు, అందరూ 70 సంవత్సరాలు దాటిన వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు.

చిలకాకుపచ్చ బనారసు పట్టుచీర కట్టి, ఘనియం ధరించి, అర్ధలం రంగు వేసుకొని సత్యభామ, సత్యభామగా దర్శనమిచ్చారు.

"హరి ఉన్నాడా?"అని ఆమె ఎలుగెత్తి పాడుతూ, అభినయిస్తూంటే ఆ హరి, శ్రీహరి, నరహరి, మురహరి, వైకుంఠంలో ఎందుకుంటాడు? తన లీలలను కుంతిమాధవుని ఆలయంలో సత్యభామ ప్రదర్శిస్తూంటే చూడడానికి ఆ హరి తరలి వచ్చాడనిపించింది నాకు. ఆమెతో నేను ఆ మాటే అన్నాను. "అంత భక్తితో నేను పిలిస్తే ఆ హరి ఇక్కడకు రాకేం చేస్తాడు?" అని అంటూ మందహాసం చేశారు ఆమె. అంత ఆత్మ విశ్వాసం గల కళాకారిణి ఆమె, ఆ సత్యభామ!

"ద్వాపర యుగంలో సత్రాజిత్తు కుమార్తెను, మాధవుని అర్ధాంగిని, ఆ సత్యభామయే ఈ సత్య భామ!" అని స్వగర్వంగా సమాధాన మిచ్చారు.

ఆ హుందాతనం, ఆ ఠీవి, ఆ దర్పం, ఆ రాజసం, ఆ కంఠ మాధుర్యం, ఆ గాంభీర్యం, ఆ హొయలు, ఆ వయ్యారం! ఆమెకు ఆమే సాటి! ఆమె సమాధానం విని, ఆమెను చూస్తూ కృష్ణయ్యరు ఆశ్చర్యపోయారు.

అలనాటి సత్యభామను నేను చూడలేదు గాని ఈమెను చూస్తే ఆ సత్యభామే ఈ సత్యభామ అని పించింది నాకు. నా 'నవజనార్దనం' శిక్షణ ముగిసి నప్పటి నుండి ఆమె వేషం కట్టి ఆడితే చూడాలన్న కోరికనాలో ఉండి పోయింది. అందువల్ల ఆనాడు ఆ అవకాశం తీసికొని నవజనార్దనాన్ని ప్రదర్శించమని ఆమెను కోరాను. నా అదృష్టం పండింది కాబోలు ఆమె అంగీకరించారు.

ఆనాటి రాత్రి మాధవుని ఆలయంలో ఆమె కేళిక ఏర్పాటయింది. బహుకొద్దిమంది విశిష్ట కలాభిమానులు మాత్రం ఆహ్వానింపబడ్డారు. హాస్యగాడు వృద్ధుడు, మార్దాంగికుడు వృద్ధుడు, వంతపాడిన వారు వృద్ధులు, అందరూ 70 సంవత్సరాలు దాటిన వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు.

చిలకాకుపచ్చ బనారసు పట్టుచీర కట్టి, ఘనియం ధరించి, అర్ధలం రంగు వేసుకొని సత్యభామ, సత్య భామగా దర్శనమిచ్చారు.

"హరి ఉన్నాడా?" అని ఆమె ఎలుగెత్తి పాడుతూ, అభినయిస్తూంటే ఆ హరి, శ్రీహరి, నరహరి, మురహరి, వైకుంఠంలో ఎందుకుంటాడు? తన లీలలను కుంతిమాధవుని ఆలయంలో సత్యభామ ప్రదర్శిస్తూంటే చూడడానికి ఆ హరి తరలి వచ్చాడనిపించింది నాకు. ఆమెతో నేను ఆ మాటే అన్నాను. "అంత భక్తితో నేను పిలిస్తే ఆ హరి ఇక్కడకు రాకేం చేస్తాడు?" అని అంటూ మందహాసం చేశారు ఆమె. అంత ఆత్మ విశ్వాసం గల కళాకారిణి ఆమె, ఆ సత్యభామ!



బెజ్జంకి ఆలయ శిల్పం

"ఇంత గొప్ప కళాకారులు మీ ఆంధ్రదేశంలో ఉన్నారు ! కాని మీ వారు వీరిని గుర్తించకపోవడం దురదృష్టం" అని కృష్ణయ్యరు నిట్టూర్చారు.

"నేను ఎంతో అదృష్టవంతుణ్ణి ! ఈమె వద్ద నేను పారిజాతాన్ని అభ్యసించగలిగాను" అన్నారు కృష్ణయ్యరుగారితో.

అన్యుల పొగడ్తలను పొందిన ఈ కళాకారులు మనవారేనని మన కళాకారులు నేడు గర్విస్తున్నారు, ఇదే మన ఆంధ్రుల ప్రత్యేకత !

## రావు వంశీయులు

### నవజనార్దనం

"రావు కులాంబుధి చంద్ర
శ్రీ గంగాధర మహీపతి రాయ
భోగ దేవేంద్ర బహు పరాక్ !
భళిర ! మహారాజ
మూర సమేత, సర్కార్ ప్రభూ ! సలాం!"

పిఠాపుర సంస్థానా న్నేలిన రావు వంశీయులు వెలమ ప్రభువులు. వీరు విష్ణు భక్తులు.

పిఠాపురమే పీఠికాపురం. అష్టాదశ శక్తి పీఠాల్లో ప్రఖ్యాత పీఠం పురూహూతికా పీఠం. అది ఇక్కడే వెలసింది. కుక్కుటేశ్వరుడుగా శివుడు ఇక్కడే వెలిశాడు. శిరోగయ, నాభిగయ, పాదగయల్లో ఒకటైన పాద గయా క్షేత్రం ఇది. పంచమాధవుల్లోని కుంతి మాధవుడు ఇక్కడే వెలిశాడు. ఈ దేవుడంటే ఈ రావు వంశీయులకు ఎంతో ప్రీతి.

కుంతి మాధవుని పూజలో నృత్యం ఒక భాగంగా ఉండేది. ఆ నృత్య పూజను ఆగమ శాస్త్రోక్తంగా చేస్తూండేవారు. ఈ ఆలయ నృత్యాలను చేసినవారిలో ఆఖరి నర్తకీమణులు పెద వరాంకుశం, చిన్న వరాంకుశం. చిన్న వరాంకుశంగార్ని ప్రత్యక్షంగా కలిసి వారి ఆలయ నర్తన విధానాన్ని గురించి అడిగి తెలిసి కొనే అవకాశం నాకు కలిగింది.

కచ్చేరీ, కర్ణాటక నర్తనాన్ని ఆడినవారిలో శ్రీయుతులు ముద్దా సూర్యకాంతం, అమ్మణి, జక్కుల నూకరాజు మొదలైనవారు కొందరు ముఖ్యులు. శ్రీమతులు అమ్మణి, నూకరాజులను కలుసుకొని ఆ సంస్థాన కేళికా రీతులను గురించి తెలుసుకొన్నాను.

పారిజాత కలాపం, భాగవత సాంప్రదాయక నృత్యరీతులలో మాధవుని ఆరాధించినవారిలో సుప్రసిద్ధులు పెండేలవారు, కోనేవారు. కోనే వంశీయుల్లో ఆఖరి కళాకారిణి శ్రీమతి చిట్టిరాజు (ఉపమాంబ). ఆమె ఈ మధ్యనే కీర్తిశేషు లయ్యారు. పెండ్యాల (పెండేల) వంశీయులు గత నాలుగు వందల సంవత్సరాలుగా ఈ పారిజాత ప్రబంధ నర్తనం ద్వారా మాధవుని ఆరాధించి తరించినారు. వీరిలో చివరి కళాకారిణి శ్రీమతి పెండేల సత్యభామే. ఈమె వద్దనే నేను 'నవజనార్దనాన్ని' అభ్యసించాను.

రావు వంశీయుల్లో ఈ 'నవజనార్దనాన్ని' పోషించిన ఆఖరి ప్రభువు శ్రీ రావు మహీపతి గంగాధర రామారావు గారు.

వీరి తర్వాత శ్రీ రావు మహీపతి సూర్యరావు గారు ఆంధ్ర సాహిత్యాన్ని ఎన్నో రీతులుగా పోషించినా, వారు బ్రహ్మసమాజ మతోపాసకులవడంవలన ఈ కళయెడల ఎక్కువ ఆసక్తి కనబరచలేదు. అంతే కాదు అయిదు దశాబ్దుల క్రితం రాజకీయ, సాంఘిక పరిస్థితులు నృత్యకళకు అంత అనుకూలంగా లేనందున తరతరాలుగా ఈ కళను ఆరాధిస్తూ వచ్చిన వారు నృత్యారాధనను విరమించు కొనవలసి వచ్చింది. ఆటు తర్వాత మనకు స్వాతంత్ర్యం వచ్చి, సంస్థానాలు, జమీందరీలు సమసి పోవడంతో నృత్యకళకు పోషణ పూర్తిగా పోయింది.

ఒకప్పుడు హైందవ సంస్కృతి వికాసానికి నిలయాలుగా నుండిన ఆలయాలలో గూడ నృత్య కళ నిషేధించబడింది. కుంతి మాధవునికి నృత్య పూజ కరువైంది. ఈ నృత్యకళ క్షీణించింది. నవజనార్దన పారిజాతాన్ని చూచే అదృష్టం ఈనాటి కుంతి మాధవుని భక్తులకు లేకుండా పోయింది. మాధవుని సేవలో 'నవజనార్దనం' అనే ఈ విశిష్ట కలాపం కేళిక చేయబడే దన్న విషయం ప్రజలకు తెలియకుండా పోయింది.

గత నాలుగు వందల సంవత్సరాలుగా ఎందరో కవులు, కళారాధకులు, కళావేత్తల తపః ఫలితంగా రూపొంది, వికసించిన ఈ పారిజాతం విశిష్ట ప్రచారం పొందింది. ఈనాడు అది నామరూపాలు లేకుండా కాలగర్భంలో కలిసి పోకూడదు, తెలుగు వారి నృత్య కళకు వెలుగైన ఈ నవజనార్దనం సజీవంగా ఉండాలి, విశిష్ట పునః ప్రచారం దీనికి జరగాలి అన్న దీక్షతో సంకల్పంతో నేను ఈనాడు కృషి చేస్తూ అనేక మంది శిష్యులకు ఈ కళలో శిక్షణ ఇస్తున్నాను. నా కృషిలో ఒక అంశమే ఈ చిన్ని గ్రంథ ప్రచురణ.

జడ సర్తన, వంశావళి, గురుస్తవం, సౌమ్ము ంపట్టు, మందుల పట్టు, లేఖ మనోవేగదరువు - సప్తతాళ విన్యాసం, రాయబారం, కృష్ణసందర్శనం మొదలైన అంశాలు కొన్ని ఇందులో లేవు.

రోజుకు రెండున్నర గంటలు చొప్పున మేము ప్రదర్శించే మూడు రాత్రుల గ్రంథంలోని దరువులను మాత్రమే దీనిలో ప్రచురిస్తున్నాం.

తొమ్మిది రాత్రుల గ్రంథాన్ని పూర్తిగా ముద్రించే అవకాశం మాకు కలిగినప్పుడు అన్ని దరువులను వ్యాఖ్యాన సహితంగా ప్రచురించదలిచాం.

నవజనార్దన పారిజాతాన్ని కళాలోకానికి పరిచయం చేయాలన్న ఆశయంతోనే ఈ సంక్షిప్త గ్రంథాన్ని ఇప్పుడు ప్రచురించాం.

అడగకుండానే ఈ గ్రంథ ప్రచురణకు ప్రోత్సహించి సహాయాన్ని అందజేసిన తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం వాస్తవ్యులు శ్రీ రెడ్డి వేంకట కృష్ణానంద చౌదరిగారికి మా కళాంజలి ఘటిస్తున్నాం.

కరీంనగర్ జిల్లాలో మారుమూలనున్న ఒక చిన్న గ్రామం బెజ్జంకి. కాకతీయుల కాలంలో ఒక సుందర మందిరం అక్కడ వెలిసింది. కాని అది పూర్వమెప్పుడో శిథిలమైపోగా అక్కడి సుందర శిల్పాలు చెల్లా చెదురై పోయాయి. కళానిలయాలైన రెండు స్తంభాలను తప్ప. ఆ వూరి వారు ఒక చిన్న దేవాలయాన్ని ఆ శిథిల ప్రదేశంలోనే నిర్మించారు. ఆ స్థంభాలపై నున్న అమర శిల్పం గురించి బహు కొద్ది మందికే తెలుసు, ఆ శిల్ప సౌందర్యాన్ని కళాలోకానికి ఎరుక పరచాలన్న ఉద్దేశ్యంతో ఈ గ్రంథంలో పొందుపరుస్తున్నాము. నేటి నవజనార్దన పారిజాతాన్ని పూర్తిగా నా వద్ద అభ్యసించి ప్రదర్శిస్తున్న కళా కృష్ణ ఆ యూరికి చెందిన వాడవడమే దీనికి కారణం.

కళాలోకం నా కృషిని సత్తరించి సహృదయంతో నా శిష్యుల నవజనార్దన ప్రదర్శనను ఆదరించి పోషించాలని విన్నవించుకొంటున్నాను.

మీ

హైదరాబాదు-20. నటరాజ రామకృష్ణ

# నవజనార్దనం-భామాకలాపం

రాధామాధవుల ప్రణయలీలల్ని జయదేవుడు తన గీతగోవిందంలో వర్ణించాడు. అలాగే సిద్ధేంద్ర యోగి, మరికొందరు కవులు శ్రీ కృష్ణ సత్యభామల ప్రణయ కలహాన్ని శృంగార ప్రబంధంగా రచించారు. అదే భామాకలాపం. భామాకలాపానికి, జయదేవుని గీత గోవిందానికి చాలా దగ్గిర పోలికలున్నాయి, అయితే ఈ రెండింటిలో ఒక భేదం ఉంది. గీత గోవిందంలోని నాయిక, రాధ ఒక అమాయక భక్తురాలు, భామా కలాపంలోని నాయిక, సత్యభామ స్వాధీనపతిక, ప్రౌఢ, ప్రగల్భ, వీరవనిత అందువల్ల భామా కలాపంలోని నాయికాభినయంలో బింకం, రాజఠీవి వయ్యారం ప్రత్యేక విశిష్టతతో మనకు గోచరిస్తాయి.

నట్టువ మేళం, నాట్యమేళం అని భరత విద్య ద్వివిధమైంది. సుందరసుకుమార లలిత కోమల కరణాంగహారాలు, హావభావ ప్రదర్శనలు గలది నట్టువ మేళం, ఇది స్త్రీల సొత్తు. వారే దీనిని ప్రత్యేకంగా ఆరాధిస్తున్నారు. ఇది ఏక పాత్ర నృత్య సంప్రదాయంగా రూపొందింది. ఒక కళాకారిణి నృత్తంలో తన ప్రదర్శనను ప్రారంభించి, నృత్యంలో తన ప్రతిభను ప్రదర్శించి, అభినయంలో తన పాండిత్యాన్ని వెల్లడించి తన కేళికను ముగించడం నట్టువమేళ సంప్రదాయం.

అనేక మంది నర్తకులు పాల్గొనే నృత్యనాటక రూపాన్ని నాట్యమేళం అంటారు. ప్రత్యేకంగా పురుషుల కోసం మాత్రమే సృష్టింపబడిన తాండవ నర్తన రీతి ఇది. దీనిలో స్త్రీలకు తావు లేదు. స్త్రీ పాత్రలను కూడా పురుషులే పోషించాలి. పురాణేతిహాసాల్లో సాహిత్యానికి అనువైన విషయాన్ని ఈ సంప్రదాయంలో ప్రదర్శించడం ఆచారం.

పూర్వం ఉభయ గోదావరి జిల్లాలో ముఖ్యంగా తూర్పు గోదావరి జిల్లాలో నట్టువమేళ సంప్రదాయం బాగా వృద్ధి చెందింది. ఇతర జిల్లాల నుండి పురుష నాట్యమేళాల వారు ఈ జిల్లాకు వచ్చి వీధినాటకాలను, యక్షగానాలను, భాగవతాలను ఆడుతూ ఉండేవారు. నట్టువ మేళ సంప్రదాయంలో ఆరి తేరిన తూర్పు గోదావరి జిల్లా నట్టువరాండ్రు భామాకలాపం వైపు ఆకర్షించబడ్డారు. వీరు భామా కలాపాన్ని అభ్యసించి కరతలా మలకం చేసుకొన్నారు. అంతటితో తృప్తి చెందక వారు వేరే కలాపాలను వ్రాయించుకొన్నారు. కలియుగ సత్యభామలు, గాన కోకిలలు ఎంతో మంది తయారయినారు.

నట్టువమేళం వారు ఈ భామాకలాపాన్ని చేపట్టడానికి కారణం కలాపంలోని ప్రతి దరువు విషయం ఒక ప్రత్యేకత గలది. ప్రతి దరువు అలంకార జాతీయతను తెలియజేస్తుంది. భామలోని ఆ వయ్యారం ఆ హొయలు, ఆ తీరు, ఆ దర్పం, మొదలైనవన్నీ ఆంధ్రత్వం నిండి ఉన్నాయి. సత్యభామ పాత్ర వంటి సంపూర్ణమైన పాత్ర మరియే యక్షగానంలో గాని, వీధినాటకంలో గాని లేక పోవడమే భామాకలాపం బహుళ ప్రచారం పొందడానికి ప్రధాన కారణం.

భామాకలాపంలోని కథా వస్తువు చిన్న సంఘటనే అయినా అష్టవిధ నాయికల వర్ణనలు, విప్రలంభ శృంగారంతో నిండి పెద్ద ప్రబంధంలా రూపొంది

సందువల్ల ఇది అందర్నీ ఆకర్షించింది. దీనిని తొమ్మిది రాత్రులు, మరి కొందరు మూడు రాత్రులు, ఇతరులు ఒక రాత్రి ప్రదర్శిస్తూ వచ్చారు. కాని నేటి కాలంలో ప్రదర్శనసంగారూపొంది నామ మాత్రంగా నిలిచియుంది. ఈ ఒక గంట ప్రదర్శనలో దీని సంపూర్ణ స్వరూపాన్ని తెలిసికొనడం దుర్లభం,

భామాకలాపాన్ని సిద్ధేంద్రుడువారు రచించి కూచిపూడి భాగవతులకు సుమారు 400 సంవత్సరాల క్రితం నేర్పారు. అయితే అది ఈనాడు అది పుట్టిన కృష్ణాజిల్లాలోనే అంతగా ప్రచారంలో లేదు. కాని శ్రీకాకుళం, విశాఖ, విజయనగర జిల్లాలలో భామా కలాపాన్ని ప్రదర్శించే మేళాలు నేడు అనేకం ఉన్నాయి. అయితే వీరుగాని, తూర్పు గోదావరి జిల్లాలోని మేళాలు వారు గాని ప్రదర్శించే భామాకలాపం సిద్ధేంద్రుని రచన కాదు. ఇతర కవులు వ్రాసిన సుమారు ఇరవై అన్య భామాకలాపాలు ఈ ప్రాంతాలలో ప్రచారంలో ఉన్నాయి.

నేడు కూచిపూడి వారు ప్రదర్శించే భామా కలాపం కూడా సిద్ధేంద్రుడు రచించిన అసలు కలాపం కాదు. వీరి ప్రదర్శనలలో గూడ అనేక మార్పులు, చేర్పులు వచ్చాయి.

పావన గోదావరి తన పవిత్రజలాంతో మట్టిని బంగారంగా మార్చిన ప్రదేశం తూర్పు గోదావరి జిల్లా. తెలుగు కవితకు తన ఘంటంతో శ్రీకారం చుట్టిన ఆదికవి నన్నయ భట్టారకుడు జీవించిన పవిత్ర భూమి తూర్పు గోదావరి జిల్లా. అప్పయ్య దీక్షితులు, జగన్నాథ పండితరాయలు వంటి మహనీయుల గన్న కోనసీమ తూర్పు గోదావరి జిల్లా లోనిది. ప్రాచీన కాలం నుండి సంస్కృతీ వికాసానికి నిలయమై ఈ కోనసీమ విరాజిల్లింది.

ర్యాలిలో వెలిసిన అపూర్వ మోహినీ కేశవమూర్తి సాన్నిధ్యంలో లాస్యనర్తనరీతి, రసాభినయం ఎంతగానో పోషింపబడ్డాయి. మురమళ్ల, ద్రాక్షారామాలలో వెలిసిన పరమశివుని సమక్షంలో తాండవ నర్తనం అభివృద్ధి చెందింది. ఈ ద్రాక్షారామ ఆలయంలోని శివుని తన నృత్యంతో మాణిక్యాంబ అనే దేవదాసీ ఆరాధించి ఆ స్వామితో ఐక్యమైంది.

ఆచంటలోని చంటీశ్వరాలయ చరిత్రతో ఒక దేవ నర్తకి చరిత్ర పెనవేసుకొని యుంది.

తుని, పెద్దాపురం, పిఠాపుర ప్రాంతాలలో వచ్చేరి ఆట, అభినయ కళ ప్రత్యేకంగా పోషింపబడ్డాయి. రామచంద్రపుర క్షత్రియ జమీందారులు నృత్యకళను పోషించారు.

కోనసీమలోని శ్రీమంతులైన అగ్రహారీకులు అభినయ కళను ఆదరించారు. జగన్నాథ పండితరాయుని తాతగారు కేశవ భట్టు శ్రీ కృష్ణ దేవరాయుని తన భరత విద్యా కౌశల్యంతో మెప్పించి ముంగండ అగ్రహారాన్ని బహుమతిగా పొందాడు. కాలక్రమేణ ముంగండ అగ్రహారంలో భరత విద్య అంతరించి పోయినా దాని ప్రక్క గ్రామమైన అనాతవరంలో మొన్న మొన్నటి వరకు నృత్య విద్య సజీవంగా ఉంది.

భరత విద్య, భామాకలాపం, గొల్ల కలాపాలను దేవదాసీలకు నేర్పే నృత్య కళావేత్తలు ఇక్కడుండే వారు. రావూరి కోటయ్యగారి శిష్యుడు ఆత్కూరి సుబ్బారాయుడు, లక్కోజి సింహాచలం వీరిపురు భామాకలాపం గొల్లకలాపంలో అనేక మందికి శిక్షణ ఇచ్చేవారు. ఈ గ్రామంలో కాశీ కమలాక్షి, మీనాక్షి అనే ఇద్దరు ప్రసిద్ధ నృత్య కళాకారు లుండే వారు. కాశీ కమలాక్షి ఎనిమిది మంది బోయీలు మోసే పల్లకిలో జోడు తాగడాలతో దాసదాసీలతో భాగవత ప్రదర్శన ఇవ్వడానికి వెళ్లేది. అంత ప్రతిభ గలది ఆమె. వక్కలంక గ్రామ వాసి వెంకయ్యగారు కృష్ణ కలాపం ప్రదర్శించేవారు. ప్రస్తుత భామాకలాపంలో కృష్ణుని పాత్ర అంతరించి పోయింది. గాని వీరి కాలంలో భామ పాత్రకు సరితూగగల గ్రంథం కృష్ణ పాత్ర వుండేది. వాకతిప్ప గ్రామంలో గెద్దం సుబ్బారాయుడనే భామాకలాప గురువు ఉండే వారు.

బండారు లంకలో కృష్ణ కలాప గురువులు, కృష్ణ పాత్రధారులు, హంగుదారులు అనేక మంది ఉండే వారు. వీరిలో ముఖ్యులు బళ్ల సూరన్న, కోటిలింగం, బులే మల్లయ్య, బసవరాజు, సుబ్బన్న మొదలైన వారు. గంగ్రేదేవులోని సత్తిలింగంగారు హాస్యం చెప్పడంలో సిద్ధహస్తులు. మండపేటలో ఏలూరి ఆంజనేయులు, నృసింహదేవర నరసింహం, ఆపాటి అమ్మన్న, వేంకటాద్రి, శృంగవరపు మల్లయ్య మొదలైనవారు భరత విద్యలో ప్రవీణ్యులు, గొల్ల కలాపం, భామాకలాపాల్ని బాగా అభ్యసించినవారు. అనేక మందికి వీరు శిక్షణ ఇచ్చారు. కోటిపల్లిలోని కడియాల వెంకటశాస్త్రి, రామమూర్తిగార్లు పేరెన్నిక గన్న భరత శాస్త్ర గురువులు. ఇక్కడే పిచ్చమ్మ అనే ప్రసిద్ధ నాట్యకళాకారిణి ఉండేది. అమలాపురంలో కోటిపల్లి మధురం, పిచ్చాయి, అన్నాబత్తుల శేషాచలం, జంప మాణిక్యం ఉండేవారు. ఈ నలుగురు ప్రసిద్ధులైన నట్టువరాండ్రు. అయినవిల్లి గ్రామ కాపురస్తురాలు నాయుడు వీరాచలం కర్నాటక, అభినయ, కలాపప్రదర్శనంలో పేరెన్నిక గన్న ప్రవీణురాలు. ఈమె కుమార్తెలు కాశీ కనకాచలం, అన్నాబత్తుల బులి సత్యభామ కూడా మంచి కళాకారులు. రెడ్డిశాస్త్రి, సూర్యకాంతం, శోభనాద్రి మొదలైన వారు కూడా పేరు మోసిన కళాకారులు. వీరి వంశస్తులే పెద వెంకటరత్నం, చిన్న వెంకటరత్నం, బులి వెంకట రత్నం, మాణిక్యంగార్లు. పసలపూడిలో పేరుగాంచిన నాయకురాండ్రు మాణిక్యం, చిన వెంకటరత్నం ఉండేవారు. మురమండలో కోటిపల్లి సుబ్రహ్మణ్యం, సీతమ్మగార్లు, పసలపూడిలో శాండ్రేగుల వీరనారాయణ, గెడ్డం సుబ్బారాయుడు, ఇందుపల్లిలో నాయుడు జగదాంబ, వాడపల్లిలో చంద్రరేఖ, అల్లు లక్ష్మీకాంతం, మండపేటలో సంగీత సరస్వతి దుగ్గిరాల మాణిక్యం, వెంకటరత్నం, ఎలనాగ, శ్రీ విరాజితం, బిక్కవోలులో బండి సత్యభామ, రాజమండ్రిలో బండి రాముడు, మారంపల్లిలో చిత్తజల్లు పెద వెంకట రత్నం, చిన వెంకట రత్నం వైదేహి, ఇందుమతి. వారినాట్యానికి ప్రయోక్తలు శ్రీ శాస్త్రి రామయ్య, రామయ్య గారలు. పిఠాపురంలో పెండెం పెదసత్య భామ, సత్యభామ, మద్దు సూర్యకాంతం, తమ్మా, పెద వరాలమ్మ, చినవరాలమ్మ. పెద్దాపురంలో చింతపోతం చిట్టిరాణి, పెదసంపం, సవాని. మానేపల్లిలో మద్దుల వరహాలు, బోటమ్మ, మాణిక్యాలు, కాకినాడలో ఏలూరి శేషాచలం, కామమ్మ. పేరూరులో వాడ్రేవు పారిజాత పుష్పావతి. అమలాపురంలో అన్నాబత్తుల చిట్టి, మండపేటలో దుగ్గిరాల జగదాంబ, మొదలైన అనేక మంది భరత విద్యా ప్రవీణులు తూర్పు గోదావరి జిల్లాలో ఉండేవారు. శ్రీ వాసు శ్రీరాములు గారు ఏలూరు, కవి, పండితుడు, అభినయ శాస్త్రవేత్త, శ్రీ పురమళ్ల సుబ్బయ్యగారు తణుకు, శ్రీదేవులపల్లి వీర రాఘవయ్య గారు ప్రసిద్ధ నాట్య శాస్త్రవేత్తలు. వీరందరూ నాట్యంలో నట్టువరాండ్రకు శిక్షణిచ్చే వారు. వీరందరి గురించి వ్రాయడంటే శక్తికి మించిన పని అవుతుంది. అందువల్ల నాకు తెలిసిన కొంత మంది నాట్యకళాకారులను గురించి మాత్రమే ఈ గ్రంథంలో వ్రాస్తున్నాను.

## 1. శ్రీమతి అన్నాబత్తుల బులివేంకటరత్నమ్మ

ఈమె పండిత వంశంలో జన్మించారు. ఈమె తల్లి, అమ్మమ్మగార్లు భరతశాస్త్రంలోను, అభినయ విద్యలోను గొప్ప దిట్టలు. ఈమె తండ్రి శ్రీ బులుసు పేరయ్యశాస్త్రిగారు గొప్ప సంస్కృత విద్వాంసులు. సంస్కృత కావ్యాలను, మృత్యుంజయ విలాస యక్ష గానాన్ని, అధ్యాత్మ రామాయణ కీర్తనలను, అష్టపదులను, నారాయణతీర్థులవారి తరంగాలను ఈమె తండ్రి వద్దనే అభ్యసించారు. శ్రీ చెరుకూరి రామమూర్తి గారు ఈమెకు శాస్త్రీయ సంగీతం నేర్పారు. శ్రీ కోటిపల్లి కడియాల రామమూర్తిగారి వద్ద అభినయవిద్యను అభ్యసించారు. శ్రీ ఆతుకూరి సుబ్బరాయ శాస్త్రిగారి వద్ద గొల్ల, భామా కలాపాలను నేర్చుకొన్నారు.

ఈమెది నిండైన విగ్రహం, మృదువైన వాక్కు, అబూ పర్వతాలపైని గల జైన మందిరాలలోని పాల రాతి విగ్రహంలా ఉంటుంది ఈమె. భామాకలాపం, గొల్ల కలాపం, కర్నాటకం, అభినయం మొదలైన వివిధ శాస్త్రాలలోను, సంప్రదాయాలలోను ఈమెకు అపారమైన పాండిత్యం పరిజ్ఞానం ఉన్నాయి.

ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ వారు అఖిల భరత నృత్యోత్సవాలను జరిపి నప్పుడు ఈమె పుష్పబాణ విలాసంలోని "కాంతోయాస్యతి దూరదేశ మితిమే చింతా పరం జాయతే" అన్న శ్లోకాన్ని అభినయించి, ఆంధ్రుల అభినయ కళకు దర్పణం పట్టి కళాకారుల నందరిని ముగ్ధుల్ని చేశారు. ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ విశిష్ట సభ్యురాలుగా ఈమెను గౌరవించింది. భరతకళాప్రపూర్ణ బిరుదు నిచ్చారు.

## 2. యండమూరి రామరత్నం

పూర్వ జన్మ సుకృతం వల్లనే మరు జన్మలో కళా కారులౌతారు. నృత్య కళాకారులుగా జన్మించాలంటే ఎన్నో జన్మల తపః ఫల ముండాలి. ఆత్మసాక్షాత్కారం నొందని నృత్య కళాకారులు అభినయ విద్యను సహజ సౌందర్యంతో ప్రదర్శించలేరు. చక్కని అంగసౌష్టవం, విశాల నేత్రాలు, దీర్ఘకాల శిక్షణ, సక్రమ సాధన, గురుభక్తి, శాస్త్రాధ్యయనం, విమర్శనా జ్ఞానం, హృదయ వికాసం వీటన్నింటితో మూర్తీభవించిన గొప్ప కళాకారిణి శ్రీమతి రామ రత్నం. అమె గొప్ప విద్వాంసురాలైనా, ఎంత పాండిత్య మున్నా చాలా నిరాడంబరంగా, వినయంగా ఉంటారు.

పాత్ర ఔచిత్యం చెడకుండా పరకీయ నాయికాభి నయాన్ని చేసి మెప్పించడం చాలా కష్టం. అకాడమీ వారు నిర్వహించిన అభినయ సదస్సులో ఈమె "ఎందుకీ తొందర సుందరాకార, నీ పొందు గూడెద తాళర" అన్న పదంలోని ఈ పల్లవిని మాత్రం అభినయించి అలంకార శాస్త్రంలోని లక్షణాలను నిరూపిస్తూ రసజగత్తులో విహరించారు. ఆనాటి ఆమె అభినయం చిరస్మరణీయమైన ఆనందానుభూతి.

ఈమె జన్మస్థలం కాకినాడ. అభినయ కళను ఆమె తల్లి శ్రీమతి పాపాచలంగారే ఆమెకు నేర్పారు. కొన్నాళ్ళు శ్రీ దాచేపల్లి లింగయ్యగారి వద్ద కూడా అభినయ విద్యను అభ్యసించారు. శ్రీ కాళె గంగ రాజుగారు ఈమెకు శాస్త్రీయసంగీతం నేర్పారు. ఈమె సుమారు 35 ఏళ్లు నాట్య ప్రదర్శన లిచ్చి బహు ప్రఖ్యాతులైనారు.

## 3. శ్రీమతి పందిరి వేంకటరత్నం

ఆంధ్రలో విశిష్టమైన నృత్య కళకు మండపేట గ్రామం ఎంతో పేరు పొందింది. భరత కళకు వాసి గాంచిన గ్రామం ఇది. పూర్వం ఇక్కడ 18 మేళాలు ఉండేవి. భరతకళా ప్రవీణులు అనేక మంది ఇక్కడ ఉండేవారు. వీరిలో శ్రీమతి దుగ్గిరాల మణిక్యంగారు ప్రసిద్ధులు. ఈమెను సంగీత సరస్వతి అనేవారు. ఆమెకు ఎంతో మంది శిష్యురాండ్రు ఉండేవారు. వారిలో గురువుకు తగ్గ శిష్యురాలు శ్రీమతి పందిరి వేంకటరత్నంగారు. ఈమె అభినయ ప్రదర్శనను చూసి స్వర్గీయ చెల్లపల్లి వేంకటశాస్త్రిగారే ప్రశంసించ కుండా ఉండలేక పోయారు.

మండపేట కళాకారుల బాణీ శుద్ధమైన భాగవత రీతి. త్రిస్థాయిలో గుక్కపట్టి పాడుతూ అసలైన భాగవతరీతిలో అడవులు, దరువులు, అభినయాలను ప్రదర్శించడంలో మండపేట నృత్య కళాకారుల ప్రత్యేకత, విశిష్టత గోచరిస్తాయి.

భాగవతాన్ని భాగవతంలా ఆడాలి గాని భరత నాట్యంలా ప్రదర్శించకూడ దన్నది ఈమె సిద్ధాంతం. "సామాన్య ప్రజల కోసం ఒకానొక ప్రత్యేక లక్ష్యంతో భాగవతాన్ని ప్రదర్శించాలి. పండితుల కోసం భరతనాట్యాన్ని, అభినయకళను ప్రదర్శించాలి. పాటలోను, ఆటలోను, అలంకరణలోను ఈ రెండింటికీ చాలా వ్యత్యాస ముంది. ఏ బాణీకి ఆ బాణీ వేరు.

దేని గొప్పతనం దానిది. ఈ రెండింటిని ఏకం చేయ కూడదు. గణియం ధరించని, అర్ధలం కోటా వేసు కోని భాగవతం భాగవతమే కాదు," అని ఈమె ఒకసారి అన్నారు.

పూర్వకాలపు ఆభరణాలను పూర్తిగా ధరించి శ్రీమతి వెంకట రత్నంగారు కేళిక చేసేవారు. లోక తీరునుబట్టి, కాలాన్నిబట్టి సంప్రదాయానికి కొన్ని మెరుగులు దిద్దవలసి వచ్చినా మూల సూత్రాలకు భంగం కలగకుండా సంప్రదాయాన్ని పోషించా లన్నది వీరి సిద్ధాంతం. "ఆటలో సంప్రదాయం మారిపోతే మన సంస్కృతికే పెద్ద దెబ్బ" అని అన్నారు ఈమె.

ఏభై సంవత్సరాలకు పైగా 'సత్యభామ'గా ఈమె నృత్యరంగ స్థలంపైన జీవించారు. నాట్య సరస్వతినే ఈమె నమ్ముకొని జీవించడంవల్ల లక్ష్మీదేవి దూరమైనది. అందువల్ల వృద్ధాప్యంలో ఈమె పేదరికాన్ని అనుభవించక తప్పలేదు.

శ్రీమతి దుగ్గిరాల మాణిక్యంగారి వద్ద గొల్ల కలాపం, భామాకలాపం, శ్రీ వేదాంతం లక్ష్మీనారా యణగారి వద్ద అష్టపదులు అధ్యాత్మరామాయణ కీర్తనలు నేర్చుకొన్నారు. శ్రీ షేక్ లాల్ వద్ద శాస్త్రీయ సంగీతం అభ్యసించారు.

## 4. శ్రీమతి నాయుడు పెద సత్యం

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు నిర్వహించిన సదస్సులో ఎనిమిది మంది విభిన్న గురువుల వద్ద భామాకలాపం నేర్చుకొన్న ఎనిమిది మంది కళాకారిణులు ఒకే మాధవి హాస్యం చెబుతూండగా ఒకరి కొకరు వంత పాడుతూ ఒకరి తర్వాత ఒకరు భామాకలాపంలోని వివిధ ఘట్టాలను ఒకే రంగస్థలంపైన ప్రదర్శించారు. "రావయ్యా మాయింటికి గోపాలకృష్ణా!" అంటూ ఎనిమిది మందీ శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేస్తూ వివిధ బాణీలలో నర్తన మాడిన ఆనాటి రసవత్తరమైన ఘట్టం ఒక అపూర్వ సృష్టి. అదొక అద్భుత సంఘటన, ఆనాటి ప్రేక్షకుల హృదయాలలో పడిన చెరగని ముద్ర.

ఆ ఎనిమిది మంది కళావేత్తలు భామాకలాప ప్రదర్శనలో నిష్ణాతులైనవారు. ఒకరిని మించినవారు వేరొకరు. అందరూ వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు. కమలరేకుల వంటి కళ్లు, చిరునవ్వు చిందులాడే వదనం, ముత్యాలవంటి పళ్లు, ఎర్రని శరీరచ్ఛాయ, వడలని శరీర సౌష్టవం, సడలని సౌందర్యం గల ఒకామె నన్ను ఆకర్షించింది. ఆమె ఎవరో కాదు శ్రీమతి నాయుడు పెదసత్యం.

శ్రీమతి పెద సత్యం గొప్ప కళావేత్తని నాకు శ్రీమతి పందిరి వేంకటరత్నంగారు చెప్పగా అంతకు ముందు ఎన్నోసార్లు ఆమెను చూడాలని మండపేట వెళ్లాను. కాని ఆమె ఇంట్లో ఉండి కూడా లేరని చెప్పించారు. సదస్సు సందర్భంగా నేను కోరిన కళా కారిణిని ఆనాడు కలుసుకొన్నాను. ఎనభయ్యో పడిలో పడినా, వేలాదివేలు ప్రదర్శనలు ఇచ్చినా నృత్య కేళికలు ఇంకా చెయ్యాలనే అభిలాష గల ఉత్తమ కళాకారిణి ఆమె. ఆ నవ కళాకారుల భామాకలాప ఘట్టం ముగియగానే ఆమెకు ప్రీతికరమైన రెండు తెలుగు పద్యాలు, ఒక శ్లోకం పాడి ఆమె అభిన యించారు.

శ్రీమతి నాయుడు పెద సత్యంగారు రామచంద్ర పురంలో జన్మించారు. శ్రీమతి నాయుడు భాగ్యవతి గారి వద్ద అభినయం, శ్రీ వారణాసి వేంకటరామయ్య గారి వద్ద సంగీతం, శ్రీమతి దుగ్గిరాల మాణిక్యంగారి వద్ద భామాకలాపం, శ్రీ గుడివాడ అంజనేయులుగారి వద్ద గొల్ల కలాపం నేర్చుకొన్నారు.

## 5. శ్రీమతి సంకు పాపాయి

తెలుగువారి భామాకలాపంలోని సత్యభామ శుద్ధ తెలుగువారి ఆడపడచు. ఆమెలో తెలుగువారి గర్వం, అహంకారం మొత్తం తెలుగుజనమంతా ఉట్టి పడుతూ ఉంటుంది. కృష్ణభక్తి విశేష ప్రచారంలో నున్న ఉత్తర భారతదేశంలో రాధా మాధవుల ప్రణయ

గాథలకు సంబంధించిన ముచ్చట్లే అనేక మున్నాయి గాని ఆతని అష్ట భార్యలకు సంబంధించిన గాథలు లేవు. సిద్ధేంద్రుడు సృష్టించిన భామాకలాపంలోని సత్యభామ దేశంలో మరెక్కడా కల్పించదు. "అయితే సత్యభామ కళామూర్తి కాదా ? ఆమెను కళామూర్తిగా చూసే అవకాశం లేదా !" అని నేను అనుకొంటున్న తరుణంలో నాకు కాకినాడ సరస్వతీ గాన సభల రజతోత్సవం సందర్భంలో నాకు సత్యభామ కళా మూర్తిగా దర్శనమిచ్చింది. ఆమె ఎవరో కాదు శ్రీమతి పెంగెం సత్యభామ. ముక్కు మీద వేలు వేసుకొని ప్రదర్శించిన ఠీవి, గర్వం, అహం, సవతి, హావభావ తీరులన్నీ ఆమెలో నాకు గోచరించాయి. ఈమెకు ఏ మాత్రం తీసి పోని మరొక సత్యభామ శ్రీమతి సంకు హావాయి.

పూరించిన కంఠంతో ప్రతి దరువునూ పాడుతూ, ఆడుతూ ఉండే కను రమణీయంగా ఉంటుంది. ఈమె గొప్ప విద్వాంసురాలు, ఈమె పాటలో బిగి ఉంది. పాటకు తగ్గ ఆట, ఆటకు తగ్గ అభినయం ఈమె ధీమాగా ప్రదర్శించగలరు.

మందుల పట్టుకొని "మందు మూలి నా సవతి సామికి మందుపెట్ట తా నేమిటి ?" అన్న దరువును పాడుతూ అకాడమీ వారి సదస్సులో ఈమె అభిన యించినపుడు ఈమె గొప్పతనం చూసి సదస్యులంతా ఆశ్చర్యపోయారు.

ఈ వృద్ధ కళాకారిణి మండపేటలో జన్మించారు. శ్రీ లక్ష్మీజీ సింహాచలం గారి వద్ద భామాకలాపం, శ్రీ మానేపల్లి బులిసుబ్బారావు గారి వద్ద కర్ణాటకం, శ్రీమతి ముద్దుల కోఫనాద్రిగారి వద్ద కేళిక అభ్యసించారు. శ్రీ నర్సాపురం వెంకటరమణ కృష్ణమూర్తిగారు ఈమెకు శాస్త్రీయసంగీతం నేర్పారు.

## 6. శ్రీమతి సరిదె మాణిక్యం

"నేను నేర్పింది ఒక్కటే కళ కాదు, నీవు నేర్చిన విద్య సంపూర్ణమయింది కాదు, భరతశాస్త్రం ఒక్కటే అయినా వ్యాఖ్యానాలు వేరు, సంప్రదాయాలు వేరు. ఒక్కొక్కరి యందు ఒక్కొక్క విధంగా కళా సరస్వతి ప్రకాశిస్తుంది. ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ అని అనుకోకుండా ప్రతి సంప్రదాయంలోని విశిష్టతను ఓర్పుతో, సహృదయంతో తెలుసుకొన డానికి ప్రయత్నించు. పలుకుబడితో ఖ్యాతి నార్జించిన ప్రతివారూ గొప్ప కళాకారులు కాకపోవచ్చును. మరుగున పడియున్న మాణిక్యాలు ఎన్నో ఉండ వచ్చును. కనుక దేశం నలుమూలలు పర్యటించి నా వద్ద నేర్చుకొన్న విద్యకు నీవు మెరుగులు దిద్దుకో !" అంటూ నా గురువుగారు నాకు హితవు చెప్పారు. ఆమె చెప్పినట్టుగా మరుగున పడియుండిన మాణిక్యా లలో ఒక మాణిక్యం శ్రీమతి సరిదె మాణిక్యం.

శ్రీమతి సరిదె మాణిక్యం ఒక గొప్ప కళావేత్త. ఆమె కంఠం వీణలా మ్రోగుతుంది. కర్నాటక నాట్య మందు, అభినయమందు అందెవేసిన చేయి ఆమెది. నవరస భరితంగా, సహజ సౌందర్యంతో ఆమె అభి నయించేవారు.

ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారు నిర్వ హించిన సదస్సులో శ్రీమతి మాణిక్యం ఒక ఆధ్యాత్మ రామాయణ కీర్తనను పాడుతూ అభినయించారు. ఈ ఆధ్యాత్మరామాయణ కీర్తనలో తెలుగు నుడికారం, తెలుగు తనం, తెలుగు మాధుర్యం, దేశీయ సంగీతం తొణికిసలాడుతూ ఉంటాయి. సాధార ణంగా పదాలను అభినయించే టప్పుడు శృంగా రంలోని సంచారీభావాలను మనం ప్రదర్శిస్తే సరిపో తుంది. ఆధ్యాత్మ రామాయణ కీర్తనను అలా ప్రదర్శించడానికి వీలులేదు. కీర్తనలో వచ్చే కథా సందర్భాన్ని బట్టి శృంగార, వీర కరుణ, హాస్య, రౌద్ర, బీభత్స, భయానక, కరుణ రసాలను అప్పటి కప్పుడు మార్చి ప్రదర్శించవలసి యుంటుంది. ఇటు వంటి క్లిష్టమైన కీర్తన నొకదానిని ఆమె ఎన్నుకొని ఆమె భక్తి భావంతో గానం చేస్తూ ఆంగిక వాచికాభి నయాలను ప్రదర్శించి ప్రేక్షకులను తన్మయులను గావించారు.

శ్రీమతి మాణిక్యంగారిది పశ్చిమ గోదావరి జిల్లా లోని బల్లిపాడు గ్రామం. శ్రీమతి దాసరి మహాలక్ష్మి ఈమెకు అభినయ విద్య నేర్పారు. శ్రీ పురుగళ్ల సుబ్బయ్యగారు ఈమెకు ఆధ్యాత్మరామాయణ కీర్తన గానాన్ని అభినయాన్ని నేర్పారు. ఈమె బల్లిపాడులో మదన గోపాలస్వామి వారి సేవకులుగా ఉండేవారు. ఉభయ గోదావరి జిల్లాలలోను గుంటూరు జిల్లాలోను ఈమె అనేక ప్రదర్శనలు ఇచ్చారు.

## 7. శ్రీమతి చింతా చినగనిరాజు

భరత శాస్త్రం, అభినయ శాస్త్రం క్షుణ్ణంగా తెలిసిన పండితులు పూర్వం కోనసీమలో ఎక్కువ మంది ఉండేవారు. అందువల్ల ఈ శాస్త్రంలో నిష్ణాతులైన నట్టువరాండ్రే ఈ కోనసీమ ప్రాంతాలలో నాట్య కచ్చేరీలు చేయడానికి వెళ్లేవారు. నాట్యంలో ఎవరైనా తప్పుగా ఒక హస్తాన్ని పట్టినా సంచారీ భావాన్ని తప్పుగా ప్రదర్శించినా సభలోని పండితులు ఆ కళాకారిణి చేత గజ్జెలు విప్పించేసి పొమ్మనేవారు. అందువల్ల నాట్య, అభినయశాస్త్రాలలో దిట్టలైతే గాని కోనసీమలో ప్రదర్శనలివ్వడానికి సాహసించేవారు కారు.

సుమారు ఇరవై అయిదు సంవత్సరాల క్రిందట కూచిపూడినాట్యం శాస్త్రీయమైనదేనని నిరూపించుకోవల సిన స్థితి ఏర్పడింది. అందుకు ఒక సదస్సును నిర్వహించవలసి వచ్చింది. ఆ భారం నా మీద పడింది. ఆ సందర్భంలో నేను వృద్ధకళాకారులలో అనేక మందిని కలుసుకొన్నాను. డెబ్భై సంవత్సరాల వృద్ధురాలైన శ్రీమతి గనిరాజుగారిని కలుసు కొన్నాను.

సౌమ్యంగా, చిరునవ్వును చిందిస్తూ "దయచేయండి బాబూ! మీ కోసమే ఎదురు చూస్తున్నాను," అంటూ ఆ శాంతమూర్తి నన్ను ఆహ్వానించారు. ఆ వయస్సులో గూడా ఆమె నాతో ఎన్నో భరత శాస్త్ర విషయాలను చర్చించి నప్పుడు ఇంకా ఎన్నో విషయాలను తెలుసుకొనాలన్న తపన ఆమెలో ఉన్నట్టు నాకు గోచరించింది.

హస్తాలు, వాటి వినియోగాలు, నృత్తహస్తాలు, నృత్యహస్తాలు, అభినయంలో హస్తాలను పట్టె తీరులు, క్షేత్రయ్య పదాల అభినయం, జావళీల అభినయం, వాటిలో భేదాలు ఇలా ఇలా ఎన్నో విషయాలు ఆమె నాతో చర్చించారు.

ఆమెతో ఈ విషయాలను చర్చిస్తుండే కాలం ఇట్టే గడిచి పోయింది. ఆమె భరత, అభినయ శాస్త్రాలతో ఎంత గొప్ప పండితురాలో నాకు తెలియవచ్చింది. భరతుని నాట్యశాస్త్రం, నందికేశుని అభినయ దర్పణం, భరతార్ణవాల్ని కాచి వడగట్టినట్టు నాకు అర్థమయింది. అయినా ఇంకా ఆమె ఆ వయస్సులో తనకు తెలియని విషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసతో నన్ను అనేకం అడిగారు. కళ అపారమైనదని గుర్తించిన నిజమైన కళావేత్త ఆమె.

ఆమె పూర్వులు కూడా భరత, అభినయశాస్త్రాలలో పేరు గాంచినవారు. ఈమె అమ్మమ్మ శ్రీమతి అంబాసాని గొప్ప నర్తకీమణి, మేనత్త శ్రీమతి చింతా వీరభద్రం అభినయ శాస్త్రంలో అందెవేసిన చెయ్యి. ఈమెవద్దనే శ్రీమతి చినగని రాజు కర్నాటకం, అభినయం, గొల్లకలాపాలలో శిక్షణ పొందారు. ఈమెకు భామాకలాపం వచ్చినా, గురు ముఖంగా నేర్చుకో లేదు. "గురువు లేని విద్య గుడ్డి విద్య" అన్న అభిప్రాయంతో భామాకలాపాన్ని ఈమె ఎన్నడూ ప్రదర్శించలేదు. శ్రీ కాళ్లచెరువు కోటయ్య గారి వద్ద శాస్త్రీయ సంగీతం నేర్చుకొన్నారు.

ఈమె చాలా కాలం కూర్మాపురంలో ఆలయ దేవదాసీగా నృత్య పూజలో కాలం గడిపారు.

## 8. శ్రీమతి అన్నాబత్తుల సూర్యకాంతం

శ్రీమతి బులివెంకటరత్నంగారితో కలిసి సదస్సు నిర్వహణ సందర్భంగా శ్రీమతి సూర్యకాంతంగారితో మాట్లాడడానికి వెళ్లాను.

తెల్లని దుస్తులతో, నున్నగా దువ్విన తెల్లని కేశ సంపదలో తెల్లని మల్లెపువ్వులు తురుముకొని, బంగారు గొలుసులు, దండ కండియాలు, గాజులు, ఉంగరాలు ధరించి, కండ్లకు కాటుక పెట్టుకొని, పునుగు సువాసనలు వెదచల్లుతూ స్వర్ణాలంకార శోభితంగా

ఒక పొడవైన, నిండైన విగ్రహం మమ్మల్ని సహృదయంతో ఆహ్వానించింది. ఆమెలో సూర్యుని తేజస్సులో చంద్రుని చల్లదన మున్నట్టు అనిపించింది నాకు.

వృద్ధాప్యం వచ్చినా అలంకరణ మీద శ్రద్ధ ఆమెకు ఏమాత్రం తగ్గలేదు. కళ అంటే ఆమెకు ప్రాణం. అందుకనే ఆమె కళకళ లాడుతూ మమ్మల్ని ఆహ్వానించారు. చాలామంది కళవల్ల జీవిస్తే కొందరు కళ కోసమే జీవిస్తారు. పట్టుదలతో శ్రద్ధగా కర్ణాటకం, అభినయం అభ్యసించి, వాటిలో ప్రావీణ్యం సంపాదించి, కళ కోసమే జీవించిన కళాకారిణి ఈమె.

అభినయం చతుర్విధాలు, ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్వికం. వీటిలో సాత్వికాభినయం ప్రదర్శించడం చాలా కష్టం. ఈ సాత్వికాభినయం లోనే ఆంధ్ర కళాకారులు పేర్నెకెక్కారు. ఇది అందరికీ కరతలామలకం కాదు, కాని శ్రీమతి సూర్యకాంతానికి ఇది మంచి నీళ్ల ప్రాయం.

"ఏరీతి బొంకేవురా లేదని నాతో

పోలేదని నాతో, అలదాని యింటికి" అన్న ఈ సాహిత్యానికి నా కోరిక పైని అభినయించి చూపారు.

పర స్త్రీతో రాత్రంతా గడిపి తెల్లవారుజామున ఇంటికి వచ్చిన భర్తను చూసి నాయిక కోపగించి, తర్కించి, విమర్శించి, అసహనంతో, అసూయతో భర్తను నిందించి, చింతలో దుఃఖించే ఖండిత నాయికను ఈ పదంలో ప్రదర్శించాలి.

కనులతో, కనుపాపల కదలికలతో, పెదవుల కంపనంతో, దంతముల బిగింపుతో, శరీర కదుర్పాటులతో ముఖరాగాలతో విభిన్న భావాలను ఆమె ప్రదర్శించి చూపారు. సాత్వికాభినయం ఆమె సొమ్ము అని చెప్పక తప్పదు.

శ్రీమతి సూర్యకాంతం ముమ్మిడివరంలో పుట్టారు. శ్రీ మద్దుల వరహాలుగారి వద్ద అభినయ విద్యను, శ్రీ చెరుకూరి రామమూర్తి గారి వద్ద శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించారు.

## 9. శ్రీమతి జక్కుల నూకరాజు

ఏ యొక్కరికో గాని యుక్త వయస్సులోనే కళా సరస్వతి కరుణాకటాక్షం లభించదు. యౌవనంలో శరీరం సౌష్ఠవంగా నున్నప్పుడు నృత్యకళలో అనుభవం సంపాదించా లనుకొనేలోగా శరీరంలో పట్టు సడలి, గాత్ర బిగి తగ్గి, ముఖంలో ముడతలుపడి వృద్ధాప్య చిహ్నాలు గోచరిస్తాయి. శరీరసౌందర్యంతో నాట్యాన్ని ప్రదర్శించే అవకాశాన్ని కళాకారిణి కోల్పోతుంది. సంపూర్ణ సరస్వతీ కటాక్షం లభించిన వారి దగ్గరకు లక్ష్మీదేవి రాదు, తన సోదరి జేష్టాదేవిని వారి వద్దకు ఆమె పంపుతుంది.

పూర్వం భరత విద్యకు పేరుగాంచిన ఊరు పెద్దాపురం. జగపతులు పాలించిన ఆ యూరిలో వారి కోటలు వారి అనంతరం శిథిలమైనట్టుగా వారు పోషించిన భరత విద్య కూడా జీర్ణించిపోయింది. ఆ యూళ్లో యింకా ఎవరైనా వృద్ధ కళాకారులు మిగిలి యుంటే వారి ప్రాచీన కళను చూడాలన్న సంకల్పంతో అక్కడున్న ఒక మిత్రుని ఇంటికి వెళ్లాను. అయితే అక్కడి కళాకారులలో ఏ యొక్కరూ మిగిలి లేరు గాని పిఠాపురం నుండి వచ్చి అక్కడ స్థిరపడిన ఒక కళామూర్తి ఉన్నట్టు తెలిసి ఆమెను చూడాలని నా మిత్రుణ్ణి కోరాను.

తెంపరెప్పలు లేక కట్టుపళ్లు లేక నీరసించి, ముడతలు పడ్డ శరీరంతో, లోతుకు పోయిన కళ్లతో మందగించిన దృష్టితో, చిరిగిన చీరతో, దీనవదనంతో నా ముందు ఒక వృద్ధురాలు ప్రత్యక్షమయింది. నా మిత్రుడు ఆమెను నాకు పరిచయం చేశాడు. ఆమె పేరు జక్కుల నూకరాజు. ఆమె స్వస్థలం పిఠాపురం. ఆమె తన తల్లి వద్దనే అభినయ కళను అభ్యసించింది. శ్రీ దుమరాడ సంగమేశ్వర శాస్త్రి, శ్రీ ఆమర్తి వేమన

దొర గార్ల వద్ద శాస్త్రీయ సంగీతాన్ని ఆమె నేర్చుకొన్నారు. శ్రీయుతులు మరువాడ రామమూర్తి, ఈరంకి సూర్యనారాయణ గార్లవద్ద హరికథలను అభ్యసించారు, అని నా మిత్రుడు చెప్పాడు.

నా కోరికపైని ఆమె "జాలమేల జలజముఖీ నా స్వామిని రమ్మన మనవే" అన్న జావళీని, "ముందటివలె నాపై నెనరున్నదా సామి" అన్న క్షేత్రయ పదాన్ని పాడుతూ ఆమె అభినయించింది.

ఆమె అభినయాన్ని మొదలిడగానే ఆమె ముఖంలోని ముడుతలు, కళ్లలోని విషాద ఛాయలు అదృశ్యమవ నారంభించాయి. ఈర్ష్యమాన శృంగార భావాలు ఆమె వదనంలో చోటు చేసుకొన్నాయి. స్వీయ ఖండిత నాయికగా ఆమె నా ముందు ప్రత్యక్షమయింది. ఆమె కళాతృష్ణ ఎంత ప్రభావవంతమైందో గదా! ఆ పేదరికం, ఆ వృద్ధాప్యం కళ ముందు బలాదూర్ అయిపోయాయి. ఇటువంటి కళాకారులు మనదేశంలో ఇంకా ఎంతమంది ఉన్నారో ఎవరి కెరుక?

## 10. శ్రీమతి మద్దుల లక్ష్మీనారాయణ

అఖిల భారత నృత్యకళాకారుల సదస్సు ముగిసిన మరి కొద్ది దినాల అనంతరం నా కొక లేఖ వచ్చింది. "అయ్యా! రామకృష్ణగారూ! చిన్న నాడే భరతవిద్య, అభినయకళ, భాగవత నర్తనం అభ్యసించి గత 30 సంవత్సరాలుగా కళారాధనతోనే జీవితాన్ని గడుపుతున్నాను. మీ సదస్సును వచ్చి మీవంటి అఖిలభారత కళాకారులను దర్శించే భాగ్యం దురదృష్టవశాత్తూ లేకుండా పోయింది. ఒక్కసారి నన్ను హైదరాబాదు పిలిపించి నా భాగవతప్రదర్శన పెట్టించండి. పెద్దల సమక్షంలో నా కళను ప్రదర్శించి, నా జీవితాన్ని సార్థకం చేసుకొంటాను..." అంటూ శ్రీమతి మద్దుల లక్ష్మీనారాయణ గారు నాకు వ్రాశారు.

నిజమైన కళాకారులు కోరేవి కీర్తి ప్రతిష్టలు కావు, ధనం అంతకన్నా కాదు. సలుసురు పెద్దల ముందు తమ విద్యను ప్రదర్శించడమే వారు కోరుకొనేది. శ్రీమతి లక్ష్మీనారాయణగారి కోరికను నెరవేర్చడానికి ఏవేవో ఇబ్బందుల వల్ల నాకు సాధ్యపడలేదు గాని ఆమె అభ్యర్థన నన్ను వేధిస్తూనే వచ్చింది. 1980లో జరిగిన అభినయ సదస్సును అవకాశంగా తీసికొని ఆమెను ఆహ్వానించాను.

సదస్సులో విద్వాంసులు, విద్యావేత్తలు పాల్గొంటారు. విశేషానుభవంగల కళాకారుల, రసికజనుల సమక్షంలో తమ కళను ప్రదర్శించడం కళాకారులకు ఒక అమూల్యమైన అవకాశం. ఆ యవకాశాన్ని ఆమెకు కలుగజేశాను. ఆమె ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

కర్ణాటక కచ్చేరి, భాగవత బాణీలలో అభినయం ఎలా ఉంటుందో ప్రదర్శించమని ఆమెను కోరాము.

అభినయం నాలుగు విధాలైంది. అర్థాభినయానికి సంబంధించింది ఆంగికం. గాత్రాభినయానికి సంబంధించింది వాచికం, అలంకరణకు సంబంధించింది ఆహార్యం, భావాభినయానికి సంబంధించింది సాత్వికం.

కర్నాటకంలోని ఒక పదాన్ని, భాగవతంలోని ఒక దరువును ఆమె అభినయించింది. ఇది సామాన్యమైన కార్యం కాదు. శృంగారం, కరుణ, వీరం, భయానకం మొదలైన వ్యతిరేక రసాలను వెంటవెంటనే ప్రదర్శించడం సామాన్యులకు సాధ్యపడదు. శ్రీమతి లక్ష్మీనారాయణ "ఎదమ్మా నా నాథుడు ఇందరిలోనా? ఎవమ్మా నా నాడెదుర్చోట సున్నాడో! ఈవ రమ్మని నన్ను జోడుగూడవాయె" అన్న గీతాన్ని ఆలపించి, అభినయించింది. ఆమె మనోధర్మం ఎంత వికాసవంతమైనదో చూడాలేగాని చెప్పడానికి వీలులేదు.

శ్రీమతి లక్ష్మీనారాయణ మానేపల్లిలో పుట్టారు. శ్రీ పుల్లే సుబ్బారావుగారి వద్ద అభినయ విద్యను, భామాకలాపం, గొల్లకలాపాలను శ్రీ గెద్దం సుబ్బరాయ శాస్త్రిగారి వద్దను అభ్యసించారు.

# 11, శ్రీమతి కోనె చిట్టిరాజు

ఒకనాడు పిఠాపురంలో నేను శ్రీ అల్లంరాజు సుందరం గారింటికి వెళ్తున్నాను. తోవలో ఒక యింటి అరుగుమీద ఒక వృద్ధుడు కూర్చొని తరంగాలు పాడుతున్నాడు. ఆ పాటకు పరవశించి కాస్సేపు అలా రోడ్డుమీదనే నిలబడి ఆలకించాను. తర్వాత ఆ వృద్ధుని గురించి సుందరంగార్ని అడిగాను.

అతడు కనకం నాగన్నదాసు, గొప్ప సంగీత విద్వాంసుడు. అతనికి తరంగాలే కావు అష్టపదులు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు గూడా దాగావచ్చును. ఒకప్పుడు భాగవత ఆట విరివిగా ఉన్నప్పుడు తూర్పు గోదావరి జిల్లా భామలందరికీ హాస్యం చెప్పినవాడు. స్వర్గీయ శ్రీమతికోనె వెంకటరత్నం అతనితో కలాపం తరచుగా ఆడేది. ఆమె మనుమరాలు శ్రీమతి కోనె చిట్టిరాజు కాలుకు ప్రమాదం జరగడంవల్ల కలాపం ఆటను కట్టిపెట్టింది. నాగన్నదాసు వృద్ధుడైనాడు, కాని స్వేచ్ఛా జీవి కావడంవల్ల పూర్తిగా ఒకరిపైనే ఆధారపడడం ఇష్టం లేక తెలిసినవారి ఇండ్లలో వారాలు పెట్టుకొన్నాడు. నేను ముందు అనుకొన్నట్లుగా అతడు బిచ్చగాడు కాడు, అత డొక కళారాధకుడు జీవ యెరుకల కురవంజి యక్షగానాన్ని ఎరిగిన ఏకైక యక్షగాన కళాకారుడు. అతనితో భాగవత కళను గురించి చర్చించి వివిధ బాణీల్లోని భేదాలను, మెలకువలను తెలుసుకొన్నాను.

ఆతని ద్వారా ఆతని మనుమరాలు శ్రీమతి చిట్టిరాజును కలిసి ఆమె పాడగా వారి భామాకలాప బాణీని విన్నాను.

"భామా యని పిలుతురే, వయ్యారి సత్యభామా యని పిలుతురే!" అన్న నెల్లిమర్ల గోపాలునికి అంకితమైన దరువును, "తెలియ నైతినే నే నా సామి మచేసును" అన్న కలహకాంతణ దరువును ఆమె తీయగా పాడి వినిపించింది.

నిండైన విగ్రహం, మంచి సంస్కారం, చక్కని వాక్కు భామకు కావలసిన అన్ని హంగులు ఆమెకున్నాయి. కాని ఆటకు పనికి రాకుండా పోయాయి.

శ్రీమతి చిట్టిరాజు గారి అమ్మమ్మ శ్రీమతి ఉదయాచలం. ఆమె స్వర్గీయ వాసక మల్లయ్యగారివద్ద భామాకలాపం నేర్చుకొన్నారు. ఆ విద్యను తమ కుమార్తె శ్రీమతి వెంకటరత్నంగారికి నేర్పారు. అయితే వెంకటరత్నంగారు తమ కుమార్తె శ్రీమతి చిట్టిరాజుకు ఆ విద్యను నేర్పకుండా ఆమె పసికందుగా ఉండగానే స్వర్గస్థులయినారు. అందువల్ల అమ్మమ్మ, తాత నాగన్న దాసుగారు శ్రీమతి చిట్టిరాజుగారికి సంగీతం, అమరం, భామాకలాపాలు నేర్పారు. శ్రీ కూచిమంచి సుబ్బారావుగారి వద్ద గొల్లకలాపం నేర్చుకొన్నారు.

# 12. శ్రీమతి అల్లు పల్లవపాణి

వాడపల్లి వారు సుప్రసిద్ధ కళాకారిణులని ఒకసారి శ్రీ అల్లంరాజు సుందరంగారు చెప్పారు. అందుకని, శ్రీమతి పల్లవపాణి గార్ని అభినయ సదస్సులో అభినయించడానికి ఆహ్వానించాను. "ఆటమాని చాలా కాలమైంది. నా వంతుకు చిన్న జావళీ వేయండి, అభినయించి చూపిస్తాను" అన్నా రామె. సరదాకు చిన్న పిల్లలు చేసే ట్రిమీని ఈమె కోరడమేమిటా అని ముందు ఆశ్చర్యపోయినా, "తాళు తాళర స్వామి తత్తర పడనేల? అత్తింటి కోడలని వేళగాదురసామి" అన్న జావళీని శ్రీమతి చాటపర్రు బాలా త్రిపుర సుందరి గారు పల్లూరి రాజావారు ఏర్పరచిన సభలో పండితులు, కవులు, గాయకులు, కళావేత్తల సమక్షంలో అభినయించి అందర్నీ ముగ్ధుల్ని చేశారని ఒకసారి శ్రీమతి చదలవాడ సామ్రాజ్యం గారు నాతో అన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి. అందువల్ల శ్రీమతి పల్లవపాణిగారి కోరికను కాదనలేక పోయాను. ఆమె కడు వృద్ధురాలు, నడుం వంగిపోయింది. పండ్లూడి పోయి ముఖం ముడతలు పడింది. కళ్లలో కాంతి తగ్గిపోయింది.

"మగవారికి ఇంత సిగ్గేల? దిగు లేల?" అన్న జావళీని ఆమె అభినయసదస్సులో అభినయిస్తూ వితర్కం, ఆశ్చర్యం ప్రదర్శించి అభినయాన్ని పిలిచి పలికించారు.

శ్రీమతి పల్లవపాణి చినవాడ పల్లెలో జన్మించారు. ఆమె తల్లి శ్రీమతి లక్ష్మీనరసింహంగారి వద్దనే కర్నాటకం అభ్యసించారు.

## 14. శ్రీమతి దుగ్గిరాల జగదాంబ

"అయ్యో! నాకు భరత విద్య మీద విరక్తి కలిగింది. ఆ విద్య విలువను ఎరిగి గౌరవించే పెద్దలు ఈ రోజుల్లో కరువయ్యారు. నేను ఏనాడో ప్రదర్శన లివ్వడం మానివేశాను. నేను రాలేను. నన్ను క్షమించండి!" అంటూ శ్రీమతి జగదాంబగారు నేను అఖిల భారత నృత్యోత్సవాలలో పాల్గొనమని ఆహ్వానించినప్పుడు అన్నారు. 1971 లో జరిగిన మువ్వగోపాల స్వామి ఉత్సవాల వరకు ఆమె భరత విద్యను చూసే అదృష్టం కలగలేదు.

"ముందటి వలె నాపై నెనరున్నదా సామి
ముచ్చట ఇక నేలర!" అన్న పదాన్ని పాడుతూ క్షేత్రయను ఆమె ఆరాధించినప్పుడు ఆమె ప్రదర్శించిన సాత్వికాభినయాన్ని, హస్తాల పొందికను సంచారుల ప్రదర్శనను చూసి ఆమె ఎంతటి కళామూర్తో తెలుసుకొన్నాను.

శ్రీమతి జగదాంబగారు మండపేటలో పుట్టారు. ఆమె పెద్దతల్లి శ్రీమతి విరాజితంగారి వద్ద అభినయం, భామా కలాపం, గొల్లకలాపం నేర్చుకొని అనేక పండిత సభల్లో ప్రదర్శన లిచ్చారు.

## 15. శ్రీమతులు అన్నాబత్తుల వేంకట విజయగోపాలరత్నం వేంకట నారాయణమ్మ

శ్రీమతి బులి వేంకటరత్నంగారి పెద్దక్క శ్రీమతి మాణిక్యంగారి కుమార్తె శ్రీమతి విజయగోపాలరత్నం, రెండవ అక్క శ్రీమతి పెద వెంకటరత్నం గారి కుమార్తె శ్రీమతి నారాయణమ్మ వీ రివురు అభినయ కళలో ఆరితేరినవారు. పేరూరు శివార్లలో నున్న విశ్వేశ్వరుని కల్యాణ మహోత్సవాలలో ప్రతి సంవత్సరం పాల్గొని తమ కళా పాండిత్యాన్ని ప్రదర్శించి పండితులచే శభాష్ అనిపించుకొన్న కళావేత్తలు వీరు. విశ్వేశ్వరపుర అభినయకేళిక తీరు ఒక ప్రత్యేకమైంది. రాత్రి పది గంటలకు ఒక వర్ణంతో కేళిక ప్రారంభించి ఒక పద పల్లవిని అభినయించే సరికి తెలవారి పోయేది.

సుమారు ఎనిమిది గంటలసేపు ఒక వర్ణం, ఒక పదాన్ని పండితుల సమక్షంలో ప్రదర్శించడానికి ఎంత పాండిత్యం కావాలి! ఎంత సాధన ఉండాలి!

పూర్వం గురుముఖంగా కళాధ్యయనం చేసిన కళాకారులకు ఒక కావ్యాన్ని ముగించే సరికే అలంకార శాస్త్రం క్షుణ్ణంగా వచ్చేది. మనోధర్మం అలవడేది. వివిధరీతుల్లో అభినయాన్ని అల్లుకొని పోయే శక్తి అలవడేది. ఒకే నాయికలో అనేక నాయికా రూపాలను ప్రతిబింబింపజేసి అభినయించగల పాండిత్య ప్రతిభ అలవడేది. అందువల్ల ఏ కొత్త పదాన్ని లేక పాట నిచ్చినా దాన్ని ఒక్కసారి చదివి, అర్థం చేసికొని వెంటనే అభినయించే శక్తి సామర్థ్యాలు కళాకారుల కుండేవి.

ఇలాంటి కళాకారులు మన ఆంధ్రదేశంలో అనేకమంది ఇంకా మిగిలియున్నారు. వీరితో ఇటువంటి అభినయ కళ అంతరించకుండా కాపాడుకొనే బాధ్యత మనది.

ఈ ఉభయ కళాకారులకు వారి తల్లులే అభినయ కళకు గురువులు. శ్రీ చెరుకూరి రామమూర్తి గారు వీరికి శాస్త్రీయ సంగీతం నేర్పారు.

వీరిద్దరిది ముమ్మడివరం. కోన సీమలో వీరు అనేక ప్రదర్శనలిచ్చి పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకొన్నారు.

# నమస్సులు

**1. శివస్తోత్రం**

ఆంగికం, భువనం యస్య
వాచకం సర్వ వాఙ్మయమ్
ఆహార్యం చంద్ర తారాది
తం వందే సాత్వికం శివమ్ ॥

**2. దేవీ స్తోత్రం**

అంభోజనపురాణి, హరి రాణి గౌరాంగా
అంబా ! ఓ భ్రమరాంబా !
తుంబుర, నారదులు హెచ్చి పాడేరు
అంబా! ఓ భ్రమరాంబా !
శ్రీగిరి నిలయినీ ! భ్రమరాంబా !
శివుని పట్టపురాణి భ్రమరాంబా !

**3. విష్ణు స్తోత్రం**

శృంగార రస సందోహమ్
శ్రిత కల్ప మహీరుహమ్
శ్రయే శ్రీనాథ మేవాహమ్
శాంతలోక సుఖావహమ్ ॥

**4. భూదేవి స్తోత్రం**

సముద్ర వసనే దేవి
పర్వత స్తన మండలే
నాట్యం గరిష్ఠే భూదేవి
పాద ఘాతం క్షమాస్వమే

**5. గురు స్తోత్రం**

గురు బ్రహ్మ, గురు విష్ణుః
గురు దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

**చూర్ణిక**

శ్రీమత్ చతుర్ముఖ, శతముఖముఖ, నిఖిల బర్హిర్ముఖ, మస్త
కన్యస్థ, ప్రశస్త, నిస్తుల మకుట తట గతితా సర్గ
మణిగణ కిరణ దీపికా! రాజనీరాజన విరాజిత
చరణారవింద ద్వంద్వం నిర్ద్వంద్వం; సకల
ఘనాఘన చేతనాచేతన చరాచర ప్రయుక్తానం
త, కోటి బ్రహ్మాండ భాండకాంత వహతుండమ్
ముకుందమ్, విమల యమునా తట, విపుల
పులినస్థల నిఖిల జగదానందకర మధుర మంజుల
తర, మందర మధ్యమ తారక స్వరమురళీగాన
సుధారసపాన, సమాగత గోపికా గోపాలక గో
బృందమ్ యశోదానంద కందమ్, ముకుందమ్ !
పరాత్పర అభయ మవ్యయ మప్రమేయ, అవ్య
క్తానంద, అనంత మఘ మూంత వ్యగుణ సద్గుణ
రూపం, యాదవకుల దీపమ్!
మృదు మధుర తర పదాస్పదాన పద్యగద్య
ద్విపదాది కవితా సుధారసధారా లోలమ్!
శరణా గతావన శీలమ్, అప్రతిహత కపట
నాటక జాలమ్, అనంత కల్యాణ గుణజాలమ్,
శ్రీ వేణుగోపాలమ్ సదా మద
మనసా, శిరసా స్మరామి, నమస్కరోమి !

**వినాయక స్తోత్రం**

తొండము నేక దంతమును
తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును
మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున
కోరిన విద్యల కెల్ల నొజ్జయై యుండెడి
పార్వతీ తనయా! వోయి గణాధిప
నీకు మ్రొక్కెదన్ !

బిలహరి రాగం — ఆది తాళం

పల్లవి : పూరయ మమ కామంగోపాల ॥
అనుపల్లవి : వారం వారం వందనమోస్తుతే
వారిజదళ నయన గోపాల... ॥పూరయ॥

# భామాకలాపం



ప॥ భామా యని పిలతురే
వయ్యారి సత్యభామా యని తలతురే ॥భామా॥

అ॥ప॥ భామ యని నన్ను కోమలులలో మున్ను
నా మనోహరుడరి ప్రేమ నేలిన సత్య

భామా యని పిలతురే
వయ్యారి సత్య, ముద్దుల సత్య
వయ్యారి సత్యభామా యని తలతురే ॥భామా॥

1. ఏడేడు దీవులకు రాజైనట్టి
ఎలమి సత్రాజిత్తుకు
కూరిమి కలిగిన పుత్రికని లోక
వాడుక చేతను నన్ను చేడెలలోపల ॥భామా॥

2. పురహరుడు మొదలుగా
బ్రహ్మేంద్రాది సురలు గొల్చుచు నుండగ
సరవిగ నెల్లిమర్ల పురమున వెలసిన
వరపురుషులు దిగ్వ్రతులు యుత్తమ సత్య
॥భామా॥

తాతైత తక దితైత త
తైయ్యా తాదిమి దితైత త కిటతక
తతైతైత తక దితైత త
దితైత త తతైత త
దితైత తతైత తతైతత
ధినకిట త ధినకిట తై ధినకిట

ముక్తాయి

జంత కిటతక తరికిట। తరిత కిటతర
తరికిట।
జంత కిటతక తరికిట। జం తజ్జం తజ్జం
తజ్జం తజ్జం।
తజ్జంత। కిటతక దిర్గుడుతోం। కిటతక
ధిర్గుడుతోం।
కిటతక ధిర్గుడుతోం। దిర్గుడు తోం।

**ఆహిరి** **ఆదితాళం**

పల్లవి॥ దధిమధనా! నీవు రాపయ్యా మదనా ॥

అ॥ప॥ మదనా! మదనా! మదనా యనుచును

వదల లేక నీవలలో చిక్కితి

రావయ్యా! మదనా! మోహన

రంగ రావయ్య మదనా ! మోహన

మదనా! మదనా! మదనా యనుచు ॥వదలలేక॥

**కళ్యాణి**

కూరిమి సత్రాజిత్తు కూతురునైన నన్ను

శమంతకము దెచ్చి యిచ్చి చేపట్టినది మరువక

॥రావయ్య॥

**ద్విపద**

వినవె చెప్పెద నీకు విశదంబుగాను

సునుడు సత్రాజిత్తు కాంతు మా తండ్రి

ఏడేడు దీవుల నేలినవాడె

శమంతకము బడసి

శతవిధంబుల మహీపతి యని

భువిని మన్ననలు గాంచె

మాధవుని మది మెచ్చి

మమత తోడుతను

ప్రేమ మీరగ నన్ను

పెండ్లి గావించె

**శంకరాభరణం**

రంగుగా నా మెడ మంగళసూత్రము

పొంగుచు గట్టిన సంగతి మరువక

॥రావయ్యా మదనా॥

**బిలహరి**

ఆట ప్రాయమున తేటవి కన్నుల

కాటుక దిద్దిన కూటమి మరువక

॥రావయ్యా మదనా॥

**కేదార గౌళ**

దుష్ట నరకుని మసిమిననాడే

మెచ్చి కీర్తిత నిచ్చిన

ముచ్చట మరువక ॥రావయ్యా! మదనా!॥



ద్విపద

అలనాడు అసురులు
దేవతలు గూడి
అమృతము కొరకు
క్షీరాబ్ధి తరువగను
ఘుగఘుగమని పొంగిన
క్షీరాబ్ధి నుండి
వెలువడె అమృతంబు
వేడ్క మీరగను
సుర అసురులకు
ఆ యమృతంబు పంచ
అరుదెంచె అటుల
మాధవుడు అంతటను



కేదారగౌళ జంపె తాళం, తిశ్రగతి,

మోహినీ రూపమున ముద్దులొల్కుచును
హంస గమనంబున అందెలు పలుక
అలనాడు ధరియించి నట్టి ఈ జడను
నరకుని జంపిననాడు నను మెచ్చి
ఇచ్చిన ముచ్చటను విభుడు తా మరచి
విడనాడె నన్ను ఈ విధమున కొమ్మా !
దుష్ట నరకుని దునిమిన నాడే
మెచ్చి కీల్జడ నిచ్చిన ముచ్చట మరువక
॥రావయ్యా॥

మదన మోహనాకారుడే ఓయమ్మా !
మందరగిరిధారుడే వాడు .
మందరగిరిధారుడే!
అర్జుని సారథి సజ్జను డితడె
దుర్జన సంహార దూరితు డితడె ॥రావయ్యా!॥

ఆనందభైరవి ఆదితాళం

ఓయమ్మలారా! అదుగో చంద్రుడు
ఉదయం బాయెను ॥ ఓ ॥

ఓ యమ్మలారా! అడుగో!

ఓ యక్కలారా! అడుగో!

నే తాళలేనే! అడుగో! చంద్రుడు!

ఉదయం బాయెను! ॥ ఓ ॥

వా డుదయం బాయెను

నిదురలేక వానికి ఎదురు చూచితి నమ్మా,

కొమ్మా! ॥ ఓ ॥



మోహన పద్యము

చిన్ననాడు వివాహంబు చేయు వేళ
నన్ను భామాయటంచు అతడు పిలువ
అతనిని వైకుంఠపతి యని అంటిగాని
పేరు చెప్పను, నాకు ఓ యమ్మా!
పేరు చెప్పను, నాకు మా యమ్మా!
పేరు చెప్పను, నాకు సిగ్గాయె నో యమ్మా!

కాఫీ

ఇంద్ర నీలపుడాలు ఈ నడింపగ జాలు
దేహమ్ము కలవాడె మోహనాంగి
పరిపూర్ణ చంద్రుని పరిహసింపగ జాలు
నగుమోము కలవాడె చిగురు బోణి
జలరుహమ్ముల నెగ నక్కెమాడగ జాలు
కన్నులు కలవాడె కంబుకంఠి
దిక్కరి తొండముల్ ధిక్కరింపగ జాలు
బాహువుల్ కలవాడె పద్మగంధి
వేడు కలరంగ అల వెంకటేశ కవిని
బ్రోచువాడు, భక్తుల కాచువాడు
భామరో నా మనోహరుండైనట్టి వాడు
అట్టి శ్రీకృష్ణుండు నా విభుండు

ఇంచు వదనా!

మోహన ఆదితాళం

పల్లవి॥ సిగ్గాయె నోయమ్మా వాని పేరు చెప్ప
లజ్జాయె నోయమ్మా వాని పేరు చెప్ప

॥సిగ్గాయె॥

అ॥ప॥ సిగ్గాయె నోయమ్మ । చిన్ననాట నుండి
వాని పేరు చెప్ప వాడుక లేదాయె నమ్మా!

॥సిగ్గాయె॥

చ॥ వసుదేవ తనయుడై వసుధలో జన్మించిన
పసులగాపరి గొల్లవాని పేరు చెప్ప ॥సిగ్గాయె॥

సామ-త్రైవారం ఆదితాళం

సంధ్యా సమయము సరస వసంతము
యమునా తీరము కృష్ణ విలాసము
రాధా మాధవ కేళీ విలాసము
నారీ జనముల నడుమ నుండగ
నానా విధ తాళ గతులు పలుకగ
నయ వినయంబుల నర్తన మాడుచు
నవరస మొప్పగ మురళి నూదుచు
ధిమి ధిమి తత్తోం ధిం తత కిటతక ధిం
ధీం తకిట ధీం తకిట తక
దిద్దీ కిటతక దరికిట కిటతక ధీం తకధిమి
మృదంగ నాదము-తకధిమి-తకఝణు
ఝణ ఝణ ఝణ ఝణ కరతాళంబులు
దేవ దుందుభులు ధిమి ధిమి మ్రోయగ
సురలసురులు పుష్పవృష్టి గురియగ
అమరులు అమృత గానము చేయగ
అందెల రవములు సందడి చేయగ
రాస క్రీడల రంజిల చేసిన
శ్రీ పీతరా పురమున వెలసిన
కుంతి మాధవా ! జోహార్ !
అమృతవల్లీ దేవీ సమేతా!
కుంతీ మాధవా! జోహార్!

## కలహకారణం

శహన

ఒకా నొకనాడు పడకటింటిలో
హంసతూలికా తల్పముపై శయనించియుండగా
శ్రీకృష్ణసామి వారు వేంచేసి, నన్ను నిద్రలేపి
సర్వాభరణంబులను ధరియింప జేసి
నిలువు టద్దములో నీడ జూపించి
"హే! భామా! హే! సత్యభామా!
నీవా చక్కని దానవు ? నేనా చక్కని వాడను?"
అని అడిగె నమ్మా !



అంత ఆడ బుద్ధి అపర బుద్ధి గనుక
ఏమి యెరుగని అబలను గనుక
"నేనే చక్కని దాన" నంటినమ్మా !
అంత స్వామివారు అలిగి, కసిరి
దిగ్గున లేచి, శయ్య వెగి
చక్కా బాయెనమ్మా ।
ఇదియే స్వామి వారికి, నాకును
కలహకారణము, ఇందువదనా!

ఆనంద భైరవి ఆదితాళం

ప॥ అలనాటి నుండి "సత్యభామా! ర" మ్మన
డాయెనే ॥అల॥

అ॥ప॥ "భామా! ర" మ్మనడాయె, ప్రేమతో నాస్వామి
కాముని కేళి నన్ను కలిసి మెలసి యున్న
స్వామి ॥అల॥

కానడ

చ॥ కులుకుచు వాడు వచ్చి జిలిబిలి పలుకుల
వలపు లూరించు చెన్నుడు, పలుక దేమి సేతు
॥అం॥

బేగడ

వన్నె ప్రాయమువాడు కామజనకుడు నన్ను
ఎన్నెన్నో రీతుల ఏలినవాడు, నేడు ॥అం॥

అభేరి

చెంత చేరి నన్ను చెక్కిలి నొక్కి వాడు
మిక్కిలి ప్రేమతో మక్కువ తీర్చు స్వామి
॥అం॥

కాంభోజి

ముదమున తేలవలె మదన గోపాలుడు
మదవతిరో! మచ్చర మూనినాడె ॥అం॥

ఈ వరుసనే విప్రలబ్ధ నాయకగా గూడా అడుట కలదు. విప్రలబ్ధలో :—

ప॥ తెలియనైతినే । అంవాని మనసు అనియు.
మోసమాయెనే । ఓ చెలి॥ అనే పల్లవి ఆడుట
ఆచారముగా ఉండేది.



**యదుకుల కాంభోజి** **మిశ్రచాపుతాళం**

పల్లవి॥ "తప్పే"మని మీ రడుగ రమ్మా !
నా స్వామిని మీ రడుగ రమ్మా! ॥తప్పేమని॥

1. తప్పేమి లేదమ్మ తరుణిరో నా వల్ల
చెప్పరే మీరు కృష్ణుని చేతులు పట్టుక
అడుగరమ్మ నా స్వామిని

2. ఎన్నడైన వాని కెదురాడితినా నేను
మన్నన తోడుత మన్నగలయమని
॥అడుగరమ్మా॥

3. సొంతము నా వల్ల నేర మేమున్నదో
కూరిమితో చక్రధారుని వేడ్కొని ॥అడుగరమ్మా॥

4. వాసిగ ద్వారకా వాసుడైన శ్రీ
కేశవమూర్తిని వేసిలొగ్గి ॥మీరడుగరమ్మా॥

5. అడుగరమ్మా నాపలుకకు కారణమేమో?
కడువేగముకో ఆ కౌస్తుభధారుని
॥మీరడుగరమ్మా॥

**శంకరాభరణం** **ఆదితాళం**

పల్లవి॥ చెలి రమ్మననే ఇంటి నా స్వామిని ॥చెలి॥

అ॥ప॥ రమ్మని, వచ్చి, కౌగిలిమ్మనవే, రస
సొమ్మనవే ముద్దు నిమ్మనవే ॥చెలి॥

చ॥ 1. రాడాయె వీని మొక ఏడాయె, శౌరి వగ
వాడాయెనే సవతికి జోడాయెనే ॥చెలి॥

2. పంచ బాణుడదలించెను నా పై నెంతో
పొంచి బాణములు సంధించి వేసెనె ॥చెలి॥

సావేరి ఆదితాళం

హరి యేడే ఓ యమ్మా? ... మాధవీ!
హరి యేడే ... నరహరి యేడే? ॥హరి॥
మురహరి యేడే ... శ్రీహరి యేడే? ॥హరి॥

ఝుంఝూటి త్రిశం

పల్లవి॥ రాయబారము గొనిపోమ్మా
రమణీ మాధవీ నీవు (కొమ్మా)
జాగు సేయకమ్మా, అల మారు డేచె నమ్మా ॥రాయ॥

చ॥ ధరణి కలువాయి పురధాముడే రంగధాముడే
జాలిమాలి, వనమాలి (అల)దానియిలు
చేరెనే ॥రాయ॥





## దరువు

**శంకరాభరణం** **మిశ్రచాపు**

పల్లవి॥ అడిగి రావె, హాయి బాలికా, వస్తాడో రాడో?
ఎందుకు రాడో? ఏం రాడో? ॥అడిగి॥

చరణం॥ కుంతలమ్ముల బట్టి పంతునా
పూలబంతులు మెప వైచి పంతునా! ॥అడిగి॥
నను కాంతుడు కంతుని వారి కప్పగించి
రాడు, ఏమే రాడు? ఎందుకు రాడు? ॥అడిగి॥

**బిలహరి రాగం** **ఆది తాళం**

పల్లవి॥ అట్టే యుండేవు సుమ్మీ !
ఓ యమ్మా మాధవీ ! ॥అట్టే॥



చరణం॥ ఇంతలో నీవు రాకున్న
ఇదిగో నా కన్నుల నీరు
ఏటి కాలువలు సుమ్మీ
ఓ యమ్మా మాధవీ ! ॥అట్టే॥

2. వాసిగా శ్రీ నెర్లిమర్ల
వాసుడైన కేశవుని
వడి వడిగా దెమ్మా !
ఓ యమ్మా మాధవీ ! ॥అట్టే॥

3. నీ వెళ్లే త్రోవలోన
గాజు గంబపు మేడ ఆ
మేడపై నీ రూపు వ్రాసి పొమ్మా
ఓ యమ్మ మాధవీ ! ॥అట్టే॥

**మోహన** **ఆదితాళం**

పల్లవి: శకునాలు మంచివాయె నమ్మా !
ఓ యమ్మలార ! ॥శకునాలు॥

అ॥ప॥ శకునాలు మంచివాయె చంద్రనిభానన
ప్రకటిత వృషభము పరువిడి వచ్చెను
॥శకునాలు॥

చ॥ 1. ఇమ్ముగ వార్త వింటినమ్మా !
ఓ ముద్దుల గుమ్మా ! ॥శకు॥

2. ఇంపొంద పెరుగు జూచితి నమ్మా !
ఓ ముద్దుల గుమ్మా ! ॥శకు॥

3. ఇమ్ముగ పేర్లు వెంట నివాళులు
కమ్మని చెరుకులు చక్కగ గంటిని ॥శకు॥

**ఆభేరి**

చిలుకలు దాసి, బల్ రొదలు చేసె,
పికంబులు గూసె
తుమ్మెదలు సంగొని మోసె,
చంద్రవతివల్ల ఘూరెంతయు
గాసి జేసితి, ఆ చెలువుని వచ్చికల్ తలచి
చిత్తము ఝల్లున తల్లడింప
తెలుపగ లేను, నా వలపు నిలుపగలేను
గదమ్మ, మాధవీ !



రీతిగౌళ ఆదితాళం

ఎవరే? ఎదుట ఆ వచ్చేవా రెవరే?
అమ్మా ! ఓ యమ్మలార ! ॥ఎవరే॥
యౌవనమైన రూపము ! వారే ! వారే !
అదిగో పవనముపై వెలయువారు వారే !
ఇపుడు కవ్వడి చెలికానిని పిలుపరే !
అమ్మా ! ఓ యమ్మలార ! ॥ఎవరే॥
చిలుకల జంపు మట్టు ముట్టి
అదిగో మలయమారుతము మేనలుసు
తుమ్మెదలగుంపు జంపు చుట్టుముట్టి సిలుప
అమ్మా! ఓ యమ్మలారా! ॥ఎవరే॥
తను ప్రేమ కల మాధవి నె నడుగ
సౌమ్మ తడయక ఇచ్చెద నీ విపు డడుగ
వడి వడిగా నా మనవి వానితో నుడువ
వేగ కొనవశ్లూనీసుని తేవె !
అమ్మా! ఓ యమ్మలారా !

ఆనంద భైరవి ఆదితాళం

మదనా ! ఓ మదనా !
అబలలను వేచ తగునా ? మదనా ! ॥మదనా॥
బంగరు పూవుల నిన్ను మదనా !
రంగుగా పూజింతు నయ్యా! మదనా ॥మదనా॥
రత్నఖచిత పళ్లెరముతో మదనా
రమణులు హారతు లివ్వ మదనా! ॥మదనా॥

మధ్యమావతి రాగం

దండ మొక్కటి నీకు దశరథ వర పుత్ర!
రెండు దండంబులు పుండరీక!
మూడు దండంబులు ముల్లోకపూజిత!
నాల్గు దండంబులు నళిన నేత్ర!
ఐదు దండంబులు అమరేంద్రసుత పాద!
పదియు దండంబులు భానుతేజ !
నూరు దండంబు లున్నత జన కల్పక!
వేయి దండంబులు వేదవేద్య!
లక్ష దండంబులు పక్షీంద్రవాహన!
కోటి దండంబులు కోమలాంగ!
అనుచు నుతియింతు నిన్ను నే ననుదినంబు

నాదు కోర్కె లీడేర్చు యాదవేంద్ర!
శ్రీ మనోనాథ! మాధవ! ఆనంద
పద్మనాభ! దయానిధీ! పరమ పురుష!

**మోహన దరువు ఆదితాళం**

ప॥ దండమని తెలుపగదవే
వేదండాయనన నా స్వామికి ॥దండ॥

అ॥ప॥ పండిత పావనుడైన
పుండరీకాక్షుని తోటి ॥దండ॥

చ॥ ఆశగొని యున్నదాన నీ
కోసమని విన్నవించి
వాసిగా ద్వారకాపురి
వాసుడైన గోపాలునితో ॥దండ॥

**ఆనంద భైరవి**

చెలియరో నీవు నా చేయిజాడ లటు చూడ
వామ భాగమున నున్న వనిత లెవరు?
వనితల మధ్య హొయలుగా కూర్చున్న
సంభాషణ లాడేటి సరసు లెవరు?
చెక్కిట చేయిచేర్చి, మక్కువ చూపుచు
తక్కుచున్నట్టి యా తరుణు లెవరు?
నీటుగా తొడలపై వాటుగా కూర్చుండి
ముద్దుల గుల్కెడి ముదిత లెవరు?
చెలియలను గూడి ఆస్థానమండపమున
చిలుకపల్కుల పలికేటి చెలుము డెవరు?
మందయానల సందడి మరులుగొన్న
సుందరుండెవరు? చెప్పరే సుదతులార!

**ఆనంద భైరవి ఆదితాళం**

అల్లల్లా వాడు! అల్లల్లా వాడు!
హరియేమో! ఓయమ్మా!
అల్లల్లా వాడు హరి యేమో!
వాడు హరియేమో! ॥అల్లల్లావాడు॥



1. ఉల్లము రంజిల్లగా పల్లవ భామల సిగల
మల్లెపూపంపలు కొల్లలుగ దురుముచున్న
॥అల్లల్లా॥

2. శంక లేమి లేక ఇరుపంకల సులుకుచున్న
పంకజాక్షులతో గూడి బింకములు పలుకుచున్న
॥అల్లల్లా॥

3. భామరో! ద్వారకాపురి ధాముడైన శ్రీ కేశవ
స్వామిని నన్నేలు మని ప్రేమతోడ తెల్పుచున్న
॥అల్లల్లా॥

ఆదితాళం

చందమామ! చందమామ! చందమామ! మా
సుందరకృష్ణుం డేడే? చందమామ? ॥చంద॥
మా నందునిపట్టిని తేగవే చందమామ!
మమ్మెందుకిలా వేచెదవే చందమామ? ॥చంద॥
నందను డేడే చందమామ?
వెన్నదొంగ వెన్ను డేడే చందమామ? ॥చంద॥
తద్ధిమిధిమి యని తాండవమాడే
కాళియ మర్దను డేడే చందమామ? ॥చంద॥
వాసిగా పీఠికాపురమున వాసుడైన కుంతి
మాధవుడే
గాసి చేసి మమ్మిలా వేచుచున్నాడు గదవే
॥చంద॥

మోహన మిశ్రచాపు

ప॥ ఈ దారి నేమైన వచ్చెనా?
వేణునాదము వినవచ్చెనా? ॥ఈ దారి॥
చ॥ పాదపద్మములందు బంగారు గజ్జెలు
నాదము వినవచ్చె నల్లని కృష్ణుడు ॥ఈ దారి॥
వాడేలనే చెలి? వల్లూరి గోపాలుడు
ఈదారి నేమైన వచ్చెనా వచ్చెనా, వేణు
నాదము వినవచ్చెనా? ॥ఈదారి॥

ఆనంద భైరవి ఆదితాళం

ఏడమ్మా నా నాథుడు ఇందరిలోన ?
॥ఏడమ్మా॥
ఏడమ్మా నా నాథుడు ఎచ్చట నున్నాడో?
ఈడ రమ్మని నన్ను జోడు గూడడాయె!
॥ఏడమ్మా॥
ముదముతో శ్రీదుర్గా మదనగోపాలుడు
తానై వచ్చెద నని తరుణి రాడాయెనే
॥ఏడమ్మా॥

వాదవాదం వెదికి నినితరో
వాని లేగదవే ॥ఏడమ్మా॥

అఠాణా

గంధ గజస్థంభమున
బంధురముగ భేరివేసె వటురాపింపస్
పచ్చటి తేజి చిలుక యట! భాణము పువ్వట!
చెరుకు విల్లట! వెచ్చం సెరెయ చంద్రుడట !
జిలిబిలి పలుకుల కులుకు మాటదే!
వచ్చిన స్త్రీల మీదకట పలవుల కేల
ఎచ్చట కేగుదాన? ఇక నా గతి ఏమి ?
చెప్పవే సఖీ?

దరువు

వసంత ఆదితాళం

రామచిలుక నాతో పోరెనే! ఓ యమ్మలారా!
॥రామ॥

రంగురంగుల రామచిలుక! చెంగున ఎగిర
రామచిలుక
అంగజుడెక్కిన రామచిలుక! అందాలకుప్ప
రామచిలుక ॥రామ॥

పొంగు యవ్వనంపు జవ్వనంతో
పోరునలుప వచ్చె నవదారై ॥రామచిలుక॥

బాలను నే గోలను
కొమ్మను ముద్దుల గుమ్మను
ఇంతిని, పూ బంతిని
చేమంతిని మరుని దొంతిని
కంతుడు నాపై పగబూని ఈ వేళ
అంతులేని భాణ మల్లన వేసెను ॥రామ॥

కాంభోజి

కం॥ పున్నమ చంద్రుడు తూర్పున
పన్నుగ నుదయించి కళల పరిపూర్ణుడై
వెన్నెల గాయుచు వచ్చెను
కన్నెరో! తమి హెచ్చిపోయె కమలదళనేత్రీ!

దరువు

అర్ధచంద్రిక రాగమాలిక ఆదితాళం

మల్లెపూల మాలగాదె! కొమ్మా మాధవీ! అది
మారుడేసిన విరిశరమే నమ్మా! మాధవీ!
చంపక చెంగలువలుగదే! కొమ్మా
మాధవీ! అది
కంతుడేసిన విరిశరమే! నమ్మా మాధవీ!
కలువల పూబంతిగాదే! కొమ్మా మాధవీ! అది
కాయజుడేసిన విరిశరమే! నమ్మా మాధవీ!
గున్నమావి లేచిగురుగాదే! కొమ్మా
మాధవీ! అది
వెన్నుడేసిన విరిశరమే! నమ్మా మాధవీ!
చందన సుగంధము గాదే! కొమ్మా
మాధవీ! అది
మలయపవనుని మాయగాదే! అమ్మా మాధవీ!
వెన్నెల తాపము నోర్వగలేనే! కొమ్మా
మాధవీ! ఆ
చెన్నకేశవుని తోడితేగదే! అమ్మా మాధవీ!

వెన్నెల పదం

విదుకుల కాంభోజి ఆదితాళం

ఎన్నడు నా స్వామిని జూతు వెన్నెలాలో!
ఎన్నడు వాని కూడుదునమ్మా వెన్నెలాలో
॥ఎన్నడు॥
కొమ్మమీద కోయిల గూసె వెన్నెలాలో! నా
వెన్నుడిక రాకపోయె వెన్నెలాలో
॥ఎన్నడు॥
(వెన్నుడేడీ తెలుపరమ్మ వెన్నెలాలో)
॥ఎన్నడు॥
చిలుకల కలకల రవమే వెన్నెలాలో!
అది (నా)
వెన్నుని మురళిగదే వెన్నెలాలో ॥ఎన్నడు॥
తుమ్మెదల ఝుంకారమే వెన్నెలాలో! అది
వెన్నుని మువ్వల సవ్వడి గదే వెన్నెలాలో
॥ఎన్నడు॥
నీలమేఘ శ్యాముడమ్మా! వెన్నెలాలో। మా
ర్యాలి కేశవుడమ్మా వెన్నెలాలో। ॥ఎన్నడు॥
మోహనమూర్తి వాడే నమ్మా। వెన్నెలాలో
మోహినీ కేశవమూర్తి వెన్నెలాలో।
॥ఎన్నడు॥

కానడ రాగం

భూమిని ఆడజన్మమై పుట్టినందుకు
చింతసేతునా?
రామలలోన ప్రేమమీర నను రమ్మన్నందుకు
చింతసేతునా?
కాముని భాణజాలములు గమ్మినందుకు
చింతసేతునా?
ఏమని చింతసేతు? విధి నేమని దూరుదు
నేడు దైవమా?

ఆనందభైరవి అటతాళం

భామనా? సత్యభామనా?
భామ నన్నమాట వినక కోమలితో
గూడెనందుకు
ఏమని ఏచ్చురా, నీ ప్రేమనే నే గణచకుంటే
॥భామనా॥
అక్క రుక్మిణితో నీవు మక్కువతో గూడి న
న్నక్కర చేయనందుకు చెక్కిలి
నొక్కకుంటే
॥భామనా॥
పొందుగా రుక్మిణి ఇల్లు పొందు
చేసుకొంటివేరా?
గద్దరి చేతుల దానివద్దను కావనకుంటే
॥భామనా॥

దుడుకు మాటలెలా నాతో అడుగులో
తుళ్లించి నన్ను
జడను జుట్టి కొట్టి నిన్ను గడగడ
లాడించకుంటే
॥భామనా॥

**నాదనామక్రియ** **ఆదితాళం**

ఎంతో రాజసమే। ఈ గొల్లవాని
కెంతో రాజసమే ॥ఎంతో॥
ఎంతో రాజసమే। జనులంతా తెలిసి పనికి
కంతుకేళిలో కన్ను కలిసిమెలిసి
యున్నవానికి ॥ఎంతో॥
చల్లసేయగ రేపల్లెవాడలోకి వచ్చి
మేలిమైన పాలమీది మీగడలు
దొంగిలిన వానికి ॥ఎంతో॥
పర్వతాలపై పసులకాపరి
పారుటాకుల శాలువ పైగప్పుకొన్న వానికి
॥ఎంతో॥
నిన్నవరకు ఆ రేపల్లెవాడలోకి వచ్చి
జలకమాడగను వారి జడలు పట్టుక
లాగేవానికి ॥ఎంతో॥

**నాదనామక్రియ** **త్రిశ్రగతి**

జడతో కొట్టక మానను నే నీవేళ (నిన్నీవేళ)
జడతో కొట్టక మానను। ॥జడతో॥

1. జడతో కొట్ట మానను
జలజ వదనులందరు జూడ (లందరిలోన)
అడుగులు మళ్లించి నిన్ను
గడగడ లాడించకుంటే ॥జడతో॥
2. ఏంరా? (ఏమిరా?) ఈలాటి మర్యాద లేంరా।
కామినిరో?
ప్రేమమీర నాదు మనసు మీరితివి ఇవి
ఏంకజాలు ॥జడతో॥
3. పుండరీకాక్షుడా। నాతో
ఖండన చేసెదవేం? (చేసేవదేరా?)
దుండగములు మానుమి
కోరుకొండ పురనివాస। ॥జడతో॥

**దేశి** **త్రిశగతి—ఆదితాళం**

బంగారు పువ్వుల నిన్ను పూజసేతురా।
నా స్వామి।
శృంగారించి, కన్నులార జూతునురా।
నా స్వామి ॥బం॥
చెంగలువ పూదండలు మెడనిండ వేతురా।
నా స్వామి
రంగపురి వెంకటేశ। రారా మా
యింటిదాక। ॥బం॥

**మంగళం**

ముత్యాల హారతులు ముదితలు మీ కిప్పుడిమ్మా।
రత్నాల హారతులు రమణులు మీ కిప్పుడిమ్మా।
జయ జయ మంగళం।
నిత్య శుభ మంగళం।
హారతి గైకొనుమా। శ్రీ రామచంద్ర।
శ్రీ రఘునందన। సీతామనోహర।
శ్రితజన పరిపాల। శ్రీ రామచంద్ర।

# తూర్పు భాగవతం

శ్రీ కృష్ణ పరమాత్ముని పవిత్ర జీవితగాథే భాగవతం. మధురమైన ఆ భాగవతాన్ని మధురాతి నృత్య సంగీతాలతో ప్రదర్శించడమే భాగవత నర్తనం. ఈ భాగవత నర్తనాలను ప్రదర్శించే వారే భాగవతులు. మన రాష్ట్రంలో తూర్పు తీరానున్న శ్రీకాకుళం విజయనగరం, విశాఖ జిల్లాలలో ప్రదర్శింపబడుతూ ప్రచారమందున్న భాగవత సంప్రదాయాన్ని తూర్పు భాగవత మంటారు.

## భామాకలాపం

కలాప మంటే విజ్ఞానపూరితమైన వేదవాక్కు, ఇదొక ప్రత్యేకమైన ప్రబంధరచన. నృత్త, నృత్య, అభినయాలతో ప్రదర్శించడానికి అనువైన సంగీత రచనా విశేషాలను ఒక ప్రముఖ కళాకారిణి అభినయ నృత్త నృత్యాలయందు తనకు గల పాండిత్య ప్రతిభను ఈ రచనల ద్వారా ప్రదర్శించ డానికి వీలుంటుంది.

మన దేశంలోని కలాపాలన్నింటిలోను అత్యంత ప్రాచీనమైనది సంస్కృతంలో జయదేవుడు రచించిన "గీతగోవిందం," అన్ని భాషాకలాపాలన్నింటికి ఇదే మూలం, ఆదర్శం. మన తెలుగు భాషలో అతి ప్రాచీనమైన కలాపం "భామాకలాపం".

ఈ కలాపంలోని కథా వస్తువు ఒక చిన్నదైన సంఘటన. అలిగి తన మందిరానికి వెళ్ళిపోయిన శ్రీకృష్ణ స్వామికి సత్యభామ రాయబారం పంపి ఆయన్ను మళ్లీ తన మందిరానికి రప్పించుకొంటుంది. ఈ సంఘటన చాలా చిన్నదే అయినా అష్ట విధ నాయికల వర్ణనలు, అవస్థలు విప్రలంబ శృంగారంతో నిండి పెద్ద ప్రబంధంగా తయారయింది. కొందరు దీనిని తొమ్మిది రాత్రుల్ల ప్రదర్శిస్తూండేవారు. మరి కొందరు దీనిని తగ్గించి మూడు రాత్రుళ్లలో ప్రదర్శించేవారు. మరి కొందరు మరీ తగ్గించి ఏక రాత్రి ప్రదర్శనగా తయారు చేశారు.

అలిగి వెళ్లిన స్వామి తిరిగి తన వద్దకు వచ్చే లోపల అష్ట విధ నాయికల అవస్థలను సత్యభామ అనుభవిస్తుంది. సత్యభామ తెరవెడలక ముందు తెర లోపల కొంత గ్రంథముంటుంది. దీనిని "వినికిపట్టు" అంటారు. ఆ తర్వాత తెరపైని జడను వేసే చరిత్ర ఉంటుంది. దీనిని "వేణీవృత్తాంత" మంటారు. దీని అనంతరం కలహకారణం, దండంపట్టు, అలుకతప్పు, సభావర్ణన, మందులపట్టు, నారదకలహం, మాధవి రాయబారం, ఉత్తరం, స్వామి దర్శనం, ద్వితీయ మూర్ఛ అనే భాగా లున్నాయి.

రాగ అధ్యాయం, తాళ అధ్యాయం, భావ అధ్యాయం, నృత్త, నృత్యాలతో ఇది శోభిల్లుతుంది. ఆట, పాట, మాటల్లో కలాపవర్తకులు విశేష సాధన చేసి, పాండిత్యాన్ని సంపాదించుకొంటారు.

ఈ కలాపాలలోని సంగీత రచనలు 'దేశి' పద్ధతికి చెందిన ఛందోరీతుల్లో ఉంటాయి. దరువు, ద్విపద, ద్విపదార్థం, కందం, కందార్థం, సీసం, వృత్తం, రగడలు, త్రిపుటలు, అర్ధచంద్రికలు, ఏలలు ప్రధానంగా ఉంటాయి.

కర్నాటక బాణికి చెందిన రాగ, తాళాలలో ఈ రచనలన్నీ కేళిక చేయబడ్డా, గానరీతి, తాళ విన్యాసం దేశి సంప్రదాయంలో ఉంటాయి. ఆదిలో నాట, అంత్యంలో సురట ఉండడం సంప్రదాయం.

యక్షగానం, వీధి నాటకం, వీధి భాగవతం ఒక్కటే నని సామాన్య పండితులు అనుకొంటూ ఉంటారు. కాని ఈ మూడూ వేర్వేరు సంప్రదాయాలకు చెందినవి అని వీటిని గురుముఖంగా నేర్చుకొన్న కళావేత్తల అభిప్రాయం.

## భాగవతం-స్త్రీ కళావేత్తలు

ఈ కళా రీతి ప్రత్యేకంగా పురుషుల కోసమే ఏర్పడింది. ఈ సంప్రదాయాన్ని పురుషులు మాత్రమే అభ్యసించి, ప్రదర్శించడం భారత దేశమంతటా ఉన్న ఆచారం. కాని మన ఆంధ్ర ప్రాంతంలో మాత్రం స్త్రీలు గూడా ఈ కళారీతిని అభ్యసించి ఈ భాగవతంలో లాస్యాన్ని ప్రవేశ పెట్టారు. మన తెలుగు దేశ నృత్య కళాకారిణులు మన భారతదేశ నృత్య కళకు సమర్పించిన ఒక అమూల్యమైన కానుక ఈ లాస్యరీతి.

## నవజనార్దనం-భామాకలాపం

తొమ్మండుగురు సత్యభామలు, తొమ్మండుగురు కృష్ణులు తొమ్మండుగురు మాధవులు వారి వారి సహాయకులతో సహా ఒకే రంగస్థలంపైని ఒకేసారి కేళిక చేయడమే "నవజనార్దనం". ఒకే నర్తకి తొమ్మిది రాత్రుళ్లు సత్యభామగా కేళిక చేయడం గూడా నవ జనార్దనమే. ఇవి అరుదైన ప్రక్రియలు.

ఇటువంటి ప్రదర్శనలను మూడింటిని చేయిస్తే ఒక యజ్ఞం చేసినంత ఫలం వస్తుందని మన పూర్వులు విశ్వసించేవారు, అందుకని దేశ సౌభాగ్యం కోసం వీలయినప్పుడల్లా ఇటువంటి ప్రదర్శనలను మన పూర్వులు ఏర్పరచేవారు.

## తెరపైని జడ - సభకు సవాలు :

భామాకలాపంలోని భామ జడకు ఒక ప్రత్యేక విశిష్టత ఉంది. ఆమె జడ సామాన్యమైన జడ కాదు. విశ్వకర్మ సృష్టించిన జడ అది. తెరపైని ఆ జడను భామ వేస్తే ఆ సభలో నున్న పండితులలో ఎవరైనా సరే ఆ భామతో శాస్త్ర చర్చ చేయవచ్చునని ఆమె సవాలు చేస్తున్నదని దీని అర్థం. ఆ చర్చలో భామ ఓడిపోతే ఆ సభా సమక్షంలోనే ఆ గెలిచిన పండితుడు ఆ జడను కత్తిరించవచ్చును. జడ కత్తిరించబడితే అంతకన్నా అగౌరవం భామ కుండదు. అందువల్ల భామ వేషం కట్టే కళాకారులు శాస్త్రాన్నీ, సంప్రదాయాన్నీ గురు ముఖంగా అభ్యసించేవారు.

ఈ భాగవతం ప్రధానంగా నాలుగు రీతుల్లో మన ఆంధ్రదేశంలో ఉంది :

**1. తూర్పు బాణీ**

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలలో పురుషులు ఆరాధిస్తున్న కళారీతి.

**2. లాస్య బాణీ**

తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని స్త్రీ కళాకారులు చేపట్టిన కళారీతి ఇది. అంటే దేవదాసీ సంప్రదాయానికి చెందిన బాణీ ఇది.

**3. కూచిపూడి బాణీ**

కృష్ణా జిల్లాలో మాత్రమే ప్రచారంలోనున్న బాణీ ఇది.

**4. రాయలసీమ బాణీ**

ఒక విశిష్ట కలాపబాణీ 'పారిజాతం' అనే పేరుతో రాయలసీమలో గూడ ప్రచారంలో ఉండేది కాని అది కాలగర్భంలో కలిసిపోయిందని నేను విన్నాను. దీనిని గురించి వీలయినంత వరకు తెలిసికొవాలని నేను చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలు పర్యటించాను.

మా గురువు గారు శ్రీమతి నాయుడు పేట రాజమ్మగారి వద్ద కాళహస్తిలో నాట్య విద్య నభ్యసించిన కలువాయి నాగమణమ్మ, ఈమె మేనత్త పుల్లం పేట మహాలక్ష్మి. బుక్కపాలెం మహాలక్ష్మి భాగవతం ఆడే వారని విని వారి ఇళ్లకు నేను వెళ్లాను. అక్కడ ఉండిన కొన్ని తాళపత్ర గ్రంథాలను చూశాను. కర్నాటక నర్తనానికి సంబంధించిన కొన్ని వివరాలు మాత్రం ఆ గ్రంథాలలో ఉన్నాయి కాని భామాకలాపాల గురించి అందులో ఏమీ లేవు.

మదరాసు రాష్ట్ర గవర్నరుగా ఉండిన సర్ ఆర్థర్ హోప్ సమక్షంలో నృత్య కేళిక చేసి, బంగారు పతకాన్ని బహుమతి పొంది, "షేర్" అనే బిరుదును అందుకొన్న వెల్లాల లక్ష్మీకాంతమ్మనే ఒక నృత్య కళావేత్త కడప జిల్లాలోని ప్రొద్దుటూరులో ఉండే వారని విని అక్కడికి నేను వెళ్లాను. ఈమె అనేక పండిత సభల్లో నృత్య కేళికలు చేసి, అనేక స్వర్ణ పతకాలతో సమ్మానింపబడ్డారని విన్నాను. రాయలసీమలోని ప్రఖ్యాత సంగీత విద్వాంసులు శ్రీ జమాలప్పగారి వద్ద ఈమె శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించారట. ఆమెతోను ఆమె శిష్యులతోను వారు ప్రదర్శించిన నాట్యరీతుల గురించి ముచ్చటించాను. వారు కర్నాటకాన్నే ఆడేరు గాని కలాపాలను ఆడ లేదని తెలిసికొన్నాను. "తాప" అనే ఆ ప్రాంత నృత్త కేళికలను గూడా వారు చేసేవారట.

కర్నూలు జిల్లాలోని కోవెలకుంట్ల, బనగాన పల్లె ప్రాంతాలను సందర్శించాను. అక్కడ కలాపాలను ఆడినవారందరూ గతించారు. ఉన్నవారు మాత్రం భరతరీతిని, తాప బాణీని మాత్రమే ఆడుతున్నారు. పూర్వం బనగాన పల్లె నవాబులు భాగవత కళను పోషించారు. కోటకొండ, కపట్రాల గ్రామాలలోని భూములను ఆ నవాబులు భాగవతులకు దానమిచ్చి, ఈ కలాప సంప్రదాయాన్ని ప్రచారం చేయడానికి సకల సౌకర్యాలను వారికి కలుగ జేశారని నేను విన్నాను. కూచిపూడి భాగవతులే కొందరక్కడికి వలస వెళ్లినట్టు నాకు తెలిసింది. వారక్కడ భామా కలాపాన్ని ఆడుతూ ఉండేవారట.

వయోవృద్ధులైన బ్రహ్మశ్రీ భరత శాస్త్రం చల్లా లక్ష్మీ నారాయణ శాస్త్రి గారిని కలుసుకొనే అవకాశం నా కక్కడ కలిగింది. ఆ వృద్ధ కళాకారుని కలాపం ఆట చూసే భాగ్యం నాకు కలుగకపోయినా వ్యాఖ్యాన సహితంగా ఒక అష్టపదిని వారభినయించగా చూసే అదృష్టం కలిగింది. భాగవత ప్రదర్శనలలో వారికి నట్టువ పాడేవారని నా కాయన చెప్పారు.

ఆ తర్వాత నేను బెల్గాం, బళ్లారి వెళ్లాను. అక్కడ కొందరు కన్నడ "పారిజాతాన్ని" ఆడుతున్నారు. నేను చూశాను. పేరు అదే ఆ కృష్ణ పారిజాతం ఒక నృత్యనాటకం. నారదుడు వచ్చి పారిజాత పుష్పాన్ని శ్రీ కృష్ణునికి ఇస్తాడు. కృష్ణుడు దానిని రుక్మిణీదేవికి

ఇస్తాడు. ఈ విషయం తెలిసి సత్యభామ కృష్ణునిపైని అలుగుతుంది. ఈ సంఘటనలను పాత్రలద్వారా వారు ప్రదర్శిస్తారు.

తెలుగువారి పారిజాతాలే ఈ నృత్యనాటకాలకు మూలమని వారే చెప్పుకొంటారు. ఏమైనప్పటికీ అసలైన తెనుగు పారిజాతం ఆట రాయలసీమ ప్రాంతాలలో పూర్తిగా అంతరించి పోయింది.

కర్నూలు పట్నంలో నట్టువవారి వీధి ఒక టుంది. పూర్వం ఆ వీధిలో నట్టువ మేళాలవారు విరివిగా ఉండేవారు. ఆ వీధికి వెళ్లి, నట్టువ ఇందిరాదేవి అనే ఒక వృద్ధ కళాకారిణిని కలుసుకొన్నాను. ఈమె అమ్మమ్మ గొప్ప నట్టువరాలని, నృత్య కేళికలు చేసే వారని ఆమె నాతో చెప్పింది. దేశకాల పరిస్థితులవల్ల ఈ ఇందిరాదేవి నృత్యకళను విడిచిపెట్టి, హరికథలను చేపట్టి జీవయాత్ర కొనసాగిస్తున్నది.

తర్వాత అనంతపురం జిల్లా పర్యటించాను. కోటకొండ కిష్టయ్యగారి శిష్యురాండ్రు ఎమ్మిగనూరులోని శ్రీమతి భీమక్క, అనంతపురంలోని శ్రీమతి శివమ్మ శ్రీకృష్ణ లీలలను ప్రత్యేకంగా ప్రదర్శించేవారట. వీరిద్దరూ అక్కచెల్లెళ్లు. శ్రీమతి అలివేలమ్మ అనే ఒక గొప్ప కళాకారిణి లేపాక్షికి చేరువలోని చిల్లమత్తూరులో ఉండేవారు. వీరు కర్నాటకం బాగా ఆడేవారట.

అరవై కుటుంబాల నృత్య కళాకారులు కోలారు జిల్లాలో ఉన్నారు. వీరికి కర్నాటక బాణీయేగాని పారిజాతం ఆట తెలియదు.

విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని తూర్పు భాగవతం ఒక విశిష్ట స్థానం గలది. ఈ జిల్లాలలో ఉన్నన్ని భాగవత మేళాలు దేశంలో మరెక్కడా లేవు. ఏభైకి పైబడే ఉన్నాయి. కలియుగ సత్యభామలుగా, పండిత సత్యభామలుగా, గానకోకిలలు, వసంత గానకోకిలలుగా బిరుదులు పొందిన వారు సింహతలాటాలు, ఘంటా కంకణాలను పొందినవారు ఈ మేళాలలో ఎందరో ఉన్నారు. ఈ ప్రాంతాలలో భామాకలాప ప్రదర్శనలు జరగని అమ్మవారి సంబరాలు, తిరునాళ్లు ఉండవు. ఈ తూర్పు భాగవత ఆటా, పాటా ప్రాచీన ప్రపద సంప్రదాయానికి చెందినవి. వీరి పద్ధతికి ఇతర ప్రాంతాల వారి పద్ధతులకు చాలా వ్యత్యాస ముంది. ఈ భామాకలాప కళాకారుడు ఎంత గొప్ప వాడైనా, ఎంతటి విద్వాంసుడైనా త్రివిధ లయల్లో, త్రివిధ స్థాయిల్లో పాడలేకపోతే ఈ ప్రాంత ప్రేక్షకులు హర్షించరు, గౌరవించరు.

వీరి మృదంగమే ఒక ప్రత్యేకత గలది. ఇక్కడి మృదంగ వాయింపుకు ఒక విశిష్టత ఉంది. ప్రపద సంప్రదాయంలో వీరి మృదంగాన్ని వాయిస్తారు. మృదంగ నాదం పూరింపు, త్రికాల విన్యాసాల జతి కట్టు బాట్లు వీరి వాయిద్యంలోని ప్రత్యేకతలు.

## సత్యభామ ఆహార్యం

ప్రతి చిన్న అలంకరణకు ఒక ప్రత్యేకత ఉంది. ప్రతి అలంకరణలోను జాతీయత ఉట్టిపడుతూ ఉంటుంది. భామ ముఖానికి అర్ధశం కోటా వేసికొనడం నుండి జడ, జడబిళ్లలు, జడ కుప్పెలు, సూర్యుడు, చంద్రుడు, అడ్డబాస, కంఠాభరణాలు, బాజబంధులు, చిరుగంటల వడ్డాణం, చీరకట్టు, నుదుటు బొట్టు, నొసట వెంకి రేకు అన్నీ ప్రాచీన ఆంధ్రుల అలంకరణ తీరులో ఉంటాయి. ఈ సర్వ అలంకారాలతో గూడిన ఈ తూర్పు భాగవత కేళిక నేటికీ ప్రాచీన పద్ధతిలోనే ప్రదర్శింపబడుతూంది.

పామరులను రంజింప జేయడమే గాక పండితుల ప్రశంసల నందుకొంటూ, విశేష ఆదరణతో ఈ తూర్పు భాగవతం నేటికీ నిల్చియుండడం గొప్ప విశేషం.

## అడవు సాము

ఈ తూర్పు భాగవతంలో లయ ఆట అతి ముఖ్యమైన అంశం. సమ, విషమ విన్యాసాలు గల లయ, ఊపుతో గూడిన అడవులు వీరి ప్రదర్శనలలో

ప్రాముఖ్యం వహిస్తాయి. గతి ప్రస్తారం ప్రముఖంగా గోచరిస్తుంది.

'సమ' అంటే రెండు అక్షరాల నడక. 2+2 = 4 అక్షరాల చతురశ్ర జాతి అడవులను పట్టి నడకలను ప్రదర్శిస్తారు.

'విషమ' అంటే మూడక్షరాల నడక. దీనిలో మండె అడవులు అంటే కూర్చొని చేసే భూచారీ విన్యాసాలు ఉంటాయి. ఈ ద్వివిధ గతుల ఆధారంగా ఈ క్రింది అయిదు జాతుల నడక విన్యాసాలను వీరు ప్రదర్శిస్తారు.

2+2—చతురశ్ర గతి
3—త్రిశ్ర గతి
2+3—ఖండ గతి
4+3—మిశ్ర గతి
4+2+3—సంకీర్ణ గతి

ఈ అయిదు జాతులను మించి కర్ణాటక బాణీలో గతి విన్యాసాలు లేవు. ఇతర విన్యాసాలన్నీ వీటి చేర్పులు, కూర్పులు, మార్పుల వల్ల ఏర్పడుతాయి.



## అడవులు (సమగతి చతురశ్రజాతి)

1. తాం తత్తై తిహిత । తా తెహి ఇదా
తి హియి దత్తాం ॥ తాత్తె తెహితతా
2. తాం దిగిదిగితా । తత్త హిత్తతై
తై దిగిదిగితా । తత్త హిత్తతై
3. తాం దిగిదిగి । తై దిగి దిగి
దిగిదిగి తా । దిగి దిగి తై
4. తైతా కిటతక తత్తై హిత్త తోం
తాతా కిటతక తత్తై హిత్త తోం
5. తైతా కిటతక । తళాంగ్ తోం
తై తా కిటతక తళాంగ్ తోం
6. తాతా కిటతక తద్దిం తకృతోం
తై తా కిటతక । తద్దిం తకృతోం,
7. తోం తోం తధా
తోం తోం తధీ
8. తాతా తెయిత । తాతాకియిట
తాంత తైత । తాంతకిట
9. తాతా తైత । తా తకిట ఝుఖు
తాంతా తైత । తాం తకిట ఝుఖు
10. తాంత తైత తాత । తకితక । ఝుఖుతరి
11. తాత తైత । తాత కిటతోం । కిటకిట తర
12. తాంత తైత । తాంత । కిటతక । తదికిట
దికితక । తదికిట
13. దితై హిత్తత్త । దితై హిత్తత । దితైహి త్తతా
దిత్తితై । దిత్తితై । దిత్తితైత

14. తైతైతైఽ । తత్త హిత్త తైఽ
తాందిగి దిగితై

15. తతైత । దిత్తితైత । తతైహిత। తతిహిత
తతైహిత । దిత్తితైత

16. తాతైత, . దిత్తితైత । తాతైత । దిత్తితైత

17. తై తై తక । తైతైతఽ తైతైతఽ

18. రాం దిగి దిగి । దిగిదిగితై
తత్తి దిగి దిగి । దిగిదిగితై

## (విషమగతి - తిశ్రజాతి)

19. తైయి హిదత్తా తై । యిదత్తా తై । యిదిత్తా ।
కిట తక దత్తా తై

20. తతైత । దిత్తితైత । తతైహిత । తతైహిత ।
తతైహిత । దిత్తితైత ।

21. ధీం తత్త ధింద । తత్త ధింద ।
ధీం తత్త ధింద । తత్త ధింద।

22. తెహిత్తి । తహిత్త । తేహిత్త । తై ।
ధీ । తత్తిదింత । తక దదిగిణతోం ।

23. తోధిమ్మి । తోధిమ్మి । రా । తద్దింతక్క
ఝెకిట కిటతక । కిట కిట తక

24, తాంత తదింద । తత దింత

25. కిటతకతా । కిటతకతై

26. తతై । హిత్త । తెహిత

27. తతె । హిత్త । తతైహిత । తతైహిత ।
తాంతాం.

## తీరికలు

1. దిత్త దదిగిణత । ॥3 సార్లు॥

2. తక దిత్తళాంగ్ తోం । దిత్తాళాంగ్ తోం ।
తళాంగ్తోం ॥

3. తళాంగ్ తోం । తక తళాంగ్ తోం ।
తత్తళాంగ్ తదిగిణతతోం ॥

4. ధదికిట తక । దిత్తళాంగ్ తకదధిగిణ తోం
॥3 సార్లు॥

5. తళాంగ్తోం । తక తదిగిణత । ॥3 సార్లు॥

6. తకా । దికీ । తక తదిగిణత । ॥3 సార్లు॥

7. తద్దణ । తఝణు । తదిమి । తకిక । తళాంగ్।
తకదిమి। తక తదిగిణత ॥3॥

8. దిత్తా । దమితా । దమితా । కిటతక
తక దికి ఝెణు తదిగిణత

9. దిత్తాం । దిమితఽ । కిట తక
తళాంగ్ తకదిమి । తక తదిగిణతోం।

దరువులకు ముందుగా వేసే కొన్ని జతుల తీరికలు.

తాంగుడు తోంగ దిక్కు తక్కు
కిణా ఝెకుడు ఝెకుడు కిటతక

1. ఝుంతారి కుంతారి కుకు
జగ కిణకు దిత్తా ది తై
తాం తాం ధర్గుడు తాం
తత్తోం కిట్ట కిటతక దిమి
కిటతక ధిమి—కిట ధీం
తక తదిగిణతోం । తకతదిగిణతోం
తక తదిగిణతోం.

2. ధిమిధిమి ధిన్నాకిటతక
ధిమిధిన్నా కిటతక । ధిమిధిన్నాకిటకిట ॥3॥
ధిమి ధిన్నాకిటతక దిత్తి
ధిమి ధిన్నాకిటతక దితై
ధిమి ధిన్నాకిటతక । ధిన్నాకిటతక

3. ధీంతకిట తక దిత్తళాంగ్ తక
రాం తకిటతక తహిత తహిత జణు
ధీం తకిట తక । ధీతాం తకిటతక
దిత్తళాంగ్ దత్తా
ఆతై య్యా
దిత్తళాంగ్ దిత్తా
దిదితై.

వరువుల్లో ఆడే శబ్దాలు లేక సలాం జతులు

కాంభోజి —— ఆట

తధీణాం-ధిణాం ధిణాం ధిణాం ధిణ
తధీణాం ధిణాం ధిణాం
తధణ ధణధణ—ఝుణుత కిటతక
ధరికిట తక । దిద్ధికిటతక
ధకిట తక- ధరికిట కిటతకతాం
తైత త్తాం

పాలనేర్రాని పాపపక్త్రము
చాలసమ్మిన స్వామి నీవని
తెలిసి మన్యులు దొరలు మంత్రులు
దివ్య సింహాసనము పైని
అరుదుగా పట్టాభిషేకము
గరిమతోడుత గట్టినపుడే
తత్తరిక యని భేరి వాద్యము
నృత్య తాళము మ్రోయగా
సత్యసంధుడు వౌదు వాదని
సకల జనులు నుతింపగా
దిక్కుదిక్కుల రాజరాజులు
మ్రొక్కి నీకు సలాము జేయగా
ధిమిత ధిమితక - [illegible] తతరిణ
అమృత కవిజను దౌదుజౌదని
సాటిలేకను వెలగెదౌరా
నాటి తుళజేంద్రుని సహోదర
నాటి నేటికి నిన్నె నమ్మితి
నటన కాశీనాథ వందిత
చెలువు తంజాపురిని వెలసిన
భళిర ! నీకు నృపేంద్ర వినయం ! (ఏకోజీ)
భోజరాజ సమానులే
శరభోజిరాజమహేంద్రులే
పరభోసలాంబుధి చంద్రులే
శభాసులే — సల్లాములే
తకుంద । నకుందరి । నకుంద । తకుందరి
తకుంద । కిటతకతాం దదిగిణతోం
తై దదిగిణతోం - తాంతదిగిణతోం.

ఇది కాశీనాథ కవి వ్రాసిన సలాంజతి, నాయక రాజుల తరువాత తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువుల కాలంలో ఈ సలాంజతుల రచన ప్రారంభమైంది.

ఈ జతులు రచన చేసినవారిలో ప్రముఖుడు కాశీనాథ కవి. ఈయన తంజావూరు ప్రభువుల ఆస్థాన కవి. ఈ సలాంజతి ఏకోజీ మహారాజు శరభోజి సింహాసన మెక్కినప్పుడు రచించబడినది. సలాం జతుల హిందూస్థానీ నర్తనంలోని నృత్తాంగాలు నర్తనాలను పోలి యుంటాయి. వరువు, ఆట నృత్తమెట్టడానికి వరువుల్లోను చరణాలను ఈ జతుల నాడడం ఆచారంగా ఏర్పడింది.

ఈ జతులందు ఆంగిక ప్రాధాన్యమున్న నృత్యం, నృత్తం ప్రదర్శితమౌతుంది. నేను మొదట గురువుల వద్ద అభ్యసించిన 200 సలాంజతులు నా వద్ద ఉన్నాయి.



దరువుల నాడేటప్పుడు సాహిత్యానికి వేసే అడుగుల పద్ధతి :

ఉదా :—

దరువు —

నీవు రావయ్య మదన । మోహన ।
రంగ రావయ్య మదన । మోహన ।

1. తకతోం । తకతోం । తకతోం । తకతోం ।
2. తకతక । తకతక । తకతక । తకతక
3. తోంతోంత । కిటతక । తతోంతోంత। కిటతక
తక, తక, ॥3 సార్లు॥
4. తోంతోంత । కిటతక । తతోంతోంత । కిటతక
దిత్తళాంగ్ దిత్త ॥3 సార్లు॥

దిత్తళాంగ్ దిత్త । దిత్తళాంగ్ దిత్త ।
దిత్తళాంగ్ ॥3 సార్లు॥

నీవు రావయ్య మదనమోహన

దరువు —

మదనమోహన కారుడే । ఓయమ్మా ।
మందర గిరి ధారుడే ॥

1. తకతై । తకతై। తకతై తకతక । తకతక ।
తకతక । తకతక ।
2. కిటతక ఝం । కిటతక ఝం । కిటతక ఝం ।
కిటకఝం । కిటకఝం । కిటకఝం

తతైదిత । దితైతైత । తైతైత । దితైతైత ।
దిత్తితై । దిత్తితై । దిత్తితై । దిత్తితై ।
ధాం ధాంత । కిటతక తైదైతై తత ।

దరువులకు చరణాలకు మధ్యలో వేసే జతులు లేక తీరికలు.

ఉదా :—

మోహన—చాపు తాళము

తప్పేమని మీ రడుగరమ్మా
నా స్వామిని మీ రడుగరమ్మా
తప్పేమి లేదమ్మా వనజాక్షిరో నా వల్ల
చెప్పరే కృష్ణుని చేతులు పట్టుక
తప్పేమని మీ రడుగరమ్మా
నా స్వామిని మీ రడుగరమ్మా
ధాం ధాంకిట కిటతక
తతైతైత తతైతైతతై
ఝం ఝం కిట కిటతక
తతైతైత తతైతైతతై .
ధాం ధాకిట కిటతక
ఝం ఝంకిట కిటతక
తతైతైత , తతైతైత తైత
తతైతైత తతైతైతతై
తైయ్ : తైయ్ . తైదిత్తిత్తై
తైయ్ తైయ్ తైదిత్తిత్తై
తైయ్ ; తైయ్ . తైదిత్తిత్తై
తప్పేమీ లేదమ్మా వనజాక్షిరో నావల్ల
చెప్పరే కృష్ణుని చేతులు పట్టుక ॥

దరువులో త్రికాలం

ఆహిరి రాగం—ఆది తాళం

జననీ వందనము , అఖిల బ్రహ్మాండ వర్ణిత
కుందారదన మునివందిత పాదయుగ ॥
కోమలీ ! చంపక దామాభూషిత నీకు
పూర్ణేందు వదన శోభిత నీకు ॥

ఈ దరువును త్రికాలంలో పాడేటప్పుడు మృదంగం వరుస కొన్ని తెలిపి.

తతిం ధాకిట తక తరి తకిత, తైతైతత అని మూడవకాలంలో తీరిక ఉంటుంది.

మార్దంగికుడు ప్రథమ కాలపు జతిలో—

తద్దిణ తక తిం - ధిణ తకతిం-తద్దిణ తకతిం -
కిట తా తిమ్ - కిటతక తకతక - నగధిణ
కిటతక -

తద్దణ తకతిమ్—

ఈ మృదంగ జతిని మార్దంగికుడు - పాటను
హాస్యము పాడుచుండగా పలికించును.

ద్వితీయ కాలము—

వధింవ దింప తదింవ తింద
తదింద తింవ

తృతీయ కాలము—

తాకిట తకతక కిటతలాంగ్ -
తాకిట తకతక కిటతలాంగ్ -
తాకిట తకతక కిటతలాంగ్ -
తాకిట తక తక తకకతతా త్తై త్తై త్తైతత.

హాస్యపాత్ర—దరువు

త్రిశగతి—సావేరి
గోవింద గోవిందా-భజగోవింద గోవింద ॥
గూడకట్టు నేను కట్టితి-మకర కుండలాలు
చెవులు బెట్టితి-
తిరుసమనగ శుద్ధ త్రిహర్ణ మేపనువు
తిరుమంత్రమేమాట తీర్థం చెయుదకంచు ॥
ఎద్దునెక్కిన వాడు లింగడూ-బొల్లిగద్ద
నెక్కిన వాడు వంగడూ
వారిద్దరికీ భేదాలు యించు కంతయు లేవు-

హాస్యం (మాధవి, మాధవ) పాత్ర ప్రవేశంలో పాడే దరువు.

పప్పు ధరతము

సత్యభామ చెప్పిన ప్రతి పద్యాన్ని హాస్యము చెప్పే హాస్యపదం; దరువుకు ప్రతిదరువు మాన్నుకు-

భామ—

వినవమ్మ యేమి జెప్పుదు
ఘనతగు శ్రీవిష్ణుమాయగాసక యేనున్
పని బూనివెతుకవచ్చితి
అనువొందగ సత్యభామ యంచురెనన్నున్.

హాస్యం (మాధవి)

వినవమ్మ యేమిజెప్పుదు
ఘనముగ పరి బువ్వ పప్పు గారెలు బూరెల్
పనిబూని మ్రింగ వచ్చితి
అనువందగ బుద్ధిమంతుడందురు నన్నున్॥

దరువు—సత్యభామ—

భామనే-వయ్యారి సత్యభామనే
భామనే పదహారువేల కోమలూ లందరిలోన
రామరో గోపాలమూర్తికి
ప్రేమదాననగు సత్య॥

హాస్యం (మాధవి)

బొట్లనే నేనే వీరం బొట్లనే
బొట్లనే పదహారు పుంజీ లట్లు బూరెలు
గారెలరిసెలు
పొట్లకాయా యిగురు పట్టెడు
పొట్టా నిండా తిన్న యట్టి ॥

మదనుని రాక-పంచచామరం (హాస్యం)

గభేల్ గభేల్ గభేల్ నంచు
గద్దరించు చుండగా
తపాల్ తపాల్ తపాల్ నంచు
తావులాడుచుండగా
గుభేల్ గుభేల్ గుభేల్ నంచు
గుద్దులాడుచుండగా
అటో యిటో యెటో గదమ్మ
ఆహహ ఏమి జేతునే

సత్యభామ—

గీ॥ తరుణి జన్మంబు నెంచగా తారమయ్యో
పురుష ననగను చంద్రుని బోల్చవచ్చు
నిరత మొక చోట తారలు నిలబియుండె
నిరత మొకరింట విందుగా నరుగు శశియు

హాస్య - (మాధవి)

గీ॥ గారె! నీ నట్టనడుమను కన్నమేమి
అడుగు మాడిన కరకర లాడుటేమి ?
కోరి భుజియించ యరగవు కుటిలమేమి ?
ఎంత వెఱ్ఱివి నీవొక్కో వింతదారి పప్పు !

అభినయ దరువు

ఆనందభైరవి - ఆది

ఎవ్వరే ఎదుట వచ్చే వా రెవ్వరే
నాయెదుట వచ్చే వా రెవ్వరే?
యౌవ్వనామైనా రూపము వా రెవ్వరే?! ఈ
పవనముపై వెలయు వా రెవ్వరే-
యిపుడు
కవ్వడీ చెలికానినీ బిలువరే
ఓ భామలార ! ॥ఎ॥

భావ విన్యాస నృత్త దరువు

మోహన - త్రిపుట

"పాదపద్మములు తడబడసాగె నోయమ్మా"

ఆవేగము, అగ్న్యావేగం, ప్రియ సందర్శనా వేగం వర్షావేగం, యిత్యాదులుగా ఉంది.

ఈ ఆవేగాన్ని నృత్యంలో ప్రదర్శించేటప్పుడు కాల పై కాలములందు నృత్త (అనగా అడవులు, అడుగులు) ప్రదర్శనంలో నిరూపించబడు తుంది.

అలిగి వెడలిన తన స్వామి వారిని వెదుకుచు వానిని కలియుటకు అభిసారికయై సత్యభామ వెడలి నప్పుడు పాడే దరువు ఇది. నడువలేక ఆమె పాదములు తడబడుచున్నవి. కాని మనస్సు ప్రియుని సందర్శనము కొరకు తహతహ లాడు తున్నది. తొందరపడుతున్నది. కలవరపడుచున్నది. ఆలస్యమును సహించలేక పోతున్నది. పలువిధముల పరుగులిడు తున్నది. ఉత్సాహ పడుతున్నది. అయి ననూ మనస్సంత వేగంగా — శరీరము పరుగులెత్త లేక తన నిస్సహాయ స్థితిని తెల్పుతున్నది. ఈ సంఘర్షణ ఈ దరువులో నిరూపించ బడుతుంది.

ఇందు త్రికాలములో జతులకూర్పు ప్రదర్శిస్తూ తీరికలిస్తూ, సాహిత్యానికి భావ ప్రకటన చేయడం ద్వారా దీనిలోని ముఖ్యోద్దేశము వ్యక్త పరచబడు తుంది.

అదెలా అంటే—

పల్లవికి, త్రిపుట తాళములో పరుస

(త్రిపుట 3 + 4 అక్షరములు)

తద్దిం తక్క తక్క : తద్దిం తక్క : తద్దిం
తక్క

ఈ పరుస మృదంగముపైని పలుకుతుండగ పాత్ర ప్రవేశిస్తుంది.

అటుపైని

పాదపద్మములు . తడబడసాగెనోయమ్మ ॥

అని పాడుతూ,

పై కాలము పరుసలకు

1. తాం తద్ది తక్క తద్దింతక్క
తద్దింతక్క తద్దింతక్క తద్దింతక్క తద్దిం
తక్క

2. కిటతక తరికిటతోం కిటతక తరికిటతోం
కిటతక తరికిటతోం కిటతక తరికిటతోం.
కిట తక తరికిటతోం

నర్తనం చేసి, జాగాకు వచ్చి, పాదములందు తొట్రుపాటు అలసట ప్రదర్శించును. అలసట తీర్చు కొని మళ్ళా తన ప్రయాణం సాగిస్తున్నట్లు పై కాలపు పరుసలకు కేళిక చేస్తుంది. ఈ విధమైన నృత్త నృత్యములవల్ల ఆ దరువు నందలి భావానికి నృత్యమే గాక, నృత్తం ద్వారా కూడా ఆవేగాన్ని ప్రదర్శిస్తుంది. దీనిలో చిత్రగతి విన్యాసముల జతుల కూర్పును ఆడటంచేత నృత్తము చూడ ముచ్చటగా ఉంటుంది.

ప్రారంభమున—

సాధారణంగా అన్ని సంప్రదాయాలలోను పాడే దరువులు

పథి మదన నీవు రావయ్య మదన దధి మదన
మదన మదన మదనా యనుచును
వదల లేక నీ వలలో జిక్కితి
రంగుగా నా మెడ మంగళ సూత్రము
పొంగుచు గట్టిన సంగతి మరువకు
॥రావయ్య॥

అట ప్రాయమున తేటవికన్నుల
కాటక దిద్దిన కొటమి మరువక
॥రావయ్య॥

అదుగో చంద్రుడు ఉదయం బాయెను
నిదురలేక వానికై నే ఎదురుజూచితి
నమ్మా కొమ్మా ! ॥రావయ్య॥

నరసింగబిల్లి వారివి—

సరి సరిలే చుట్టాలము గామా । మాతో
సరిపోలెదవు చందమామా ॥
ఎటులనైతురా నా సామి .
ఎట్లానైతురా......
పెదవిమీద పంటికాటు
వదరుదాని చంటిపోటు
కదసి వెన్నున కీల్జడవేటు
కండ్లు జూచితే నాసామి
కండ్లా జూచితే—

దోమ తెరవెనుక ఆడే దరువు—

రామచిలుక నాతో చాలా పోరెనే
ఓ యమ్మలారా !

తూర్పు ద్రుపద బాణీలో విశేష ప్రచారముగాంచిన కొన్ని దరువులు

మిశ్రగతి

రామచిలుక నాతో చాల పోరెనే తల్లీ...
కోయిలలు కోకోయని కేరెనే-తల్లి...
ఆ వలరాజు నన్నెంతో జేసెనే తల్లి
తుమ్మెదలు ఝుం ఝుం మని మ్రోచెనే తల్లి

త్రిశ్రగతి

నీమీద భారము నిలిపితి నాప్రేమ
తాళజాలనమ్మాధవునీ తోడితేవే

చతురశ్ర రూపకం

కాంతుని మనసెంతో నొచ్చెనో కాననైతిని
అందము గలదాననని యెందుకంటిని
సదయుని మాటలకెన్నడు యెదురుగాదటె
తన వదన మెంతో చిన్న బోయె వన రుహాక్షిరో

నేతాళ నేతాళ నేతాళలేనే .........

ఆదితాళం

ఓ భామ రమ్మన డాయెనే - నన్నురమ్మన డాయెనే

మిశ్రగతి

వాడుచెక్కినొక్కి ముద్దుబెట్టునే
వాడు నెవ్వాలమున మెడవేసునే
పునుగు జవ్వాది గంధంబు బూసునే
చంద్రహారములు మెడనిండ వేసునే

త్రిశ్రగతి

బాలప్రాయము నాడు బంతులాడిన వేళ
బంతులాడిన—వేళ బంతులాడిన వేళ......

మిశ్రగతి

ఇంచరిలోన శ్రీహరియేడమ్మ ఓ చెలులార
హరియేడమ్మనన్ను మరుబాధ కొప్పించి—
కఠిన చిత్తుడు నాపై
కరుణించ కున్నట్టి...హో......
చీరలు రవికలు కూరిమిగొని - సింహద్వారము దరికి శ్రీ
హరివచ్చే నంటివి...హరి...

దరువు—ఆదితాళము

1. అల్లల్లవాడు అదేమో...
2. గొల్లవారి వా రిళ్ల కేగెను మెల్లని పాలును
మృచ్చిలి కంసుని ద్రుంచ బోయెనె
3. కరుణతోడ ప్రహ్లాదుని గాచిన
కనక కస్యపుని గోళ్లన బొడ్డు చించ
బోయెనె
సూటిగాను సుగ్రీవుని గాంచి చాటు నుండి
బలశాలిని వాలిని ద్రుంచ బోయెనె

మిశ్రగతి

యేల బిలచేనే నన్నేల బిలచేనే రానుపోవె-
రాను పోవె నే రానుపోవె...
నిన్న మొన్నటి కథ లెన్నో కాని-సిగ్గాయెనె
వన్నెకాని మాటలకు వలచి నేను రానూ
పోవె ...యో...
గగన భాగమున – చెంగల్వలు మొలచునె
మగవారి మాటనమ్మగ – రాదే ఓ చెలి
యో...

మిశ్రగతి

తగునే మాధవి నీకు ధర్మమటవే - పలు
మారు పిలచిన పలుక వేమె

## భాగవత కళ :

మనదేశ చరిత్రను, పురాణేతిహాసాలను, సంఘ వ్యవస్థను నృత్య సంగీతాల ద్వారా సామాన్య ప్రజలకు సులభంగా తెలియజేయడానికి మన పూర్వులు రూపొందించిన విశిష్ట కళా రూపాలు తోలు బొమ్మలాటలు, యక్షగానాలు, వీధినాటకాలు, భాగవతాలు.

తోలు బొమ్మలాటకి యక్షగానానికి చాలా సన్నిహిత సంబంధ ముంది. వీటిలో ప్రయోగింపబడే ఛందోరీతులు, సంగీతబాణీలు, ఆట తీరులు, తాళాల నడకలు, దరువు పోకడలు ఇంచుమించు ఒకే విధంగా ఉంటాయి.

తోలుబొమ్మలాటలో సూత్రధారుడు గానంచేస్తూ, బొమ్మల నాడిస్తాడు. అదే తీరున యక్షగానంలో నర్తకుడు పాడుతూ ఆటను ప్రదర్శిస్తాడు. సభలో నర్తకుడు స్వయంగా ఆడతాడు గనుక అతని హావభావ ప్రకటనలను ప్రేక్షకులు అతని ముఖంలో చూడ గలుగుతారు. తోలు బొమ్మలాటలోని ఆ యా పాత్రల స్వభావాల కనుగుణంగా ఆ యా బొమ్మల ముఖ భావాలు రచింపబడతాయి గనుక ప్రధాన భావాలే ఆ బొమ్మల ముఖాలలో మనకు గోచరిస్తాయి. ఇతర సంచార భావాలను తెరమరుగున నున్న సూత్రధారుడు తన గాత్రంలో ప్రదర్శించి ఆ లోటును తీర్చవలసి ఉంటుంది.

ఈ రెండు ప్రపదర్శనలలోను కథ నడిచే తీరు, పాటల రచన, సంధి వచనాలు మొదలైన వన్నీ ఒకే విధంగా ఉంటాయి.

## యక్షగానం, వీధినాటకం, వీధిభాగవతం

ఈ మూడింటిలోనూ రచనలు ఒకే విధంగా ఉంటాయి. అందువల్ల ఈ మూడూ ఒక్కటే నని చాలా మంది, పండితులు, విమర్శకులు గూడ భ్రమ పడుతూ ఉంటారు. ఇది పొరపాటు. ఆ యా సాంప్రదాయక ఆట పాటలతో వీరికి తగినంత పరిచయం లేనందువల్ల ఈ పొరపాటుకు లోనవడం సహజం.

ఈ మూడు కళా రూపాలు సామాన్య ప్రజల కోసం ఉద్దేశింపబడినందు వల్ల వీటిలోని భాష, కవిత్వం వారికి సులువుగా అర్థమయ్యేటట్టుగా ఉంటాయి. అందువల్ల కవితా రీతి, రాగాల తీరులు ఒకటిగానే కనిపించడం సహజమే కాని వాటి ప్రయోగాలలో వైవిధ్య ముంది.

గురు ముఖంగా ఈ విద్యలను నేర్చుకొని, తత్ సంబంధిత శాస్త్రాలను అభ్యసించిన వారికే ఈ సంప్రదాయాలను సమన్వయ పరచడానికి వీలవుతుంది. అప్పుడే ఈ కళల మధ్య గల వ్యత్యాసాలను

గుర్తించగలుగుతారు. ఈ ప్రక్రియలలో వేసే అడుగులలోను, పట్టే హస్తాలలోను, దరువు నడకలలోను, పాత్రల ప్రవేశ నిష్క్రమణలలోను చాలా తేడా ఉన్నాయి. ప్రదర్శన ప్రయోగాలలో తప్ప వీటిని గురించి చదివినంత మాత్రాన మనం తెలుసుకో లేము.

ఒక ప్రాచీన యక్షగానాన్ని మనం విమర్శనాత్మకంగా పరిశీలించి చూస్తే ఈ క్రింది విషయాలు మనకు గోచరిస్తాయి.

ద్విపద మొదలైన ఛందోరీతుల్లో రచింపబడిన ఒక కథను పాడుతూ వినిపించడమే యక్షగానం. పూర్వం యక్షు లనేవారు ఈ విధంగా గానం చేసేవారుట.

ఒకే వ్యక్తి ఈ కథాగానాన్ని చేయడానికి వీలుంది. కథలో వచ్చే వివిధ పాత్రల్ని, వాటి సంభాషణల్ని గానం చేసే పద్ధతిలో యక్షగానం రచింపబడి ఉంటుంది. ఈ పద్ధతిని అనుసరించే జక్కుల పురంధ్రి తన తంబుర శ్రుతిలో కథాగానం చేసేది. ఆ కథలోని బహు పాత్రల్ని రస హావభావ ప్రకటనలతో పోషిస్తూ పాత్రధారి నర్తన మాడే పద్ధతి ఇది. స్త్రీ పురుష పాత్రల్ని ఒకే వ్యక్తి పోషిస్తే ఒక్కొక్కప్పుడు రక్తికట్టక పోవచ్చును. అందువల్ల యక్షిణీ యక్షులు ఇద్దరూ కలిసి పాడుతూ, ఆడుతూ కథను నడిపించే విధం ఏర్పడింది. ఆ తర్వాత కథను ఇంకా రక్తివంతంగా ప్రదర్శించడానికి గాను కథకు అనుగుణంగా దీనిలో వేర్వేరు పాత్రలను ప్రవేశపెట్టడం జరుగుతూ వచ్చింది.

మొదట్లో ఏక పాత్ర, తర్వాత ద్విపాత్రధారులు కేళికలు చేస్తూండినప్పుడు వారి వేషధారణ అంటే పాత్రోచితమైన వేషధారణ గాక సామాన్య అలంకరణతో ఉండేది. బహు పాత్రధారులు వచ్చిన తర్వాత పాత్రోచితమైన వేషధారణకు అవసరం ఏర్పడింది. రాజు మొదలైన ఉన్నత పాత్రలకు ధరించవలసిన ఆభరణాలు, స్త్రీ పాత్రల అలంకారానికి అవసరమైన ఆభరణాలు, వస్త్రధారణ, ముఖానికి రంగులు మొదలైన ఆహార్యాది విశేషాలు సృష్టింపబడ్డాయి.

ఇవన్నీ సృష్టింపబడక ముందు పాత్రధారులు ఏ ఆహార్యంలో ఉండినా వివిధపాత్రలకు ఊహామాత్రంగా ప్రేక్షకులు రూపకల్పన చేసుకొనేవారు. వివిధ పాత్రధారులు విశిష్ట వేషధారణతో వివిధ పాత్రలుగా ప్రేక్షకుల ముందు కన్పించి, ఆట పాటలను ప్రదర్శించి మరింత బాగా రక్తికట్టించడంతో ఏక పాత్ర, ద్విపాత్ర ప్రదర్శనలకు ఆదరం తగ్గిపోయి కాలక్రమేణా అవి అంతరించిపోయాయి. కాని సంస్కృత నాటకాలలోని నటి, సూత్రధారుల్లాగ ఈ దేశి నృత్య రీతులలో సింగి, సింగడు మిగిలిపోయారు.

యక్షగాన, వీధి నాటకాలలో ఈ సింగీ సింగడూ ముందుగా రంగస్థలంపైని ప్రవేశించి కేళికచేసిన పిదపనే అసలు కథ ప్రారంభింపబడడం ఒక ఆచారంగా రూపొందింది. కొన్ని ప్రాంతాలలో వీరికి బదులు రంభా మేనక, లేక రంభా ఊర్వశి ముందుగా రంగస్థల ప్రవేశం చేయడం ఒక ఆచారంగా పరిణమించింది.

కర్నాటక ప్రాంతంలో యక్షగాన మనే ఒక కథా కేళిక ఉంది. దీనిలో దైవ ప్రార్థనానంతరం రెండు హాస్య పాత్రలు రంగస్థలం మీద ప్రవేశించి నాట్యం చేస్తాయి. తర్వాత బాలగోపాలుర నర్తనం జరుగుతుంది. ఆ తర్వాత రెండు స్త్రీ పాత్రలు లాస్య నర్తనం చేసిన అనంతరం ఒడ్డోళగంతో అసలు కథ ప్రారంభమవుతుంది. దీనిలోని స్త్రీపాత్రల నర్తనం మన యక్షగానాలలోని రంభా ఊర్వసుల నర్తనాన్ని పోలి యుంటుంది. దీనిని బట్టి, కర్నాటక యక్షగానాలలోని పాత్రలు, పాటలు పాడుతూ కేళిక చేసే యాచారం వారికి లేదని మనకు అర్థమవుతుంది. భాగవతారు పాడే పాటకు అనుగుణంగా భావయుక్తంగా కేళిక చేయడం వారి ఆచారమని విదితమౌతుంది. మన ఆంధ్ర దేశ ఆచారం ప్రకారం ప్రతి పాత్ర పాడుతూ

ఆడాలి. నే డింకా మన యక్షగానాలలో మిగిలియున్న సింగినీ సింగడు పాత్రలను ప్రాచీనయక్షిణీ యక్షుల తోను, ఏక పాత్ర జక్కుల పురంధ్రితోను, వివిధ కథలలో వచ్చే ఎరుకతతోను పోల్చవచ్చును. వీరి ఆట పాటల విధానమంతా ప్రాచీన పద్ధతిని సులభ శైలిలో ఉంటుంది.

ఏక పాత్ర, ద్విపాత్రలుగా నుండిన ఈ కథా గానం బహు పాత్రలు గలదిగా పరిణితి చెందినందు వల్ల ఆ యా పాత్రలకు తగినవేషధారణ, ఆహార్యం, ఆట, పాట, పలుకు, గమనం, అభినయం మొదలైన వన్నీ సమకూరడానికి అవకాశం ఏర్పడింది. ఈ విధంగా ప్రదర్శన పద్ధతి అంతా మారుతూ వచ్చి ఒక సక్రమ రూపం దాల్చింది. రచనా విధానంలో కొన్ని మార్పులు రావడమే కాక గాన పద్ధతిలోనే మార్పులు వచ్చాయి. వచన సంభాషణలకు ప్రాముఖ్యం పెరుగుతూ వచ్చింది. వర్ణనాత్మకమైన రచనా విధానా నికి బదులు నాటక శైలి పెంపొందింది. యక్షగానం గాన ప్రాధాన్యం గలదిగా ఉండేది. ఈ నూతన ప్రక్రియలో గద్య, పద్య సంభాషణలకు ప్రాముఖ్యం వచ్చి ఒక ప్రత్యేక పద్ధతి ఏర్పడి వీధినాటకంగా పరిణితి చెంది ప్రచారంలోకి వచ్చింది.

వీధి నాటకాలలో వివిధ పాత్ర లుంటాయి. ఆ యా పాత్రల పోషణకు తగినట్టుగా తగు మాత్రం గద్య పద్యాలు ఉంటాయి. కొంత ఆంగికం, సాత్వికం, హస్తాభినయం, ముద్రాభినయం ఈ పాత్రలు ప్రదర్శి స్తాయి. రస పోషణకు సరిపోయేటట్టు సంగీతం భావ యుక్తంగా ఉంటుంది. ఒకప్పుడు జానపద కళగా నుండిన యక్షగానం వీధినాటకంగా మారి కొన్ని శాస్త్రీయ పద్ధతులను ఆభరణాలుగా అలంకరించుకొని శోభించింది. ఆట పాటలలోను, అభినయ విన్యాసాల లోను శాస్త్రీయత చోటు చేసికొంది. ఈ కళ ప్రబంధ పద్ధతిలో ప్రధానంగా రూపొందుతూ వచ్చింది. నాయికా భేదాలతో గూడిన రచనలు, ఋతువర్ణనలు మొదలైనవి దీనిలో చేర్చబడ్డాయి. అందరికీ సులువుగా అర్థమయ్యే సంభాషణలు గాక క్లిష్టమైన ఉక్తులు, గానఖండికలు, వాద్య విధానాలు దీనిలో ప్రవేశించాయి.

ఈ కళా స్వరూపానికి మూలం యక్షగానమే అయినా వివిధ శాస్త్రీయ అలంకారాలను సంతరించు కొని ఇది చాలా మారిపోయింది. దీనిలో పాల్గొనే కళాకారులకు కొంత పాండిత్యం కావలసి వచ్చింది. ఇలా పరిణితి చెందిన కళారీతే భాగవత కళ.

భాగవత కళలోని రచనలు, రాగతాళాలు అతి ప్రాచీనమైన యక్షగానాలలో ఉన్నట్టు కనిపిస్తాయి గాని ఆట పాటల విధానాలలో ఇది యక్షగానానికి భిన్నమైంది.

యక్షగానంలో ఒక సన్నివేశాన్ని తెలియజేయడా నికి మాత్రం ఉపయోగపడే ఒక సంగీత రచన దరువు ఆట. కాని, భాగవతంలో నర్తకునికి గాత్ర మందుగల సామర్థ్యాన్ని నిరూపించుకొనడానికి ప్రధా గానం ఉపకరిస్తుంది, అతనికి అభినయ కళలో గల పాండిత్యాన్ని, నృత్యంలో గల శక్తిని వ్యక్తం చేయడానికి అది ఉపయోగపడుతుంది.

అంటే, భాగవత నర్తకుడు ఇన్నింట్లో కృషి చేయడమేకాక పాండిత్యాన్ని సంపాదించుకోవలసి వస్తుంది. కనుక "దరువు"తో కథాగాన రచన ఒకటే గాక ఒక విశిష్ట సంగీత రచన గూడా ఉందని మనకు తెలుస్తుంది. సంగీత మంటే గీత, వాద్య, నృత్యా లతో గూడిన ఒక కళా రూపం.

యక్షగానం, భాగవతం రచనలో ఒకటే అయినా ప్రయోగంలో భిన్నమైనవి. భాగవతంలో దరువు పాట, ఆట, అభినయం సంపూర్ణంగా వృద్ధిచెందాయి.

సాధారణంగా ఒక దరువు విలంబిత కాలంలో ఒకానొక ప్రత్యేక తాళంలో ప్రారంభమౌతుంది. వివిధ సంగతులతో గూడిన ఆ పాటకు ఉచితరీతిని అభినయం చేయబడుతుంది. తర్వాత మధ్యమకాలంలో మిశ్రగతికి దరువు మారినప్పుడు నృత్యం చేయబడు

తుంది. ఆ తర్వాత ద్రుతలయలో చతురశ్రగతిని చేసే నృత్తంతో దరువు ముగియడం ఆచారం.

కర్నాటక ప్రాంతంలో విలంబితలయవరకు దరువు గానం, అభినయం నిలిచి ఉంటాయి. ఆ తర్వాత గతి మార్పుతో నృత్త, నృత్యాలు ఎక్కువగా ప్రదర్శింప బడడంలేదు. తాళధారి తన తాళంలోను, మార్దంగి కుడు తన మృదంగ వాయిద్యంతోను మాత్రం ఆ గతి భేదాలను చూపించి ముగిస్తున్నారు. ఆ ప్రాంతం లోని పారిజాతం ఆటలోని సంగీతం ఉత్తర హిందూ స్థాన సంగీత బాణీతో ఎక్కువ సంబంధం కలిగి యున్నట్టు కన్పడుతుంది. అక్కడి యక్షగానంలో ఆడే నర్తకుడు పాడడు గాని పారిజాతంలో నర్తకుడు పాడతాడు. అంటే తెలుగువారి సంప్రదాయ ప్రభావం దీని పైని ఉన్న దని మనం చెప్పవచ్చును.

తూర్పునున్న ద్రుపద బాణీలో పాటకు, మృదంగ వాయిద్యానికి ప్రాముఖ్యం ఎక్కువ, సంపూర్ణ నాద వికాసంతో తాండవరీతిని మృదంగ వాయిద్యం ఉండడం ఇక్కడి విశేషం. సంగీత రత్నాకరాన్ని రచించిద సారంగ దేవుని కాలానికి పూర్వం భారత దేశ మంతటా ఒకే విధంగా ఉండిన సంగీత రీతి ఆయన కాలం నాటికి ఉత్తరాది, దక్షిణాది బాణీలుగా విడిపోయింది. వీటిలో ఉత్తరాది ద్రుపదబాణీ ప్రాము ఖ్యం వహించింది. దీనినే తాన్‌సేన్, బైజు మొదలైన ఉత్తరాది గాయకులు ప్రచారంలోకి తెచ్చారు. దీనికి అనువైన 'ఫకవాజ్' (మృదంగం) వాద్యంగూడా వృద్ధి పొందింది. అక్బర్ మొదలైన చక్రవర్తులు ఈ సంప్రదాయాన్ని పోషించారు. అందుకే నేటికీ అదొక ప్రత్యేక కళగా నిలిచి యుంది.

తమిళ దేశంలో "కురవంజి" అనే ప్రత్యేక నృత్య రూపకాలు ఉన్నాయి. కురవలు ఆటవిక జాతి వారు. ఆ జాతి స్త్రీలు సోదె చెప్పడంలో పేరుపొందిన వారు. ఆంధ్రలో గూడ కోయజాతికి చెందిన గిరిజన వనితలు పట్నాలకు వచ్చి సోదె చెపుతూ ఉంటారు. ఆంధ్రలో సోదె చెప్పడం వృత్తిగా గల ప్రత్యేక ఆటవిక తెగవా రున్నారు. వీరినే ఎరుకల వారు అంటారు. ఎరుకలసాని సోదె బుట్ట చంకను బెట్టుకొని ఆడుతూ పాడుతూ వస్తుంది. తాను నివసించే అరణ్యా ప్రాంతంలోని కొండకోనల్ని, నదీనదాల్ని, చెట్లు చేమల్ని, వన్య మగృగాల్ని, పక్షుల్ని, ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ ప్రవేశిస్తుంది. కథా నాయిక చెలికత్తెలు ఆమెను అహ్వానించి వారి నాయికకు సోదె చెప్పమంటారు. అమె సోదె చెబుతుంది. ఈ సోదె చెప్పడం ఒక ప్రత్యేక రీతిలో ఉంటుంది. నిత్య జీవితంలో ఎరుకల వారు సోదె చెప్పే తీరులో రాగ యుక్తంగా వాచికం, ఆంగికం ప్రదర్శింపబడతాయి.

తమిళ దేశంలోని ఒక గిరిజన తెగవారు కురవలు. కురవన్ ఏక వచనం, కురవంజి బహువచనం. వీరి నృత్య రూపకాల్ని మన వారు కురవంజు లంటారు. మన ఆంధ్రదేశంలోని తెలంగాణా ప్రాంతంలో "కురుమ" అనే ఒక ప్రత్యేక తెగవారున్నారు. వీరుగూడా ఒక విధమైన జానపద నృత్య కళను ఆరాధిస్తూంటారు. నృత్య గానాలతో మల్లన్న దేవుని కథల్ని వీరు మన పల్లె ప్రాంతాలలో ప్రదర్శిస్తూ ఉంటారు. వీరి నృత్యం గూడా కురవంజి న్యాటం వంటిదే.

దక్షిణ దేశంలో ఈ తాండవబాణీ పూర్తిగా మరుగున పడినట్టుగానే చెప్పవచ్చును. గాత్ర సంగీ తంలో ఈ బాణీలోని పాటగాని, మృందంగ వాయి ద్యం గాని ఎక్కడా అసలు వినిపించడం లేదు. నృత్య సంగీతాలలో తాండవ రీతికి చెందిన మలబారు దేశ కథా కళిలోను, కన్నడ దేశ యక్షగానంలోను నామ మాత్రంగా కనబడుతున్నది. అక్కడి మద్దెల వాయిద్యంలో ఆ బాణీ కొంత వరకు పోషింపబడు తూంది. ఆంధ్ర దేశంలోని కూచిపూడి బాణీ పాటలో గాని, వాయిద్యంలో గాని ఈ రీతి పూర్తిగా వికసించి నట్టు కనబడదు. స్త్రీల లాస్య నర్తనానికి ఈ శైలి చాలా దూరమైనది. అయితే తూర్పు బాణీలో మాత్రం

ఈ ప్రాచీన బాణీ పాట, వాయిద్యం నేటికీ సంపూర్ణంగా శోభిస్తున్నది. ప్రాచీన తాండవ శబ్దాల కట్టు బాట్లతో వాయిద్యాన్ని పూరించడం, త్రిస్థాయిలలో పాడడం కనబడుతున్నది. ఈ బాణీ తూర్పు భాగవతంలో నేటికీ సజీవంగా ఉంది. కాని ఒక లోపముంది. ఈ ప్రాంతంలో పాటకు గల ప్రాధాన్యం ఆటకు లేదు. మార్దంగికుడు వివిధ శబ్దాల నెన్నింటినో వాయిస్తున్నా ఆ వాయిద్యానికి తగిన ఆట మాత్రం కన్పించడం లేదు. పూర్వం చిత్తజల్లు నరసింహులు, కాలుగంటి వేంకటస్వామి మొదలైనవారు ఆడియుండవచ్చును. ప్రస్తుత ప్రసిద్ధ నర్తకులందరూ తాళలయ గతుల ననుసరించి అడుగులు వేస్తున్నారే కాని జతులకు అడవులు పట్టడం లేదు. నర్తకుడు పాడుతున్నప్పుడు ఆ లయను అనుసరించి మార్దంగికుడు వివిధ జతుల్ని వాయిస్తూంటే ప్రేక్షకులు తృప్తి పొందుతున్నారు. ఆ జతులకే ఆట ఉంటే ఇంకా ఎంత రక్తివంతంగా ఉంటుందో !

జతులకు ఆట లేక పోవడానికి కారణం? ద్రుపద సాంప్రదాయక మృదంగ వాయిద్యం, గంభీరనాద వికాసంతో జటిలమైన జతి కట్టుబాట్లతో కూడి యున్నటువంటి పద్ధతి తాండవ రీతికి చెంది యుండ డమే దీనికి కారణం.

తూర్పు భాగవతాన్ని (భామాకలాపాన్ని) పురుషులే ఆడుతున్నా అందులోని సత్యభామ స్త్రీ పాత్ర గనుక ఆ పాత్రధారుడు లాస్యరీతిని అనుసరించి కేళిక చేయ వలసి యుంటుంది. లాస్యరీతి ఆటకీ, తాండవ రీతి మృదంగానికి పొత్తుకుదరదు. అంటే హస్త, పాద విన్యాసాలు పాత్ర పోషణకు సహకరించవు. అందు వల్ల జతులకు తగినట్టు ఆడకుండా ఆ గతులకు నృత్తం చేయడం ఈ ద్రుపద బాణీ (తూర్పుబాణీ)లో ఆచారంగా పరిణమించింది. ఉత్తర హిందూస్థానం లోని శాస్త్రీయ ద్రుపద సంగీతాన్ని పోలియున్నటు వంటి వీరి గానం పూర్తిగా వికసించి యున్నదని మనం చెప్పవచ్చును.

మన స్త్రీ కళాకారుల నృత్యం, అభినయం లాస్య రీతిలో చక్కగా అభివృద్ధి చెందాయి. నృత్త, నృత్యాలు కూచిపూడి బాణీలో విరివిగా వృద్ధిపొందాయి. ఉభయ గోదావరి జిల్లాలలోని స్త్రీలు భాగవతాన్ని ప్రదర్శిస్తున్నా అది నాట్యమేళానికి చెందియుండడం వల్ల ప్రత్యేకంగా స్త్రీలు ప్రదర్శించే కర్నాటక, కచ్చేరీ ఆటలో (భరత నాట్యంలో) గోచరించే లాలిత్యం, మార్దవం వీరి భాగవత ఆటపాటల్లోను, అభినయంలోను తగ్గిపోయాయి. కచ్చేరి ఆటను, భాగవతాన్ని అభ్యసించిన ఏ నర్తకి అయనా ఈ రెండు బాణీలను మనముందు ప్రదర్శిస్తే వీటిలో గల తేడా లను మనం సులువుగా గుర్తించగలం.

స్థానాలందు నిలిచే తీరు, విన్యాసాలు, హస్తాల పొందిక, భావ ప్రకటన మొదలైన వన్నీ ఈ రెండింటిలో వేర్వేరుగా ఉంటాయి, అలాగే భాగవత పాటకు, కచ్చేరి నాట్యం పాటకు ఎంతో తేడా ఉంది. భాగవతంలోని దరువు పాట ఛందోరీతి గానానికి చెందింది. దరువు లేని భాగవతం ఆట లేనే లేదు.

భరత విద్యలో అభినయం, నృత్యం, నృత్తం, ముఖ్యమైనవి. ఈ మూటింటిని సంపూర్ణంగా ప్రద ర్శించడానికి అనువైనవి దరువు. ఈ దరువును విలం బిత, మధ్య, ద్రుత లయల్లో పాడుతారు.

విలంబిత లయలో అభినయం ప్రారంభమౌతుంది. తన ప్రత్యేక స్థితిని నాయిక స్థాయిగా చేసికొని వివిధ సంచారులను అభినయిస్తుంది, ఆ సంచారులనే విశదీక రిస్తూ మధ్యలయలో నృత్యం చేస్తుంది. ఆ తర్వాత ద్రుతలయలో ఆమె వలయాకారంలో నృత్త మాడి ముగిస్తుంది. దరువులను ఆడే సాధారణ పద్ధతి ఇది. పై మూడు సంప్రదాయాలలోను ఈ పద్ధతి ఉంది. అభినయించే స్థాయీ భావాన్ని పోషించేదిగా నృత్త మాడే అడుగుల కూర్పు ఉంటుంది. వలయాకారంగా

తిరుగుతూ ఈ విధంగా ముగించడం ప్రతీ దరువుకు ముఖ్యం. దీన్నే ధ్రువ విన్యాస మంటారు. ఈ ధ్రువ విన్యాసాలు పలు విధాలైనవి. పాటలోని అర్థాన్ని, భావాన్ని అనుసరించి ఆటలోని గమనం, గతుల విన్యాసం ఉంటాయి. ఈ విన్యాసం ఎప్పుడూ గూడ చతురశ్ర గతిలోనే ప్రదర్శింపబడుతుంది.

## ఛందోరీతి గానం

పద్యాలు ఎలా పలు విధాలైన ఛందస్సులో ఉచింపబడుతున్నాయో అలాగే పాటలు, తాళగతులు వివిధ గణాలు గల ఛందస్సుల్లో కూర్చబడతాయి. ఈ ఛందస్సును తెలిసినవారు మృదంగాన్ని వాయిస్తే గణ విభజనతో, సొంపైన శబ్దాలతో అత్యంత ఆకర్షణీయంగా ఆ వాయిద్యం ఉంటుంది.

యతి, ప్రాస నియమాలతో ఈ ఛందో రీతిలో వ్రాయబడిన పాటలు ఏ తాళంలోనైనా, ఏ గతిలోనైనా పాడడానికి వీలుగా ఉంటాయి. ప్రాచీన యక్షగాన రచనలన్నీ ఈ నియమాలకు కట్టుబడే ఉన్నాయి. ఈ రచనా విధానం యక్షగాన, భాగవత నృత్య సంగీతాలకు చాలా ముఖ్యం.

## లాస్య తాండవాలు

భరత విద్యలో లాస్యం, తాండవ మనే రెండు రీతులు ఉన్నాయి. స్త్రీలు ప్రదర్శించే సుకుమార నర్తన రీతి లాస్యం, పురుషులు ప్రదర్శించే ఉద్ధత నర్తనరీతి తాండవం. పురుషులు ప్రదర్శించే తాండవ రీతిలో భాగవతం ఉంటుంది. దీనిలోని స్త్రీ పాత్రలను గూడా పురుషులే ధరిస్తారు. అయితే ఇందులో స్త్రీ పాత్రలను ధరించే పురుషులు ఏ రీతి నర్తనాన్ని ప్రదర్శించాలన్న సందేహం కలగడం సహజం. దీని లోని నర్తనం, నృత్యం తాండవ రీతిలోని లావణ్యమైన విన్యాసమేగాని శుద్ధ లాస్యం మాత్రం కాదు.

లలిత కోమలమైన విన్యాసాలతో అలంకరింపబడిన లాస్యంగా భ్రమింపజేసే తాండవ రీతి ఇది. తాండవ మంటే పురుషులు చేసే నర్తన మని, లాస్య మంటే స్త్రీలు చేసే నర్తనమని మనం సాధారణంగా అనుకొంటూ ఉంటాం. అయితే శాస్త్రకారులు కొందరు దాన్ని ఈ క్రింది విధంగా విపులీకరించారు :

స్త్రీల నర్తన సంప్రదాయంలో, నర్తకి కూర్చుని రసభావాలను అభినయించడం లాస్యం. తాళలయలను అనుసరించి నిలబడి ఆడడం తాండవం.

అలాగే పురుషుల నర్తన సంప్రదాయంలో, నర్తకుడు ఉద్ధత గంభీర రీతిని హాసభావ ప్రకటన చేయడం, నృత్త నృత్యాలను ప్రదర్శించడం తాండవం, కరణాంగహారాలతో సుకుమారంగా స్త్రీ పాత్రలను అభినయించడం, నృత్త నృత్యాలను చేయడం లాస్యం.

స్త్రీల నర్తన సంప్రదాయంలోని తాండవం ఎలా శుద్ధ తాండవం కాదో అలాగే పురుషుల నర్తన సంప్రదాయంలోని లాస్యం శుద్ధ లాస్యం కాదు.

ఒక పురుషుడు స్త్రీ వేషం వేసుకొని స్త్రీవలె అభినయించి ఒప్పించడానికి ఒక్కొక్కప్పుడు సహజత్వాన్ని మించి అభినయించవచ్చును. అలాంటప్పుడు కూడా అతడు స్త్రీలను మించి అభినయించాడని ప్రేక్షకులు మెచ్చుకొనవచ్చును. అదే స్త్రీలు సహజత్వాన్ని మించి అభినయిస్తే స్త్రీ సౌకుమార్యం కుంటుపడి వెగటుగా ఉండవచ్చును. పురుషుడు అతిగా అభినయించి, సహజత్వాన్ని మించినా అది మనకు దోషమనిపించకపోవచ్చును. ఎందువల్ల నంటే, పురుష ప్రకృతి, స్వభావం సహజంగా కొంతవరకు ఉద్ధతమైనవి. అతడు తన సహజత్వాన్ని తాత్కాలికంగా మరిచిపోయి, తన మనసును స్త్రీ స్వభావంపైని లగ్నంచేసి, కోమలమైన భావాలతో హృదయాన్ని స్పందింపజేసుకొంటేగాని అతని దేహంలో సౌకుమార్య

ఛాయలు గోచరింపవు. అంటే, సహజ స్త్రీ సౌకుమార్యాన్ని తనలో పూర్తిగా ఆవహించుకొనా లనుకొన్నప్పుడు ఆ భావాలను అధికంగా ప్రదర్శించ వలసి యుంటుంది. అప్పుడు అతడు స్త్రీ సహజత్వాన్ని మించినా అతని భావ ప్రకటన వికృతంగా ఉండదు.

స్త్రీలే ఆ భావాలను స్త్రీ సహజత్వాన్ని, సౌకుమార్యాన్ని మించి ప్రదర్శిస్తే అది వికృతంగా ఉండి వెగటనిపిస్తుంది. స్త్రీలు పురుష పాత్రలు ధరించి నప్పుడూ కూడా ఇదే విధంగా జరుగుతుంది. ఈ వాస్తవాన్ని గ్రహించే, తాండవరీతిలో లాస్యాన్ని, లాస్యరీతిలో తాండవాన్ని ప్రదర్శించడాన్ని శుద్ధ లాస్యం, శుద్ధ తాండవం అని శాస్త్రవేత్తలు పేర్కొన్నారు.

లోకోద్ధారణ నిమిత్తం శ్రీ మన్నారాయణుడు దశావతారాలు దాల్చాడు. వీటిలో ఎనిమిదవ అవతారం కృష్ణావతారం. అన్ని అవతారాల్లోను ఇది సంపూర్ణమైనదని పెద్దలంటారు. ఈ కృష్ణావతారానికి చెందిన కథనే భాగవత మంటారు. శ్రీకృష్ణ సత్యభామల ప్రణయానికి సంబంధించిన ఒక ఘట్టం ఆ యవతార పురుషుని జీవితంలో అత్యంత మధురమైంది. అదొక ప్రణయ కలహం. ఆ ప్రణయకలహ నాటకమే పారిజాత నాటకం, అదే భామాకలాపం, అదే ఆంధ్రుల అభిమనాన్ని చూరగొన్న గొప్ప నాటకం.

ఆంధ్ర దేశంలోనే కాక కృష్ణభక్తి ప్రచార మందున్న గుజరాతు, అస్సాం, ఒరిస్సా, కర్నాటకం మొదలైన రాష్ట్రాలలో గూడ ఈ కథ విశేష ప్రచారంలో ఉంది. ఇతర ప్రాంతాలలో రాధా మాధవుల కథకు ఆదరణ అధికం.

అస్సాం, ఒరిస్సా, కర్నాటక, గుజరాత్ రాష్ట్రాలలో మాత్రం ఈ పారిజాత నాటకం బహుళ ప్రచారంలో ఉంది. అయితే ఆ రాష్ట్రాలలో ఇదొక నృత్య నాటకంగా మాత్రమే ప్రదర్శింపబడుతూంది. అయితే ఆంధ్ర దేశంలో ఇది నాటకంగాను, కలాపంగాను గూడా ప్రచారం పొందింది. ఈ రెండింటిలో కలాప ప్రదర్శనకే ప్రజల ఆదరణ ఎక్కువగా ఉంది. ఈ కలాపం నృత్య సంగీతాలతో గూడిన దృశ్య ప్రబంధంగా రూపొందడం వల్ల కళారాధకులైన నర్తకులకు, రసికులైన ప్రేక్షకులకు ఇదొక పెన్నిధి అయింది.

ఈ కలాప ఆటని భాగవత మని ఆంధ్ర దేశంలో అంటారు. అయితే భాగవతం ఆట వేరు, భాగవత నృత్య సంప్రదాయం వేరు. పురుషులు ప్రదర్శించే నాట్యమేళ రీతిని భాగవత నృత్యసంప్రదాయ మంటారు. భామాకలాప ప్రదర్శన ఈ సంప్రదాయానికి చెందుతుంది. ఆంధ్రలో ఈ భాగవతం ఆట మూడు విధాలుగా ఉందని ఇది వరకే తెలియజేశాను.

## ముఖ్యమైన వాయిద్యాలు :

శ్రుతి, మృదంగం, తాళాలు, నర్తకుని కాళ్లకు గజ్జెలు, ఇవీ ముఖ్యమైన వాయిద్యాలు. పూర్వం శ్రుతికి తిత్తిని ఉపయోగిస్తూండేవారు. కాని నేడు శ్రుతి పెట్టెనుగాని హార్మోనియంనుగాని ఉపయోగిస్తున్నారు. ప్రధాన గాయకునికి సహకారంగా ముగ్గురు, నలుగురు వంత పాటకు ఉంటారు.

పూర్వం ప్రతి భామా కలాప ప్రదర్శనకు సుమారు పదివేలమంది ప్రేక్షకులు వచ్చేవారు. వారందరికీ పాట వినిపించాలి, ఆట కనిపించాలి. ఆ రోజుల్లో నేడున్నట్టు మైకులు లేవు. అందువల్ల ఆనాటి పరిస్థితులకు అనుగుణంగా పాటా, వాయిద్యం రూపొందాయి. హెచ్చు స్థాయిలో పాడడం వీరు అలవాటు చేసుకొన్నారు. ఒక్కొక్కప్పుడు ఆ పాట మేఘ ఘర్జనవలె గంభీరంగా ఉంటుంది. మరొక్కప్పుడు సముద్రం ఘోషలా గల గల లాడుతూ ఉంటుంది. ఇంకొకప్పుడు గండు కోయిల కూసినట్టు పంచమ స్వరంలో పలుకుతూ ప్రేక్షకులకు ఆనందాన్ని చేకూరుస్తుంది.

దూరంగా ఉండే ప్రేక్షకులకు సైతం చక్కగా ముఖాలు కనబడేటట్టు ముఖానికి కోటా వేసికొని తగిన ఆభరణాలను ధరిస్తారు.

భైరవి, ఆనంద భైరవి, ముఖారి, సావేరి, అసావేరి, తోడి, మోహన, మరువా, జింఝ్లా, యదుకుల కాంభోజీ, ఆహిరి, కాంభోజి, రేగుప్తి, నాట, సురట, నీలాంబరి, భూపాలం ఇత్యాది రాగాలను భావయుక్తంగా వీరు పాడడం మనం వినగలం. తన్మయులై వీరు గానం చేస్తూంటే ఈ రాగాలు వారి కోసమే పుట్టాయని ముగ్ధులైన ప్రేక్షకులు అనుకొనడంలో ఆశ్చర్యం లేదు. అంత భక్తితో గూడిన శక్తివంతమైన పాటలను తూర్పు భాగవతులు పాడగలరు.

రాగతాళాలు శాస్త్రీయ కర్నాటక సంగీతానికి చెందినవే గాని వారు పూర్తిగా దేశి సంప్రదాయంలో పాడతారు. అందువల్ల దీనిలో ప్రాంతీయ ప్రభావం పూర్తిగా ఉంటుంది. రాత్రి పూట వీరు కేళిక చేస్తున్నప్పుడు ఆ యా వేళలను అనుసరించి అందుకు తగిన రాగతాళాలలో పాడడం వల్ల వీరి పాట మరింత రక్తి కడుతూ ఉంటుంది.

## హాస్యం-హాస్య పాత్ర :

ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించి, వారిని ఆకర్షించు కొనడానికి హాస్యం ఉపయోగపడుతుంది. కలాపంలోని వివిధ రసాలను ఒప్పించడానికి పాత్రధారుడు ఎంత సామర్థ్యంతో నటించినా పాత్రపోషణ హద్దులను మించి పోరాదు. కనుక ప్రేక్షకులకు విసుగు లేకుండా ఉండడానికి హాస్యం చొప్పించబడుతుంది.

హాస్యగానికి ఉండే స్వేచ్ఛ కేళికలోని అసలు పాత్రలకు ఉండదు. అందువల్ల హాస్యగాడు స్వేచ్ఛగా నటించి ప్రేక్షకులను ఆకట్టుకో గలడు. అంతే కాక అతడు అనేక విషయాలను తన హాస్య ధోరణిలో వ్యాఖ్యానించవచ్చును. అటువంటి సమాయాలలో అతడు మితిమీరి హాస్యం చెప్పినా ఎవరూ తప్పుగా భావించరు.

సాధారణంగా భామాకలాపంలోని హాస్యగాడు మాధవి పాత్రలో కన్పడతాడు. అతడు సత్యభామతో నున్నప్పడు మాధవి గాను, కృష్ణునితో నున్నప్పుడు మాధవ గాను వ్యవహరిస్తాడు.

ఇతని వేషధారణ తూర్పు వైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించిన పురుష వేషంలో ఉంటుంది. కాని ఇటీవల కొన్ని ప్రాంతాలలో ఈ "మాధవి" పాత్రను ఒక నపుంసకి కొజ్జా పాత్రగా కొందరు ప్రవేశ పెడుతున్నారు. ఉత్తమమైన భక్తి ప్రబోధకమైన ఈ భామాకలాప భాగవత కళ ఈ కొజ్జా పాత్ర వల్ల దిగాజారిపోయి వెగటుగా అసభ్యకరంగా తయారయింది. తూర్పు భాగవతంలో గాని, ఉభయ గోదావరి జిల్లాలలోని లాస్య సంప్రదాయంలో గాని ఎన్నడూ ఈ పాత్ర ఇలా దిగజారిపోలేదు. కూచిపూడివారి సంప్రదాయంలోనే కొందరు మాత్రం ఈ విధంగా దిగజార్చుతున్నారు. దీనివల్ల కృష్ణ పాత్రకు కూడ ఎంతో అపచారం జరుగుతుంది.

భామాకలాపం శృంగార ప్రబంధం. దీనిలో ఎనిమిది మంది శృంగర నాయికలు గోచరించాలి. స్వాధీన పతిక, ప్రోషిత, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, వాసకసజ్జిక, అభిసారిక, కలహాంతరితల వ్యాపారాలు, చేష్టలు అభినయించబడాలి. పతిని ఎడబాసిన సత్యభామ తన స్వామికి లేఖ వ్రాసి, దూతిక ద్వారా పంపుతుంది. తిరిగి వచ్చిన ఆ దూతికపైని సంభోగ చిహ్నాలున్నట్లు సత్యభామ భ్రమించి ఆమెను దూషిస్తుంది. ఆ దూతిక ఎవరో కాదు, మాధవే. ఆ మాధవి నపుంసకుడైతే కృష్ణుడు నపుంసకునితో సంభోగించినట్లు అర్థంచేసికొనవలసివస్తుంది. దీని వల్ల దైవాపరాధం జరగడమే గాక కథ ఔన్నత్యం, ఆదర్శం దెబ్బతింటాయి.

కొన్ని ప్రాంతాలలో జీవాత్మను, పరమాత్మను సంధాన పరచడానికి మాధవి పాత్రను చిత్రిస్తున్నారే కాని ఇలా కొజ్జాగా మాధవిని చిత్రించడం ప్రాచీన సంప్రదాయంలోనే కాదు మరెక్కడా కూడాలేదు.

కథను రక్తి కట్టించడానికి, ప్రేక్షకులకు విసుగు కలగ కుండా వారిని సమ్మోహితులను జేయడానికి, రామాయణ, భారతాది పురాణేతి హాసాలలోని విశిష్టాం శాల్ని ప్రజల్లో ప్రచారం చేయడానికి మాధవి పాత్ర ద్వారా వ్యాఖ్యానింప జేయడానికి ఈ పాత్ర చిత్రీక రించబడిందని, పై రెండు ప్రయోజనాలను ఈ పాత్ర సాధించవలసి యుంటుందని మనం గ్రహించాలి.

## పాత్రలు

భామాకలాపంలోను, పారిజాతనాటకంలో గూడ మూడు పాత్రలు, కృష్ణుడు, సత్యభామా, రుక్మిణీ ముఖ్యంగా ఉంటాయి. భామాకలాపంలో మాధవి (హాస్య పాత్ర), సూత్రధారుడు అదనంగా ఉంటారు. పారిజాత నాటకంలో మాధవీ, నారదుల పాత్రలు అదనంగా ఉంటాయి.

కర్నాటక దేశంలోను, కర్నాటక నానుకొనియున్న ఆంధ్ర ప్రాంతాలలోను కురవంజి లేక ఎరుకత పాత్ర కూడా ఒకటి ఉంటున్నది. రుక్మిణికి గాని, సత్య భామకు గాని ఈ ఎరుకత లేక ఆ కురవంజి సోది చెపుతుంది.

ఆంధ్రదేశంలో ప్రచర్శించే ఇతర వీధి నాటకాలలో ఎరుకత పాత్ర ఒకటి ప్రవేశించి కథలోని ప్రధాన పాత్రకు సోది చెప్పడం ఆచారంగా ఉంది. శ్రీ వేంక టేశ్వర కల్యాణంలో శ్రీనివాసుడే ఎరుకత వేషంలో వచ్చి పద్మావతికి సోదె చెప్తాడు. మృత్యుంజయ విలాసంలో పార్వతికి ఎరుకత జోస్యం చెపుతుంది. మార్కండేయ వీధి నాటకంలో మరుద్వతికి ఎరుకత సోదె చెపుతుంది. ఈ విధంగా ప్రతి వీధినాటకంలోను ఎరుకత ప్రవేశించి ఎవరికో ఒకరికి జోస్యం చెప్పడం ఆచారంగా ఉంది.

## తూర్పు భాగవత ప్రదర్శనా విధానం

కొంతసేపు తెరవెనుక ప్రతి పాత్ర పాడి, ఆడి తనను ప్రేక్షకులకు పరిచయం చేసికొన్న తర్వాత సభా ప్రవేశం చేయడం ఆచారం. వెదురు కర్రలతో గట్టిన పందిరి నీరి రంగస్థలం. ప్రతి పాత్ర ప్రవేశించే ముందు ఆ పాత్రకు తెరబడ్తారు. తెరలో తనని తాను గానయుక్తంగా పరిచయం చేసి కొన్న తర్వాత తెర తొలగుతుంది. ఆ తర్వాత ఆ పాత్ర నర్తన మాడు తుంది.

"తాండవ నృత్యకరి గజానన" అంటూ గాయ కులు పాడుతూ ఉండగా విఘ్నేశ్వర పాత్ర ప్రవేశంతో ఈ వీధి నాటకం ప్రారంభమవుతుంది. ఆ పాత్ర వెడలిన పిదప రుక్మిణి ప్రవేశించి నర్తనమాడుతుంది. తర్వాత కృష్ణుడు ప్రవేశించి రుక్మిణితో కలిసి నర్తన మాడతాడు. వీరి నర్తనం ముగిసిన తర్వాత సత్య భామ ప్రవేశిస్తుంది.

సర్వసాధారణంగా ఈ కలాపానికి ఇద్దరు మృదంగం వాయిస్తూ ఉంటారు. ప్రారంభంలో చిన్న మార్దంగికుడు వాయిస్తాడు. సత్యభామ ప్రవేశంతో పెద్ద మార్దంగికుడు మృదంగం వాయించడం మొదలు పెడతాడు. దీంతో కథ మంచి రక్తిలో పడుతుంది. సత్యభామ రంగ ప్రవేశం చేసే సరికి సాధారణంగా రాత్రి పదకొండు గంటలు దాటుతుంది. ఆ సమయా నికి పరిసర ప్రాంతాలనుండి పల్లె ప్రజలు తండోప తండాలుగా ఆ ప్రదర్శన స్థలానికి చేరుకొంటారు.

సత్యభామపాటను, పెద్ద మార్దంగికుని వాయిద్యాన్ని వినగానే ప్రేక్షకుల దేహాలు పులకించిపోయి, వారు తన్మయులై మంత్ర ముగ్ధుల్లాగ భాగవతాన్ని చూస్తూ కూర్చుంటారు.

పూర్వం తూర్పు ప్రాంతంలో ఒక ప్రసిద్ధ మార్దంగికుడు కింతాడ అప్పన్న గారు ఉండేవారు. ఆయన వాయిద్యం ఉందన్న నాడు వేలాదివేలమంది వచ్చేవారుట. ఆయన సభ ప్రవేశించి మృదంగం వాయించి, "కింతాడ అప్పన్న, కింతాడ అప్పన్న, కింతాడ అప్పన్న" అని మూడు సార్లు ముక్తాయి వాయించేవారట. వెంటనే సభలో సద్దు మణిగి, ప్రేక్షకులు నిశ్శబ్దంగా కూర్చుని కేళికను శ్రద్ధతో తిలకించేవారుట.

సత్యభామ సభ ప్రవేశించి కొంత తడవు నర్తన మాడిన పిదప, మన్మదోపాలంబనలో సన్నని దోమ తెరను పట్టడం, దాని వెనుక ఆమె నర్తనమాడడం ఒక ఆచారంగా ఉండేది.

మూడు ప్రాంతాలలోను, తూర్పుబాణీ, లాస్యబాణీ, కూచిపూడి బాణీలలోను కథను పోషించే విధం ఒకటిగానే ఉంది. ప్రస్తుతం ప్రచారంలో నున్న తీరులోనే మన పూర్వీకులు ఈ కలాపాన్ని తొమ్మిది రాత్రుళ్ల గ్రంథంగా ఆడేవారు. ఆ తర్వాత మూడు రాత్రుళ్ల గ్రంథంగా కుదించబడింది. మరికొంత కాలానికి ఇది ఏక రాత్రి గ్రంథంగా తయారయింది. అయితే ప్రస్తుత కాలంలోని కూచిపూడి వారు రెండు గంటల్లోనే ఈ కలాపాన్ని ముగిస్తున్నారు.

సాగర సీమలోని లాస్యబాణీ స్త్రీ కళావేత్తలందరూ ముసలివారైనారు. ఒకరిద్దరు మాత్రం ఇంకా ఈ కలాపాన్ని ప్రదర్శిస్తున్నారు.

నేటికి ఈ కళ ఒక్క తూర్పు ప్రాంతంలోనే సజీవంగా ఉంది. ఈ కళను ఆరాధించే కలాప బృందాలు ఇక్కడ పదికి పైబడి ఉన్నాయి. అంటే సుమారు వేయి మంది ఈ కళను ఆరాధించే వారున్నారు.

## కలాపాలు-ఆంధ్రదేశం

జయదేవుని రచన సంస్కృతంలో ఉండడం వల్ల ఆతని గీతగోవిందం భారతదేశంలోని పండితులందర్నీ ఆకర్షించింది. మన భామాకలాపం తెలుగులో ఉండడంవల్ల ఇది మన తెలుగు దేశంవరకే పరిమితం అయిపోయింది. రాధామాధవుల ప్రణయలీలల్ని, విరహవియోగాలను జయదేవుడు తన అష్టపదుల్లో పొందుపరచాడు. మన భామాకలాపంలోని సత్యభామ విరహ వియోగాలు దరువులు, ద్విపదలు మొదలైన దేశీ సంప్రదాయ రచనలలో రూపొందించబడ్డాయి! ఈ రెంటింటిలోని నాయికలు మారినందువల్ల రసభావ వికాసంలో తేడా వచ్చినా కథాగమన తీరు మాత్రం ఒకే పద్ధతిలో నడిచింది.

అత్యంత ప్రాచీనమైన జయదేవుని ఈ నృత్య సంగీత రచనంతా ధ్రుపద బాణీ సంగీత పద్ధతికి చెందుతుంది. కాని వివిధ ప్రాంతీయులు దీనిని వారి వారి సంగీత బాణీలలో పాడుతున్నారు. అసలైన ఆ ప్రాచీన ధ్రుపద బాణీలో వినాలనుకొంటే ఒరిస్సాలోని ఆలయసేవలలోనే దానిని వినగలం. ఆ సంగీత బాణీ, అందుకు తగిన మృదంగ వాయిద్యం నేటికీ అక్కడ ప్రచారంలో ఉన్నాయి. కాని ఆ యష్టపదులకు అభినయం మాత్రం ఒక్క ఆంధ్ర కళాకారుల సొత్తుగా ఆంధ్రలోనే మిగిలియుంది. ఇతర రాష్ట్రాల వారు అష్టపదులకు నృత్యామాడితే ఆంధ్ర కళాకారులు అభినయిస్తారు. గమనించదగిన ముఖ్య భేదం ఇదే. ఈ గీత గోవిందానికి హస్తాభినయం పూర్తిగా గల గ్రంథం తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉంది.

ద్విపదం, దరువు రెండూ ఒక్కటే అయినా గీత గోవింద ద్విపద బాణీకి, కలాపంలోని దరువు గాన పద్ధతికి తేడా ఉంది. ఆంధ్ర దేశంలో ప్రచారమందున్న శ్రీకృష్ణ లీలాతరంగణి, గొల్ల కలాపం, రాధా మాధవం, జీవయెరుకుల కురవంజి, యెరుకల వేష కథ, చోడిగాని కథ, సుంకర కొండని కథ, వాలింత వేష కథ, దాదినమ్మ మొదలైన రచనలన్నీ

ఇంచుమించుగా భామా కలాప పద్ధతినే ప్రదర్శింప బడుతున్నాయి.

శ్రీ కృష్ణ లీలా తరంగిణిని యతి నారాయణ తీర్థుల వారు రచించారు. ఇది యక్షగానంలాగే ఉంది. యక్షగానమంటే నేడు బహు పాత్రలతో ప్రదర్శిస్తు న్నటువంటి వీధి నాటకం కాదు. ఒకే పాత్ర పాడుతూ, ఆడుతూ ప్రేక్షకులకు కథను చెపుతూ వినోదాన్ని కలిగించే పద్ధతి. ఈ పద్ధతినే మన పూర్వులు గరుడా చల యక్ష గానాన్ని, సుగ్రీవ విజయాన్ని ఇంకా మరి కొన్నింటిని వ్రాశారు, ప్రదర్శించారు. అయితే నారాయణ తీర్థులవారి శ్రీ కృష్ణ లీలా తరంగిణిలో ఇంకో విశేష ముంది. దీనిని ఒక్కడే పాడుతూ ప్రదర్శించవచ్చును, పలువురు పాడుతూ ప్రదర్శించ వచ్చును, సంకీర్తనగా భజన కూటాల వారు పాడుకో వచ్చును.

ఈ నారాయణ తీర్థుల వారు "పారిజాతాపహరణం" అనే ఒక యక్షగానాన్ని గూడా వ్రాశారు కాని అదంత ప్రచారంలోకి రాలేదు.

కేరళ దేశంలో "కృష్ణ ఆటం" అనే ఒక రచన ఉంది. అక్కడి నృత్యకళాకారులు దీన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. అది మన కలాప పద్ధతిలో ఉన్న కృష్ణ నాటకం. కాని దాని ఆట పద్ధతి వేరుగా ఉంది. కేరళ మొదలైన ఇతర ప్రాంతాలలోని రచనలు మన కలాప పద్ధతిలో సాగినా అవి నృత్య నాటకాలుగా ప్రదర్శిం పబడుతున్నాయి. అంటే కథానుసారం బహుపాత్రలు ప్రవేశించి ఆడతాయి. అలంకార శాస్త్రాల అనుసారం వివిధ నాయికలు వాటిలో మనకు కనబడరు. రసాభి నయం, సంచారుల వికాసం మనకు వాటిలో కనబడవు. మన కలాపాల ప్రదర్శనం ప్రత్యేక మైనది. ఈ నాయికాభినయ తీరుల్లో మనకు ఇతర ప్రాంతాల వారికి చాలా తేడా ఉంది. మనవి అత్యు త్తమ స్థాయికి చెందినవి. మన నర్తకులు ఆడుతూ పాడతారు గనుక ఆటలో ప్రావీణ్యం సంపాదించినట్టు గానే సంగీతంలో గూడ ప్రావీణ్యం సంపాదించవలసి ఉంటుంది.

కర్ణాటక ప్రాంత యక్షగాన నర్తకులు పాటను పాడరు. భాగవతారుడు (సూత్రధారుడు) పాడే పాటకు వీరు నాట్యం చేస్తారు. ఆ పాట అర్థాన్ని, భావాన్ని వీరు వచనంలో చెప్తారు.

నృత్య సమయంలో పాటను పాడే సంప్రదాయం కేరళ ప్రాంతంలో లేదు.

ఆంధ్ర, తమిళ ప్రాంతాలలోని భాగవత కళల్లో తేడా లేదు, కాని తమిళదేశంలో కలాపం ఆట లేదు.

ఒరిస్సాలో గీతగోవిందం ప్రదర్శింపబడుతున్నది. కాని అదొక నృత్యనాటకంగాను, ఏక పాత్ర నృత్య శైలిగాను ఉంటున్నది. మణిపురి మొదలైన ఇతర ప్రాంతాలలో గూడ ఇదే అనుసరించబడుతున్నవి.

ఈ సాంప్రదాయక రచనను ఊహించి కల్పించి జయదేవ కవి గీతగోవిందాన్ని వ్రాసినా దాని కొక విశిష్ట కళా రూపాన్ని కలుగజేసి ప్రచారంలోకి తెచ్చిన వారు మన ఆంధ్ర నృత్య కళావేత్తలే అని గట్టిగా చెప్ప గలను.

కలాపంలో చెప్పుకో దగ్గ కథ ఏమీ ఉండక పోయినా ఒక చిన్న సంఘటనను ఆధారంగా తీసికొని వివిధ వర్ణనలను వివిధ రసాలను, సంచారీ భావాలను తన నృత్త, నృత్యాలతో నర్తకి అభినయిస్తూ ప్రదర్శి స్తుంది. గనుక ఈ నర్తకి అలంకార, రస శాస్త్రాలను విధిగా, క్షుణ్ణంగా నేర్చుకొంటుంది. ఈ కలాపాలను ప్రదర్శించే కళాకారులకు ఎంతో పాండిత్య ప్రతిభ అవసరం.

## గీత గోవిందం

రాధామాధవుల ప్రణయలీలల వర్ణనగల ఒక మధుర ప్రబంధం ఇది. దీనిలోని పాటల్ని అష్టపదు లంటారు. ప్రతి పాటకు ఎనిమిది చరణాలున్నాయి గనుక వీటికి అష్టపదులన్న పేరు వచ్చింది. జయదేవుడు గొప్ప

కవి, సంగీతజ్ఞుడు. వీటిని మించి అతడు గొప్ప కృష్ణ భక్తుడు. అతడు తన్మయుడై భక్తి పారవశ్యంతో ఈ అష్ట పదుల్ని పాడుతూంటే అతని భార్య పద్మావతి అభినయించేది. ఆ శ్రీకృష్ణ భగవానుడు ఆ యాట పాటలను చూసి ఆనందించేవాడు.

పూరీ జగన్నాథుని ఆలయంలో ప్రత్యేకంగా ఈ యష్టపదుల్ని నేడు గూడా పాడుతున్నారు, ఆడుతున్నారు.

గీత గోవిందంలో చెప్పుకో దగ్గ కథ ఏదీ లేదు. కృష్ణునికి దూరమైన రాధ వెన్నెల రాత్రిలో విరహాన్ని భరించలేక దూతిక ద్వారా ఆయనను రమ్మని కబురు పంపుతుంది. రాయబారిగా వెళ్లి వచ్చిన దూతిక నాయికయినట్లు రాధ భ్రమించి, ఆమె నిజాయితీని శంకిస్తుంది. కృష్ణుని పైని అలిగి అతడు వస్తే ఆమె కోపించి ఆతణ్ణి పొమ్మంటుంది. అతడు ఆమె అలుకను తీరుస్తాడు. ఆమెకు కోపం పోయి అతనిలో లీనమైపోతుంది. కథ అతి చిన్నదే అయినా జయదేవుడు వర్ణించిన ఆ వర్ణనలు, ఆ నృత్య సన్నివేశాలు, ఆ రాసక్రీడా విధానం చూస్తే అదొక ప్రత్యేక రస లోకంగా గోచరిస్తుంది. ప్రోషిత, విరహోత్కంఠిత, అభిసారిక, వాసకసజ్జిక, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, స్వాధీనపతిక ఈ అష్ట విధ శృంగార నాయికలు ఇందులో వర్ణించబడ్డారు.

దేశాంతరంలో పతి ఉండగా తపించే నాయిక ప్రోషిత.

అనుకున్న వేళకు ప్రియుడు రాక పోతే విరహ బాధ పడే నాయిక విరహోత్కంఠిత.

తన ప్రియుడున్న స్థలానికి వెళ్లే నాయిక లేక తనున్న స్థలానికి ప్రియుణ్ణి పిలిపించుకొనే నాయిక అభిసారిక.

తన స్వామి వస్తున్నాడని తెలిసి అలంకరించుకొని సిద్ధంగా ఉండే నాయిక వాసకసజ్జిక.

ప్రియజనంచే వంచింపబడిన నాయిక విప్రలబ్ధ.

తన స్వామి ప్రవర్తనను సహించని, ఖండించే నాయిక ఖండిత.

అనవసరంగా తన ప్రియునితో కలహించి, తర్వాత పశ్చాత్తాపం చెందే నాయిక కలహాంతరిత.

ప్రియుణ్ణి తన చెప్పుచేతల్లో పెట్టుకొనే నాయిక స్వాధీనపతిక.

ఈ యెనిమిది నాయికలే గాక స్వీయ, పరకీయ, సామాన్య అనే మరి ముగ్గురు గురించి గూడా అలంకార శాస్త్రాలలో వర్ణించబడ్డాయి.

గీత గోవిందంలోని రాధ ఈ యెనిమిది నాయికా అవస్థలను అనుభవించింది. అయితే ఈ రాధ స్వీయా, పరకీయా లేక సామాన్యా? ఈ ప్రశ్న రాధ విషయంలో ఉత్పన్నం కాదు. ఈ ముగ్గురకు అతీతురాలు రాధ. రాధే కృష్ణుడు, కృష్ణుడే రాధ. రాధ విషయంలో ఈ నాయికల ప్రస్తావన రాక పోయినా అలంకార శాస్త్రంలో గల నాయికలందర్నీ తన ప్రబంధంలో వర్ణించాలన్న ఉద్దేశ్యంతో జయదేవుడు వివిధ గోపికా స్త్రీల వర్ణనా సందర్భాలలో ఈ నాయికలందర్నీ వర్ణించాడు.

దశావతార వర్ణనలు గల మొదటి పదంతో గీత గోవిందం ప్రారంభమయింది. దీనికి తప్ప మిగిలిన పాటలన్నింటికీ ఎనిమిది చరణాలున్నాయి.

ఇందులో రాధ, చెలికత్తె పాత్రలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి. కృష్ణపాత్ర చాలా చిన్నది.

మన నాట్యశాస్త్రాలలో గల అభినయ రీతుల నన్నింటిని అభినయించడానికి ఈ గీత గోవిందంలో ఎంతో అవకాశ ముంది. సాత్వికాభినయాన్ని ముఖ్యంగా ప్రదర్శించడానికి కొన్ని అష్టపదుల్లో మంచి సన్నివేశాలున్నాయి. బృందనృత్యాలను ప్రదర్శించడానికి కొన్నిటిలో అవకాశముంది. గీత గోవిందంలోని భావాలు ఎంత సున్నితమైనవో భాష అంత మధుర

మైనది. ఇంతటి లలితమైన పదజాలంగల మధుర మైన కవిత్వా సంగీత రచనా మన దేశ భాషలో మరొకటి లేదు.

ఈ యష్ట పదుల అభినయాన్ని ఒక ప్రత్యేక కళగా తీర్చి దిద్దినవారు మన ఆంధ్రదేశ కళాకారులే.

ఆంగికం, వాచికం, అహార్యం, సాత్విక మని అభి నయం నాలుగు విధాలైనది. ఒక పాట అర్థాన్ని తెలియ జేయడానికి ఉపయోగపడేది ఆంగికం. ఆ పాట భావాన్ని ప్రదర్శించడానికి ఉపకరించేది సాత్వికం.

ఈ యష్ట పదుల్ని అభినయించే టప్పుడు ఆంగిక సాత్వికాభినయాలను వెంట వెంటనే ఒకే నర్తకి ప్రదర్శించే సంప్రదాయాన్ని మన నృత్యకళాకారులు పెంపొందించారు.

"ధీరసమీరే యమునా తీరే వసతివనే వనమాలి" అని దూతిక రాధకు చెపుతున్న పాట మిది. నర్తకి ముందుగా దూతికయై ఆ పాదంలోని ప్రతి మాటకు ఆంగికాభినయం ప్రదర్శిస్తుంది. ఆంగికంలో ఎన్నెన్ని రకాల ముద్రల్ని పట్టడానికి అవకాశ ముందో వాటి నన్నింటిని పూర్తిగా విన్యాసం చేసి, ఆ తర్వాత ఆమె రాధికగా మారి చెలికత్తె చెప్పేటప్పుడు పొందే వివిధ అనుభూతుల్ని నర్తకి అభినయిస్తుంది. ఇదంతా సాత్విక ప్రాధాన్యం గల ముఖాభినయం.

"గోపీ పీన పయోధర మర్దన చంచలకరయుగ శాలీ" అనే పాదానికి నర్తకి రాధ పొందే ఆనందాను భూతిని సాత్వికం ద్వారా ప్రదర్శించి వెంటనే దూతి కగా మారి పై చరణానికి ఆంగికాభినయాన్ని ప్రద ర్శిస్తుంది. రాధ పొందిన మానసికస్థితి నుండి నర్తకి విడివడి మరల దూతిక స్థితికి రావలసియుంటుంది. ఈ యాంగికం ముగిసిన వెంటనే రాధ పొందే ఈర్ష్య, అసూయా, దైన్యం మొదలైన సంచారులను ప్రదర్శించాలి.

ఈ విధంగా ఒక స్థాయీ భావం నుండి వేరొక స్థాయీ భావాన్ని, ఒక రకమైన భావ విన్యాసంనుండి వేరొక విధమైన భావ ప్రకటనను, వెంట వెంటనే నర్తకి మార్చి, మార్చి ప్రదర్శిస్తుంది.

ఇటువంటి అభినయం చాలా కష్టమని నేను ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. ఇంత కష్టమైన విద్యను మన కళాకారులు పూర్వం ప్రదర్శించేవారు. మన పూర్వ కళాకారుల పాండిత్య ప్రతిభ, ఇకో పాసన అంత గొప్పగా ఉండేవి.

## భామా కలాపం

రాధా మాధవుల ప్రణయ లీలల్ని జయదేవుడు తన గీత గోవిందంతో వర్ణిస్తే మన తెలుగు కవులు శ్రీ కృష్ణ సత్యభామల బుజి బుజి తగవుల్ని ఒక శృంగార ప్రబంధంగా రూపొందించి కళాలోకానికి అందించారు. భామా కలాపంలోని కథ చాలా చిన్నది, ఒక సంఘటన మాత్రమే ఇది. దీని రచనా విధానం, వర్ణనల తీరు జయదేవుని గోవిందాన్ని చాలా పోలి యున్నాయి, కాని ఈ రెండింటికి ఒక ముఖ్యమైన భేద ముంది. గీత గోవిందంలోని నాయిక రాధ ఒక అమాయక భక్తురాలు. భామాకలాపంలోని నాయిక సత్యభామ స్వాధీనపతిక, అందువల్ల సత్యభామ అభినయ పోకడలలోని బింకం, వయ్యారం, రాజఠీవి విశిష్టతతో ప్రత్యేకంగా గోచరిస్తాయి.

కర్నాటక కచ్చేరీ నాట్యం తర్వాత భాగవత సంప్రదాయంలో భామాకలాపాని కున్న విశిష్ట ఆదరణ, ప్రచారం మరిదేనికీ లేదనే చెప్పవచ్చును. ఏ ముహూర్తాన ఈ భామాకలాపం రచింపబడిందో కాని ఆంధ్రుల కిది అత్యంత ప్రీతికరమైనదిగా రూపొందింది. ఒక్క కూచిపూడి వారే గాక ఆంధ్ర దేశంలోని ఇతర ప్రాంతాల వారు గూడా దీనిని అభ్యసించి ప్రదర్శిస్తున్నారు. వివిధ కలాప రచనలు దేశంలో వెలువడ్డాయి. భాగవత కళ పూర్తిగా పురుషుల విద్యే అయినా ఉభయ గోదావరి జిల్లాలోని

స్త్రీ కళాకారులు గూడా ఈ కళను ప్రత్యేకంగా అభ్యసించి ప్రదర్శిస్తున్నారు. కూచిపూడిలో పుట్టిన ప్రతి బ్రాహ్మణ బాలుడూ అతని జీవిత కాలంలో ఒక్కసారైనా భామగా నటించాలని సిద్ధేంద్రుల వారు ఆజ్ఞాపించారు కాని స్త్రీలను నిషేధించారు.

రాజ ఆస్థానాలకు, పండిత సభలకు చెందిన విద్య కర్నాటక కచ్చేరీ నాట్యం. సామాన్య జనులకోసం భాగవతాలు, కలాపాలు ఉద్దేశించబడ్డాయి. వీటిద్వారా మన మతాన్ని, మన సంస్కృతిని పామర జనులకు ప్రబోధించేవారు. అందువల్ల సామాన్య జనుల్ని ఆకర్షించడానికి వీటిలో విధిగా హాస్యాన్ని జొప్పించారు. అయితే ఒక్కొక్కప్పుడు ఈ హాస్యం మితిమీరి ప్రధాన పాత్ర పోషణకే భంగం వాటిల్లే దిగా తయారయింది.

శంకర దేవ అనే ఒక గొప్ప వైష్ణవ భక్తుడు అస్సాంలో ఉండేవాడు. ఆయన వైష్ణవ మతాన్ని నృత్యగానాల ద్వారా ప్రచారం చేశాడు. ఆ నృత్య సంప్రదాయాన్ని అంఖియానట, ఓజ్‌పాలీ అంటారు. అస్సాం నృత్యకళాకారులు గూడా పారిజాత కథను ప్రదర్శిస్తూ ఉంటారు. అయితే అది మన కలామంతటి విశిష్టమైనది కాదు.

ఉత్తర దేశీయులకు రామలీల, గుజరాతు, మణిపుర దేశస్థులకు రాసలీల, తమిళ దేశస్థులకు శివనర్తనం అభిమాన విద్యలైనట్లు ఆంధ్రులకు భామాకలాపం అభిమాన కళ.

భామాకలాపంలోని ప్రతి చిన్న అంశానికి ఒక ప్రత్యేకత ఉంది. ప్రతి చిన్న అలంకారంలో తెలుగుతనం ఉట్టిపడుతుంది. భామ వేసుకొనే జడ, జడమీది బిళ్ళలు, జడకుచ్చులు, తలమీది సూర్యచంద్రులు, అడ్డబాస, చీరకట్టు, నుదటిమీది బొట్టు మొదలైనవన్నీ తెలుగుతనాన్ని తెలియజేస్తాయి.

భామ ప్రదర్శించే ఆ వయ్యారం, ఆ హొయలు, ఆ ఠీవి, ఆ దర్పం, ఆ రాగం, ఆ యనురాగం అన్నీ ఆంధ్రత్వంతో తొణికిసలాడుతూ ఉంటాయి. భామాకలాపంలోని సత్యభామవంటి సంపూర్ణమైన పాత్ర ఏ యక్షగానంలో గాని, వీధి నాటకంలో గాని, ఇంకే వీధి భాగవతంలో గాని మనకు కనిపించదు. అందుకే భామాకలాపం బహుళ ప్రచారం పొందింది. విశేష జనాదరణకు నోచుకొంది.

భామాకలాపాన్ని సిద్ధేంద్రయోగి రచించి కూచిపూడి భాగవతులకు నేర్పారు. అయితే నేడు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలలో భామాకలాపానికి ఉన్న ఆదరణ అభిమానం కూచిపూడిలో లేదని గట్టిగా చెప్పవచ్చును. సిద్ధేంద్రయోగి ఏ కాలం నాటి వాడో ఇతమిద్ధంగా చెప్పడానికి తగిన ఆధారాలు కనబడడంలేదు. సిద్ధేంద్రయోగి రచనే గాక సుమారు ఇరవై భామాకలాప రచనలు ఇతర ప్రాంతాలలో ప్రచారంలో ఉన్నాయి. వీటిలో ఏది ప్రాచీనమైనదో తేల్చి చెప్పడం కష్టం.

"అగజానన పద్మార్కం, గజానన మహర్నిశం" అంటూ నాటరాగ వినాయక ప్రార్థనతో కలాప ప్రదర్శన ప్రారంభమవుతుంది, సురటి రాగంతో ప్రదర్శన అంతమౌతుంది. అయితే భామాకలాపంలో కొన్ని ప్రత్యేక అభిమాన రాగాలు ఉన్నాయి. అవి, హాయిరి, గుమ్మ కాంభోజి, మారువ, సారంగ, జింఝ్లా, యరుకుల కాంభోజి మొదలైనవి. ఈ యరుకుల కాంభోజి రాగాన్ని ఆంధ్రులు ప్రత్యేకంగా కర్నాటక సంగీతానికి సమర్పించారని అంటారు. అలాగే ఆంధ్రి, తిలంగు అనే రాగాలు ఆంధ్రులకు ప్రత్యేక మైనవి. ఇవి దేశి రాగాలు. ఎరుకలు మొదలైన ఆటవికులు ఆలపించే వారి అభిమాన రాగమే కర్నాటక శాస్త్రీయ సంగీతంలో యరుకుల కాంభోజిగా రూపొందిందని అంటారు. ఆ రాగామాధుర్యానికి ముగ్ధులైన సంగీత శాస్త్రవేత్తలు ఆ యెరుకల వారి రాగానికి శాస్త్రీయతను కల్పించి, యదుకుల కాంభోజిగా ప్రచార చేసి యుండవచ్చు. భామాకలాపంలో శాస్త్రీయరాగా లున్నా వాటి పట్లు వేరుగా ఉంటాయి.

కలాప పాటకు భావ ప్రాధాన్యం ఎక్కువగా ఉంటుంది. అయితే రాగ మాధుర్యం చెడకుండా వీరు జాగ్రత్త పడతారు. భామాకలాపంలోని తాళాలు మాత్రా ఛందస్సు ననుసరించి రూపొందించబడ్డాయి. వీరికి తాళ ఛందోరీతి ముఖ్యం గాని తాళ రీతి కాదు. అందువల్ల నే వీరి పాటా, ఆటా, భావస్ఫూరితంగా ఉండి ప్రేక్షక హృదయాలను కరిగించి వేస్తూ ఉంటాయి.

ఆంధ్రుల భామాకలాపం, గొల్ల కలాపం, రాధా మాధవం, జీవ యెరుకల కురవంజి ముఖ్యమైనవి, విశిష్టత గలవి. ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పద్ధతిలో రచింపబడినవి.

రసప్రధానంగా అలంకార, రసశాస్త్రాల ఆధారంగా నాయికా నాయక రీతులను, చేష్టలను, వ్యాపారాలను, స్థాయీ సంచార భావాలద్వారా ప్రదర్శించే మధుర ప్రబంధం మన భామాకలాపం.

హైందవ విజ్ఞానాన్ని, నాగరికతను, సంఘ వ్యవస్థను ప్రబోధించే శాస్త్ర-గ్రంథం మన గొల్ల కలాపం.

ప్రధానంగా భక్తి మార్గాన్ని ప్రబోధించే ఉత్తమ రచన మన రాధా మాధవం.

జ్ఞాన వైరాగ్యాలను, ముక్తి మోక్షాలను గురించి తెలియజేసే నృత్య సంగీత రచన మన జీవ యెరుకల కురవంజి.

-:O:-

# భాగవత కళాకారులు

## ఆంధ్రలో

1. బ్రాహ్మణ భాగవతులు.
2. జక్కులవారు (లేక యక్షులు)
3. జంగాలు
4. దేవాంగులు
5. సేనాపతులు
6. సాతాని వైష్ణవులు
7. ఆసాదులు
8. దాసరులు
9. విశ్వబ్రాహ్మలు
10. కాపులు
11. నక్కలవారు
12. పిచ్చుక కుంట్లవారు
13. ఎర్రగొల్లలు

## తెలంగాణాలో

1. దాసరులు
2. మిత్రులయ్యవార్లు
3. సైంధవులు
4. భరతులు
5. బహురూపులు
6. బిందుమాదిగలు
7. బహనీలు
8. ఉగ్గుగొల్లలు

తెలంగాణాలో భాగవతులు కలాపములు నాడరు. భాగవత కథలను వీధి నాటకాలు, యక్షగానాలుగా ప్రదర్శిస్తారు.

## ప్రబంధ యుగంలో

పెండేల నాగి (నాగమణి)
పెండేల గంగి (గంగారత్నం)

బుచ్చిరామయ్య స్త్రీ వేషం గట్టి, సభలో ఆడుతున్నప్పుడు బ్రహ్మదేవుడు ఆ సభకు వస్తే— ఆశ్చర్యంతో "ఇంతటి అందమైన అప్సరాంగనను నే నెప్పుడు సృష్టించినా?" అని నిశ్చేష్టుడై నిలిచి చూచేటంత సహజంగా, సౌకుమార్య లావణ్యలతో పాత్ర పోషణం చేసేవారట.

## పోషకులు

విజయనగర మహారాజులు

విజయరామ గజపతి, సీతారామ గజపతి, ఆనంద గజపతి మహారాజులు ఈ కళను పోషించారు.

తూర్పు భాగతము : బొబ్బిలిబాణీ, విజయనగరం బాణీ అని రెండు విధాలుగా ఉంది. పాట, ఆట, ఆభినయ పోకడలలో ఈ రెండింటిలో కొంత తేడా ఉంది.

శ్రీ పూసపాటి విజయరామ గజపతిరాజుగారు, శ్రీ కొచ్చెర్ల అక్కాభక్తుడు అను భాగవత కళా వేత్తకు అతవ గ్రామంలో మాన్యా లిచ్చిపోషించారు.

ఈ గజపతులపై నున్న కొన్ని జక్కిణి దరువులు:

1. విజయనగర పురపాలనురే
వీణగాన వినోదరే
విజయశీల శ్రీ పూసపాటి కుల
విజయరామరాజ రవితేజ.

2. చక్కని స్వామి రారా
ఈ జక్కిని కృతి చేకోరా,
చక్కనరా
శ్రీ పూసపాటి సీతారామరాజ
దాన రాధేయ ॥
(సప్తతాళ జక్కిణిలోని సాహిత్యం.)

3. తత్తఝొంతక - తఝొం తకఝొం
తరిత జెనుతరి - జెనుతత్తధిమి,
రాజశ్రీ ఆనంద గజపతిరాజ
విద్యలభోజ । భాస్కరతేజ
తరుణ విరాజ॥
తక్కినాం । తరికినాం । తధనాం
తదిగిణత । తదిగిణత । తదిగిణత.

బొబ్బిలి మహారాజులు శ్రీ తణికెళ్ళ సన్యాసయ్య అనే మహావిద్వాంసుని పోషించారు. సన్యాసయ్యగారు మహా పండితులు. చక్కనైన వేషం శ్రావ్యమైన గానం అందమైన నృత్యం ముచ్చటైన సంభాషణలు, లెస్సయిన అభినయముతో భామాకలాపం, గొల్ల కలాపం ప్రదర్శనములనిచ్చి వేలాది ప్రజలను ఆనందాబ్ధుల్లో స్నానంచేయించేవారు. వీరికి బొబ్బిలి రాజా వారు బంగారు గనియం చేయించి, వారి ప్రదర్శనానికి ఇద్దరు బంట్రోతులతో పంపించి, ఆ మరునాడు మరల ఆ గనియం కోటలో భద్రపరిచే వారట.

* * * *

మాడుగుల -

మాడుగుల సంస్థానాన్ని మత్స్యవంశరాజులు పాలించారు. పెదభూపతి మహారాజుగారు, పెద్దపల్లి బ్రహ్మంగార్ని, జామి సన్యాసయ్యగార్ని పోషించారు.

శ్రీ సగినేటి రామచంద్రరాజుగారు వేచలం గ్రామ కాపురస్తులు. చోడవరం తాలూకా, శ్రీ కెళ్ళ కప్పయ్యకు, శ్రీ కొచ్చెర్ల అప్పడుగార్లకు మాన్యాలిచ్చి పోషించారు.

శృంగవరపుకోట తాలూకా, రాజుల అలమండ: శ్రీ కాకర్లపూడి బొల్లి తాతమ్మరాజుగారు, చిన్న సీతారామరాజుగారు.

తగరంపూడి సీతానగరం శ్రీ బుచ్చిరాజుగారు: వీరు రేగ అగ్రహారం కామప్పగార్ని పోషించారు. శ్రీ కామప్పగార్కి సంవత్సరానికి సరిపడే ధాన్యం,

రాకపోకలకు లక్కబండి, జోడుయెద్దు, లక్కకొరడా, కౌజుపిట్ట ఇంతా ఎన్నో బహుమతులు ఇచ్చారు.

శ్రీ పడ్డాది సామంతులు పెద్దపెల్లి బ్రహ్మంగార్ని పోషించారు.

బొబ్బిలి తాలూకా గంధవరం సామంతులు శ్రీ కాకరపర్తి అప్పన్న బాబుగారు, శ్రీ కొడ్యాడ వీరభద్రుడు, పర్రిశెట్టి పెద్దప్పనాయుడుకు కలాపవిద్య చెప్పించారు.

మాడుగుల తాలూకా గరిసింగి గ్రామ కాపురస్తులు శ్రీ గొంతిన నరసింహుడుగారు శ్రీ దూర్వాసుల మాణిక్యంగార్ని పోషించారు.

ఏజన్సీ మొఖాసాకాశీపట్నం దేవాభక్తుల బంగారయ్యగారు కలాప కళాకారుల నెందరినో పోషించారు.

నరసింగబల్లి శ్రీ మజ్జి వెంకునాయుడు కృతి భర్త. వీరు ఎర్ర మల్లయ్య సోదరులను ఆ గ్రామంలో ఈనాము లిచ్చి పోషించారు.

విజయనగర సంస్థానంలో చేరిన ఆంధ్రదొరగారు కలాప కళాకారులను పోషించారు.

అనకాపల్లి తాలూకా కశింకోట జమీందారులు, తుని జగపతులు కలాప బృందాలను పోషించారు.

ఏటికొప్పాక చింతలపాటి క్షత్రియ వంశజులు ప్రత్యేక కలాప రచనచేయించి ఆంకితముగొని కలాప బృందాలను ఆదరించారు.

తుని తాలూకా భీమవరపుకోట, దేవత సుబ్బారావు గారు శ్రీ కొచ్చెర్ల బ్రహ్మంగార్ని పోషించారు.

పిఠాపురం రాజావారు, పుఠాపురంలో చేరిన లక్ష్మీ నరసాపురం దొరవారు, పెద్దాపురం రాజావారు, తాలూకా తాఖూరు జగ్గంపేట జమీందారుగారు ఈ కళను పోషించారు.

పిఠాపురం రాజావారు రావు గంగాధర రామారావు గారు కృష్ణభక్తులు. ఆయన పిఠాపురానికి చెందిన కోనె ఉదయాచలం అనే 'చిట్టిబుల్లికి' ఉప్పాడ గ్రామస్థులు శ్రీ నాసకం మల్లయ్యగారి వద్ద తొమ్మిది రాత్రుల భామాకలాప భాగవత గ్రంథం చెప్పించి, ప్రత్యేకంగా వారికోటలో కేళిక జేయించారు.

బొబ్బిలి బాణీ భాగవతం ఆట, పాటలో ప్రసిద్ధులైన శ్రీ నందగామ వెంకయ్యగార్ని పిఠాపురం ఆహ్వానించి ఆస్థాన సంగీతాచార్యులుగా ఏర్పాటు చేయించారు. వారి భాగవతం ఆటయేగాక అనేక మంది నట్టువరాండ్రుకు, సంగీతజ్ఞులకు గాత్ర సంగీతం జెప్పించారు. ప్రసిద్ధ వైణికులు, సరస్వతీ పుత్రులు శ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారి బావగారు వెంకయ్యగారు, సంగమేశ్వరశాస్త్రి గారు ఎందరో నర్తకీనులకు నృత్య సంగీతంలో శిక్షణ ఇచ్చారు. ఆ సాంప్రదాయం చక్కగా నెరిగిన వృద్ధ కళాకారిణిల్లో శ్రీమతి జక్కుల నూకరాజు ఒకరు. పిఠాపురంలో వెలసిన కుంతి మాధవస్వామి, అమృతవళి తాయారు, శ్రీ కుక్కుటేశ్వరులపైని రచింపబడిన అపూర్వ జావళీలు, పదాలను ఎన్నిటినో ఆమె అభినయించేవారు.

## తూర్పు ప్రాంత విశిష్టత

విజయనగరం, బొబ్బిలి, సాలూరు, మందసా, పర్లాకిమిడి, మహారాజుల కోటలలో – శ్రీకోటదుర్గ - అనే పేరుతో అమ్మవారి ఉత్సవాలు చేయడం అనాది నుండీ వస్తున్న ఆచారం. ఆ సందర్భాలలో దేవి సాన్నిధ్యమున యక్షగాన భామాకలాపమును తెల్లవారులు వేషముకట్టి మేళతాళములతో ప్రజారంజకముగా వినిపించే వారు. ఈ భామాకలాపమును - ఇతరవీధి నాటకములను రచనచేసిన ఈ ప్రాంతం లోని ప్రముఖులు.

శ్రీ కెళ్ళి కప్పయ్యకవి – వీరు సత్యభామకలాపం, క్షీరసాగర మథనం (గొల్లకలాపం), నలనాటకము - యింకనూ యెన్నో యితర గ్రంథములను రచించారు.

శ్రీ పట్నాయకు గర్భాపు లక్ష్మీనారాయణగారు - సారంగధర నాటకము, హరిశ్చంద్ర నాటకము, జలక్రీడలు వీధి నాటకము రచించారు.

శ్రీ గుత్తి కన్నయ్యగారు - సత్యభామ కలాపము, సారంగధర నాటకము రచించారు.

శ్రీ సరస్వతుల సుబ్బయ్యగారు — క్షీరసాగర మథనము, సత్యభామ కలాపము రచించారు.

శ్రీ వేంకటదాసు - క్షీరసాగర మథనం, సత్యభామ కలాపం రచించారు.

శ్రీ ఆత్రేయవరపు తమ్మయ కవి - క్షీరసాగర మథనం, భామాకలాపం రచించారు.

శ్రీ ఆతవ పెద్దపల్లి బ్రహ్మం — సారంగధర నాటకం, సత్యభామాకలాపం, పార్వతీ పరిణయం రచించారు.

శ్రీ జుగ్గుమంత్రి కొండలరావు — సత్యభామ కలాపం రచించారు.

శ్రీ వీర్ణ్నారాయణ గ్రామ భీమకవి - వరూధిని వీధి నాటకం, భామాకలాపం రచించారు.

శ్రీ అచ్యుతరాయ పుత్రులు వెంకటాచలం - భామాకలాపం, క్షీరసాగరమథనం, రాధామాధవం రచించారు.

శ్రీ భవిరిపురం బలరామభుక్త గారు - సత్యభామా కలాపం రచించారు.

శ్రీ నిమ్మలవలస అధికార్ల నారాయణభుక్త - సత్యభామా కలాపం రచించారు.

## పూర్వ కళాకారులు

1. శ్రీ చిత్తజల్లు నరసింహులు :

వీరు భరతశాస్త్ర ప్రకారము పచ్చికుండలు అనగా కుమ్మరి సారెమీద చేసినకుండలు (కాల్చుటకు తయారుచేసి ఆరబెట్టినట్టినవి)పై నాట్యమాడేవారు. పాలగచ్చుపై ఆముదం పోసి దానిపై అడవులు పట్టేవారని ప్రసిద్ధి గలదు.

వీరు పూర్తిగా బొబ్బిలి బాణీలో దరువులు పాడేవారు. వీరి గాత్రం విని రెండు మైళ్ళ దూరమువారు, వీరు తెరలోనికి వచ్చారని తెలిసికొని వినుటకు రావడము ఆచారంగా ఉండేది.

2. శ్రీ కాలుగుంటి వెంకటస్వామి :

వీరు మహాగాయకులు. గాత్రము కోకిల ధ్వని. వేషము మహా అందమైనది. అడవులు, అభినయము, సామాన్యమైననూ, వీరిగానము విన్నవారు దేవలోకము నుండి తుంబురుడో, నారదుడో ఈ లోకములో జన్మించినాడు, నరుడు గాడని పొగిడే వారు. అంతటి మహా గాయక శిఖామణి. వీరు గతించిన పిదప, వీరు భామవేషములో ధరించిన "గనియము" ఆభరణములు ఒక పెట్టెలో వీరి ధర్మపత్ని భద్రపరిచియుంచి, ఆ గనియం ధరించుటకు ఎవరు అర్హులని వెదుకు చుండగా — కీ॥ శే॥ వరదా ఆదినారాయణగారి ఆట ఆమె చూచే అవకాశం కల్గినది — ఆమె వారి గాత్రము, ఆట పాటలకు మెచ్చి ఆ మరునాటి ఉదయం ఆమె నారాయణగార్ని తమ గృహానికి ఆహ్వానించి "వేంకటస్వామిగారి గనియం ధరించుటకు నీవొక్కనివే అర్హుడవని" అతనికి ఆ గనియం పెట్టె బహూకరించిరి. శ్రీ ఆదినారాయణగారు వృద్ధాప్యము వచ్చే వరకు ఆ ఆభరణములుధరిస్తూ వచ్చారు. అటుపై ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీలో తన జ్ఞాపకార్థం భద్రపరచుటకు బహూకరించిరి.

3, 4. శ్రీ బొంతలకోటి కేశవదాసు, రామదాసు;

వీరు మహావైభవోపేతముగా వేలాదిజనాన్ని ఆనందింపజేసిన విద్వాంసులు - వీరిని భాగవతమునకు ఆహ్వానించిన వూరివారు వీరికి యెద్దుబండి పంపించి ఊరి పొలిమేరవద్ద వీరిని ఆ కాలంలో తహసీలుద్దారుకు యిచ్చిన

గౌరవ మర్యాదలతో వూరిలోనికి తీసుకొని పోయేవారు.

5. శ్రీ నీలాచలం, 6. కంచయ్య, 7. నరసింహులు : వీరు సత్యభామ, గొల్లభామా కలాపము లలో ఏడు చీరలు కట్టువిప్పి, అసలు చీరెతో మంచి బాణీగా పాడి, ఆడి అనేక వేల మంది జనుల నుల్లసింప జేసేవారు.

8. శ్రీ పర్ణవర్తి వీరన్న : వీరి గానము బహుసున్నితము, వేషం, చక్కనిది. ఆట అందము పాట చందము-భావప్రకటనలో మంచివేషగాడని పించుకొని పెద్ద పెద్ద అగ్రహారముల్లోనే వీరి గొల్లభామా ప్రదర్శనములు జరిపించిన మహాప్రౌఢ.

9. శ్రీ పొడుగు అప్పలస్వామి : వీరు మహాకవీశ్వరులు, సత్యభామా కలాపంలో తెరమీద జడవేయు ప్రతిభాశాలియని కీర్తిగాంచినవారు.

10. శ్రీ నడివింటు ఎచ్చన్న : వీరిది మహాసుందరమైన వేషము. అభినయ నృత్యముల్లో మహామహు లనిపించుకొన్న మహానుభావుడు.

11. అతవ భాగవతులు : శ్రీ కొచ్చెర్ల వీరభద్రుడు, వారి కుమారుడు అక్కాభక్తుడు, వారి కుమారులు వీరభద్రుడు, అప్పడు, అక్కాభక్తుడు, సోదరులు వీర బ్రహ్మం, నారాయణ, ఆదినారాయణ వీరి మేనమామ పెదపల్లి బ్రహ్మం, వీరి కుమారులు వీరరాజు, వీరి మేనమామ నారాయణ, వారి కుమారులు బ్రహ్మం, అప్పలాచారి—వీరందరూ భాగవత కళ నారాధించిన కళాకారుల కుటుంబానికి చెందినవారు.

అక్కాభక్తుడు అత్యంత ప్రతిభాశాలి వీరి వేషంవంటి వారు స్త్రీలలో గూడా లేరని వేలాది జనులు అనుకొనేవారు.

ఆక్కాభక్తుడు రాడాయే-మా
మక్కువ దీర్చి పోడాయే॥ అని ఆ ప్రాంతపు ప్రజలు పాడుకొనేవారు.

12. శ్రీ యర్ర మల్లయ్య : వీరు గానము కన్న హావభావములలో గొప్పవారని కీర్తిగాంచిన వేషధారి.

13. శ్రీ యర్ర సింహాచలం:

14. శ్రీ యర్ర సోమలింగం: వీరిద్దరి బాణి సూక్ష్మ మైనదేగాని, వీరి వేషపు తీరు, చీరకట్టు తీరు మహా అందముగా ఉండేవి. హావభావ ప్రకటన ముచ్చటగొల్పేది.

15. శ్రీ చేబ్రోలు సన్యాసయ్య : వీరి వేషము చూచుటకు ప్రజలు పదిక్రోసుల దూరం నుండి బండ్లు కట్టించుకొని వచ్చి చూచి పరమానందం చెందేవారట.

పగలు వీరిని చూచుటకు ఒక అణా టికెట్టు పెట్టి ప్రజలకు చూపించేవారట: గంభీరమైన గాత్రం చక్కనైన పాట, అందమైన ఆట సుందరమైన అభినయం, వీరికి శ్రీ ఆదిభట్ల నారాయిణదాసుగారు "కలియుగ సత్యభామ" యని బిరుదు నొసంగిరి.

16. శ్రీ తామరాపిల్లి సన్యాసయ్య : వీరు చక్కనైన గాయకులు. సంగీత ప్రావీణ్యము గూడా ఉండేది. వేషం మోస్తరుగ, అభినయ నృత్యములు సరిపడగా వుండేవి. వీరికి సముద్రపు గోల యని బిరుదు గూడా కలదు.

17. శ్రీ భాస్కరపట్ల అప్పల నరసింహం : వీరి హావభావములు, అభినయము తగు మోతాదులో ఉండేవి, వేషం చూడ తగ్గదే. "వీరి గానము లాంటి గానము మరి వినము, అని ప్రజలు అనుకొనేటంత అమోఘముగా

ఉండేది. వీరికే "జోడు తుమ్మెదలు" అని బిరుదునొసంగిరి.

18. శ్రీ వరదా ఆదినారాయణ :

వీరి పాట చక్కనైన బొబ్బిలి బాణీ, లయా సుగుణ్యమైన వరుస యెత్తుబడిచేసి పాడిన వారు. మొత్తముపైని 70 సంవత్సరములు విరివిగా భాగవతములు ఆడి ప్రజలను ఆనంద పరవశులజేసిన ప్రౌఢ - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి ఏర్పాటుచేసిన భాగవత గురుకులానికి, గురుకులాధిపతిగా వుండి యెందరికో విద్యాదానము చేసిన మహా విద్వాంసుడు, కవీశ్వరుడు.

9. అప్ప (అక్క) చెల్లెలు భామలు.

"కలియుగ సత్యభామ" — చేబ్రోలు సన్యాసయ్య

"బహుకళావిశారద పండిత సత్యభామ" — దూడల శంకరయ్య గార్లను అక్క-చెల్లెలు భామలు అని ప్రజలు ముచ్చటగా పిల్చేవారు. ఇద్దరి వేషములు అంత ఆకర్షణీయంగానూ భావ ప్రకటన రమణీయంగానూ ఒకే తీరున ఒప్పుతుండేవి.

శ్రీ శంకరయ్య బహుముఖ ప్రజ్ఞాశాలి. భామా, గొల్ల భామాకలాపముల నాడుటలో ప్రసిద్ధులు. వీరి పాండిత్యానికి మెచ్చి వీరికి "బహు కళా విశారద పండిత సత్యభామ" అన్న బిరుదు నిచ్చి సత్కరించారు.

0. సంగీత సత్యభామ ;

శ్రీ బొంతలకోటి జగన్నాథం.

వీరి పాట ప్రాచీన ధ్రుపద బాణీ. హిందూస్థానీ ధ్రుపద గాయకుల పాటను అది జ్ఞప్తికి తెస్తుంది. బహు సున్నితమైన గాత్రము.

1. గాన కోకిల శ్రీ వానపిల్లి వరదేశి.

వీరి గానము చాలా మృదువైనది. వేషము ఆకర్షణీయమైనది. అభినయ నృత్యములను మించి వీరి పాట వినదగ్గది.

22. శ్రీమతి మాడుగుల రంగసాని :

తూర్పు బాణీ భాగవతంలో పాట ముఖ్యము. ఆ పాట అతి కష్టతరమైన ధ్రుపద రీతిది. స్త్రీలు అరుదుగా ఈ బాణీ ఆటలో పాల్గొనే వారు. ఈ బాణీ అభ్యసించి అశేష ప్రజానీకం ఆదరణ పొందిన భాగవతారిణి ఈమె.

ప్రాచీనుల్లో కొందరు విశిష్ట భాగవతులు :

శ్రీయుతులు చామర్తి సత్యనారాయణ, అంబాడ రాఘవయ్య, తులుగు చిన్నప్పన్న, తంపెళ్ళ సత్యనారాయణ, బొంతల కోటికేశవదాసు, దాసరి లచ్చన్న, చేమలపాటి సాంబయ్య, వీరి మేళములు ఇల్లు బయలుదేరి వెళ్ళి, ఆ కాలంలో పదివేల రూపాయల వరకూ ఆడి, ప్రాణములు విసుగు జెంది, ఎందరో ఆడమని ఆహ్వానించినా "మరి యిప్పుడు రాలేము మీ దయవుంటి పిలిస్తే మరల యింకొకసారి వస్తాము" అని యింటికి తిరిగి వచ్చిన అత్యంత ప్రతిభాశాలురు.

ప్రాచీనుల్లో మహాగాయకులుగా పేరొందిన వారు

శ్రీయుతులు చిత్తజల్లు నరసింహులు. వంకాయల వేంకటశాస్త్రి, దాసరి రామదాసు. తనికెళ్ళ సన్యాసయ్య, బుగత గోపన్న, కాలుగుంట వేంకటస్వామి, చామర్తి సత్యనారాయణ, తమిరి యెరుకన్న, దుంబారు రాఘవయ్య, తులుగు చిన్న అప్పలనాయుడు, అంపోలు తమ్మన్న, మజ్జి గురన్న, పలిశెట్టు బుచ్చన్న, జామి సన్యాసయ్య, భాస్కరభట్ల అప్పల నరసింహం, వరదా ఆదినారాయణ మొదలైనవారు.

అభినయ నృత్యములతో తాళ భావములతో మెప్పించినవారు:

శ్రీయుతులు కొమ్మోజు కూర్మన్న, నడిమింటి

లచ్చన్న, పిరిడి లచ్చన్న, యర్ర మల్లయ్య, నిశా గౌరి నాయుడు, మంతా కామప్ప, కొచ్చెర్ల అక్కాభక్తుడు, పెదపిల్లి వీరబ్రహ్మం, బొంతల కోటికేశవదాసు మొదలైనవారు.

హాస్యములో పేరొందినవారు:

శ్రీయుతులు రేజేటి అప్పన్న, ముట్నూరి సీతన్న ఖయిరి శంభుడు, కాకపర్తి నరసింహకవి, ముట్నూరి నరసింహం, జంగ మప్పడు, ముగడ గుంపస్వామి, నాగులపల్లి గురులింగం, జంగం రామలింగం, పిరిడి గుంపస్వామి, సీతారామపురం భట్రాజు, విశా కామన్న మొదలైనవారు.

మృదంగంలో పేరొందిన పూర్వులు:

శ్రీయుతులు కుమ్మరి రామదాసు, భగత గోపన్న, ముట్నూరి సంగన్న, దొడిగెళ్ళ అప్పడు, దొడిగెళ్ళ సూరన్న, కింతాడ అప్పన్న, విశా జగ్గన్న, నాగుల పల్లి చెన్నయ్య, ముట్నూరి రాజశేఖరరావు, చీమలపాటి ప్రకాశం, అర్జాడ శ్రీనివాసము మొదలైనవారు.

ఆధునికులు:

శ్రీయుతులు కోరుకొండ సత్యం, కిక్కుల అప్పారావు, ధూపం సూర్యలింగం, కొమ్మోజు సత్యం, ధర్మవరపు గురువులు మొదలైనవారు.

హాస్యములో ప్రముఖులు:

శ్రీయుతులు గుగ్గిలం కన్నయ్యదాసు మానాపురం రామమూర్తి, ఆటోతుల సూరిదాసు, సారిపల్లి సత్యం, పార్వతీపురం సాంబయ్య, అలమండ సన్యాసి, దాసరి అప్పడు, జంగము పెద్దయ్య మొదలైనవారు.

అలంకరణ:

పూర్వము మణిశిలా, జేగురు పాళ్లు గూర్చి వేసుకొనేవారు, మసితో కనుబొమలు తీర్చిదిద్ది, కనులకు కాటుక దిద్దేవారు. ఆభరణములు చెక్కతో చేసిన "గనియం" ధరించేవారు.

రంగస్థలం

నాలుగు ఎదురు కర్రలు పాతి పందిరి వేస్తారు. భామ పాత్ర ప్రవేశమునకు ముందు తెర పడతారు. పాత్ర తెరలో ఉండి కొంత తడవు పాడుతుంది. దీనినే వినికిడి దరువు లంటారు. రెండు ప్రక్కల యిరువురు దివిటీలు పట్టుకొంటారు. వినికిడి దరువు ముగియగానే దివిటీలవారు రెండింటినీ ఒక చోట చేర్చి పట్టగా సూత్రధారుడు వాటిపై గుగ్గిలం జల్లుతాడు. ఆ గుగ్గిలం వెలుగులో సత్యాభామ తళుక్కుమని మెరసిపోతూ, తెరవెడలి విరహోత్కంఠిత నాయికగా సభ ప్రవేశించి కలాపకేళిక ప్రారంభిస్తుంది.

ఈ విధంగా సభ ప్రవేశించి కొంత తడవుపాడి ఆడిన తదనంతరం, మన్మథోపాలంబనలో

"రామచిలుక నాతో పోరెనే
ఓ యమ్మలారా"

అనే దరువు ఆడేటప్పుడు కొంత తడవు సన్నని దోమతెర వెనుక నిలిచి నర్తన మాడుతుంది.

వాద్యములు :

మృదంగం, శ్రుతి, కంచు తాళాలు.

మాధవిగా హాస్యము చెప్పేవారు.

హంగుదారులు వంత పాటకులు.

కలాప పాత్రలు :

ప్రారంభములో వినాయకుడు, అటుపై రుక్మిణి, కృష్ణ పాత్రలు పిమ్మట సత్యభామ.

సాధారణంగా నేటి కాలంలో ఇరువురు మార్దంగికులు పాల్గొనుట ఆచారముగా వున్నది. ప్రారంభములో ఒక మార్దంగికుడు-

సత్యభామ ప్రవేశము నుండి కలాపము ముగియు వరకూ మరొక్కరు. సత్యభామ ప్రవేశము నుండి ప్రథమ శ్రేణి మార్దంగికుడు పాల్గొనును.

తూర్పు ప్రాంతములో ఈ భాగవత కళయే గాక, నాట్యముచేసే తెగలకు చెందిన స్త్రీలచే ప్రదర్శింపబడే

కచ్చేరీ, కర్నాటక సంప్రదాయ నర్తనము గూడా అభివృద్ధి చెందియున్నది. ఈ నర్తన రీతి ముఖ్యంగా విజయనగరం, బొబ్బిలి, మాడుగుల సంస్థానా లందు పోషింపబడినది. ఈ నర్తకీమణులు విజయనగరం, బొబ్బిలి, పర్లాకిమిడి, మందసా, చీకటికోట, ధారా కోట, ఉర్లాం, తుని, టెక్కలి, జయపురం, పిఠా పురం మొదలైన సంస్థానాలకు కూడా వెళ్ళి నృత్య కేళికలు జేసెడివారు.

తూర్పు పశ్చిమ గోదావరి జిల్లా లందలి స్త్రీ నర్తకి నులు భాగవత కళను (భామాకలాపం, గొల్లకలాపం) అభ్యసించి ప్రదర్శించుట ఆచార మందున్ననూ, శ్రీకాకుళం, విశాఖ జిల్లాలందలి స్త్రీలు మాత్రం యీ భాగవత రీతిని ఆరాధించలేదు. ఎక్కడో ఒక్కరిద్దరు తప్ప.

బొబ్బిలి సంస్థానములో ఒక విశిష్టరీతిని కచ్చేరీ నాట్యము, (కర్నాటకము లేక భరతనాట్యము) అభి వృద్ధిగాంచినది. ఇచ్చటి ప్రసిద్ధ నాట్యాచార్యులు బుగత రామయ్య, గోపన్న గార్లు ప్రసిద్ధ నాట్యాచార్యులే గాక పేరు గాంచిన మార్దంగికులు కూడా నగుటచే వారు ఈ నాట్యంలో అనేక మంది శిష్యులను తయారుజేసిరి. గోపన్నగారి కుమార్తె నీలాద్రివేణి, ప్రముఖ నర్తకీ మణి. ఈమె బొబ్బిలి రాజుల యిలవేలుపు వేణు గోపాలుని ఆలయంలో నృత్యపూజ చేసెడిది. అనేక ముఖ్యమైన కౌతములు, నంది భరతములోని జతులు ఈమె నర్తన మాడెడిది. బొబ్బిలి ఆస్థానములో నుండిన ప్రసిద్ధ రాజనర్తకీమణులు గడ్డిభుక్త సోదరీమణులు, శ్రీమతులు చిరంజీవి, సంజీవి, సువర్ణ, చిరంజీవి కుమార్తె జీవరత్నమ్మగారలు, శ్రీమతి జీవరత్నమ్మ, గడ్డిభుక్త సీతారాం అనే నర్తకీమణికి గూడా ఆస్థాన కేళికలో శిక్షణిచ్చి బొబ్బిలి కోటలో కచ్చేరీ ఆడించిన పిదప, ప్రముఖ గాయనీమణి శ్రీమతి బెంగుళూరు నాగరత్నం సీతారాంకు మదరాసు కచ్చేరీ ఆటలో శిక్షణిచ్చినారు.

మాడుగులలో శ్రీమతి గంధం లక్ష్మీకాంతం అను ప్రముఖ నర్తకి ఉండేది. ఆమె జయపురం శ్రీ విక్రమ దేవవర్మగారి ఆస్థాన నట్టువరాలు.

శ్రీ కూర్మం ఆలయానికి చెందిన నట్టువరాలు శ్రీమతి బడే వెంకటరత్నం. ఈమె శ్రీ కూర్మనాథుని గుడిసేవలో పాల్గొని ఆగమశాస్త్ర నర్తన రీతిని స్వామిని ఆరాధించేది.

విజయనగరం సంస్థానంలో వుండిన ప్రముఖ నృత్యకళావేత్తలు ముగ్గురు శ్రీమతులు మద్దెల అప్పడు, మద్దెల రాముడు, కోటిపల్లి సన్యాసమ్మగారలు. వీరు నాట్యాచారిణులై ఎందరికో నృత్యంలో శిక్షణిచ్చిరి. తూర్పు గోదావరి జిల్లాలోని కాకినాడ మొదలు ఒరిస్సాలోని బరంపురం వరకూ వీరి శిష్య గణం వున్నారు. విద్యలనగరం విజయనగరానికి వన్నె దెచ్చిన శ్రీమతి సరిదె లక్ష్మీనరసమ్మ (కళావరురింగు) కర్నాటకము, హిందూస్థాని పద్ధతిలో నాట్యం చేసేవారు. ఎన్నో లక్షలు ఈ విద్యలో ఆర్జించి, అం తయు బీద విద్యార్థులకు దాన ధర్మములలో వ్యయం చేశారు. ఎందరికో కళలు నేర్చుకొనుటకు సహాయం చేశారు.

వీరి శిష్యగణంలో ప్రముఖ కళాకారులు

1) శ్రీమతి కోటపాలెపు సత్తిరాజు

ఈమె శ్రీమతి కోటిపల్లి సన్యాసమ్మగారి వద్ద భరతవిద్య, మద్దెల సత్యమూర్తి వద్ద సంగీతము నభ్యసించిరి. చాలా మంది శిష్యులను గూడా తయారుచేసిరి.

జయపురపు విక్రమ దేవవర్మ పట్టాభిషేకము ఉత్సవంలో నృత్యకేళిక జేసినారు.

టెక్కలి, సాలూరు, తిలారు, ఉర్లాం, జమీం దారీలందు ప్రదర్శనములు చేసి సన్మానింపబడిరి.

మరియు అనేకచోట్ల దేవుని ఉత్సవములందు పాల్గొనిరి.

2) శ్రీమతి కంటుభుక్త అలకరాజు

ఈమె కల్లికోట, ధారాకోట, కలహండి, జయపురం, బరంపురం, అస్కా, సాలూరు, టెక్కలి, పర్లాకిమిడి, తుని, బందరు మొదలైన అనేక ఆస్థానములందు, ఆలయము లందు నృత్యప్రదర్శనము లిచ్చినారు.

3) శ్రీమతి మద్దుగారి అప్పారావు

ఈమె మద్దెల రాముడమ్మ శిష్యురాలు. జయపురం, టెక్కలి, సాలూరు, తుని, బొబ్బిలి, ఉర్లాం, తెర్లకోట, విజయనగరం సంస్థానములందు, శ్రీకాకుళం, పడ్డాది, సింహాచలం, అరసవిల్లి, అనకాపల్లి పట్టణాలలోని దేవస్థానములందు ఈమె నృత్య ప్రదర్శనము లిచ్చిరి. ఈ విద్యలో యెందరో శిష్యురాండ్రను తయారు జేసిరి. ఈమెకు "చాలంజి అప్పారావు" అని బిరుదు వున్నది.

4) శ్రీమతి సీతానాగరత్నం

శ్రీమతి మద్దెల అప్పడుగారి శిష్యురాలు. జయపురం, సాలూరు, బొబ్బిలి, టెక్కలి, కరియరొడ్డు, కలహండి, విజయనగరం యిత్యాది సంస్థానములందు ఈమె నృత్య ప్రదర్శనము నిచ్చి ప్రశంసలందింది.

5) శ్రీమతి మద్దిల సత్తయ్యగారి పైడిరాజు

ఈమె తాతగారు మద్దెల లచ్చన్నగారు వయోలిన్ విద్వాంసులు. మద్దెల పోతయ్యగారి రాముడమ్మ వద్ద భరతవిద్య నభ్యసించితుని, జయపురం, అలమండ. సాలూరు, బొబ్బిలి, టెక్కలి, బారువాకోట, పర్లాకిమిడి, సంస్థానములందు కేళికలు జేసి ఆ రాజులచే మన్ననలు బొందిరి.

6) శ్రీమతి మద్దెల పోతన్నగారి రాజేశ్వరమ్మ

ఈమె తండ్రి పోతన్న గారు విద్వాంసుడు. విజయనగరం సంస్థాన కళాకారుడు. ఈమె కూడా కొంతకాలం ఆస్థాన విద్వాంసులుగా వుండిరి. ఈమె నాట్యమాడిన సంస్థానములు విజయనగరం, మందసా, కలహండి, పాచిపెంట, తుని, కరియ, అలమండ, మధ్యవలస, అనవరాజపేట, తుంపల-మరియు అనేక పట్టణములందు దేవాలయములందు కేళికలు జేసిరి.

7) శ్రీమతి మద్దెల చిరంజీవి

మద్దెల పోతయ్యగారి రాముడమ్మ, ఆమె చెల్లెలు మద్దెల నారాయణమ్మ, తన తల్లిగారైన మద్దెల పరాంకుశం గార్లవద్ద నాట్య విద్య నభ్యసించిరి. మద్దెల సత్యమూర్తిగారివద్ద సంగీతం నేర్చిరి.

తుని, అలమండ, అనవరాజుపేట, సాలూరు, జయపురం, బొబ్బిలి, విజయనగరం ఆస్థానములందు మరియు, టెక్కలి, తిలారు, ఆల్దు, ఉర్లాం, రామతీర్థం దేవస్థానం, శ్రీకూర్మం, అరసవిల్లి వగైరా దేవస్థానములందు, ప్రదర్శనముల నిచ్చిరి.

8) శ్రీమతి జంపా ముత్యం

శ్రీమతి మద్దెల అప్పడు శిష్యురాలు. కల్లికోట, ధారాకోట, జయపురం, విక్రమ దేవవర్మగారి సాన్నిధ్యంలో, బొబ్బిలి, సాలూరు, టెక్కలి, తుని, విజయనగరం, కలహండి, బరంపురం, అస్కా, కల్లియరాజి, బందరు మొదలైన సంస్థానములందు ప్రదర్శనము లిచ్చి ప్రభువులచే సత్కరింపబడినది. ఈమె పూరి జగన్నాథుని ఉత్సవంలో కూడా ఆ తొమ్మిది రోజులు దేవుని సాన్నిధ్యంలో నృత్యం చేసి యున్నారు. పేరొందిన ఉత్తమ కళాకారిణిగా ఈమెను పేర్కొన వచ్చును.

9) శ్రీమతి జరజాపు సన్యాసమ్మ

శ్రీమతి కోటిపల్లి సన్యాసమ్మ వద్ద భరతవిద్య శ్రీ చింతకాయల నరసింహం వద్ద సంగీతము నభ్యసించెను. చీకటికోట, ధారాకోట, బొబ్బిలి, జయపురం, కల్లికోట, సాలూరు, పెద్దాపురం, తుని మొదలైన సంస్థానములందు ప్రదర్శనము లిచ్చి ప్రభువుల ప్రశంసల నందిన కళావేత్త.

10) శ్రీమతి మద్దెల సూర్యకాంతం

ఈమె మాతామహి శ్రీమతి పోతయ్యగారి అప్పడమ్మ. ఆమె కుమార్తె పోతయ్యగారి రాముడమ్మ. రాముడమ్మ కుమార్తె. సూర్యకాంతం- ఈమె తనతల్లిగారి వద్దనే ఐదవ ఏటనుండి నాట్యం నేర్చి, కళ్ళికోట, ధారకోట, జయపురం, పాచిపెంట, సాలూరు, బొబ్బిలి, తుని, విజయనగరం, టెక్కలి, అస్కా, బరంపురం,-ఆస్థానము లందు ప్రదర్శనము లిచ్చిరి.

11) శ్రీమతి అయితం అప్పలరాజు

ఈమె నాల్గవఏట శ్రీమతి ఎందమూరి మహాలక్ష్మి వద్ద భరత విద్య నేర్చుట ప్రారంభించిరి, అటుపై ఐదవ ఏట శ్రీ దువ్వూరి జగన్నాధశర్మగారివద్ద విజయనగరం సంగీత కళాశాలలో చేరి నాట్యం నేర్చిరి, తదుపరి శ్రీ బి. ఆర్. మోహన్‌రావుగారి వద్ద శిక్షణ పొందిరి.

తదుపరి గవర్నమెంటు నృత్య పరీక్షలకు కట్టి ప్రథమ శ్రేణిలో పాసయ్యినారు. ఆంధ్ర నుండి పరీక్షలకు వెళ్ళిన ప్రథమ విద్యార్థిని ఈమెయే.

అటుపై విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలో భరతనాట్యం ప్రొఫెసర్‌గా చేరిరి. పిమ్మట శ్రీ వజూర్ రామయ్యపిళ్లై వద్ద అయిదు సంవత్సరాలు దక్షిణాది బాణీ గూడా అభ్యసించిరి.

అతి చిన్నవయస్సులో శ్రీ జయపురం మహారాజావారు శ్రీ విక్రమ దేవవర్మగారి సన్నిధిని నృత్య ప్రదర్శన మిచ్చి వారిచే "నాట్యరాణి" బిరుదుపొందిరి. వీరు ప్రస్తుతం మహారాజావారి సంగీత కళాశాలలో భరతనాట్యం ప్రొఫెసరుగాపనిచేస్తున్నారు.

# భామాకలాపంలో మృదంగ వరుసలు నడకలు

## మూడవ తాళము

1 దాధిందా తిందకు—దా...

2 ధీకిడతక. తకతక. దాదిందా × -కిడతక తకతక...దా...ంది...

3 ధీ × కిడతక. తకతక. కిడతక × తకతక ......2 సారులు

4 తీర్మానం
ధీ...కిడతక, ధీకిడతక—ధీ ...కిడతక-ధీకిడ తక ధీ, కిడతక-ధీకిడతక... దా దిందా...

5 దాదిందాంతిందకు—తిందకు-తిందకు దాదిం దాం

6 దాదిందా—కిడతక -తకతక — దాదిందంకిడక తకతక-

7 2 సారులు
తాకిడతక,తకతకతక-తాకిడతక—తకతకతక

8 తాకిడతకతక - తాకిడతక—తక- తాకిడతక— తక-తాకిడతకతక—

9 తీర్మానం
తాకిడతక-తకతక - తాకిడతక—తకతక—తాకి డతక, తకతక-దాదిందం

10 2 సారులు
తళాంగు తకతకతక-తళాంగు తకితకతక

11 తళాంగుతక - తళాంగుతక - తళాంగుతక-
తళాంగుతక - - -

12 తీర్మానం
తళంగుతకతక - తళాంగుతకతక - తళాంగు
తకతక...దాదిందం...

13 దాదిందాతిందకు-ధికతకతోం × దాధిందాం
తిందకు తకతకతోం × దికతకతోం తకతక
తోం-దికతకతోం తకతకతోం (తీర్మానం)
దికతకతోం-తకతకతోం దికతకతోం × తక
తకతోం × దికతక. తకతకి) దాందిందా - -
తాకిడతక-తకతక. దిందా + దిందాదిందా ×
తాకిడతక-తకతక, దిందా + దిందాదిందా
తాకిడతక-తాకిడతక - దిందా - దిందాకిడతక
దిందాకిడతక - దిందాకిడతక-దిందాకిడతక-
-దాదిందా

## తిశ్రజాతి-త్రిపుటతాళము

1 తాదిందదింద తీంద + కిడతక-తాద్దింద-కిడ
తక-తాద్దింద కిడతక - - తాద్దింద - -
తాకిడతకుదిందాకు-తాకిడతకు దిందాకు +
తాకిడతకుదిందాకు. దిందా — తాకిడతకు
దిందాకుదిందా.

2 తాకిడతకు-దరిగిడతకు-తాకిడతకు- దరిగిడ
తకు తాకిడతకు దరిగిడతకదిందా-తాకిడ
తకు దరిగిడతక దిందా

3 తాకిడతకు దిందాకు తాకిడతక-దిందాకు
-తాకిడతకు దిందాకు -తాకిడతకు -- దిందాకు
దిందా-తాకిడతకు-దిందాకుదిందా తాకిడతకు
దిందాకు—

తాకిడతకి-తకతకి - దరిగిడతకదిత్తళాంగు
తకదధిగిణతోం దరిగిడతక దిత్తళాంగుతక
దధిగిణతోం-దరిగిడతక దిత్తళాంగుతకదధి
గిణతోం-దిందా—

తద్దిరిగిడ-దరిగిడ-తద్దరిగిడ - దరిగిడ-తద్దరి
గిడ-దరిగిడ దరిగిడ-తద్దరిగిడ-దరిగిడ దరి
గిడ దరిగిడతక - దరిగిడతక-దరిగిడతక -
దరిగిడతక దరిగిడకిడతక-దరిగిడ-దరిగిడ-
దరిగిడకిడతక-దరిగిడ-దరిగిడ
దరిగిడకిడతక-ఝొంతరికిడతక-తళాంగుతక
దదిగిణతోం ఝొంతరి కిడతక-తళాంగుతక
దధిగిణతోం
ఝొంతరికిడతక తళాంగుతక దధిగిణతోం

## చతురశ్ర-త్రిపుటతాళము

## జతులు నడకలు

ప్రథమ కాలము

దాం......దా ......దా ......దా ......
దా......దా...దా......దా...
దా -దా -దా -దా -దా -దా -దా -దా
దాద- దాద-దాద-దాద-దాద-దాద-దాద
దాద.

దాదదద - దాదదద - దాదదద - దాదదద
దాదదద - దాదదద - దాదదద - దాదదద
దాదింద. తింద - తీంద - కిడతక - తీంద
తదిగిణత. తీంద-కిడతక. తీంద.
తళాంగుతకదధిగిణతోం తీంద-కిడతక-తీంద

పై కాలము

1 ధీకిడతకు-దిందకు-ధీకిడతకు-దిందకు - - ధీ
కిడతకు.
దిందకు-ధీకిడతకు-దిందకు —

2 ధీకిడతకు-ధీకిడతకు- ధీకిడతకు.దిందకు...
ధీకిడతకు.ధీకిడతకు...ధీకిడతకు. దిందకు...

3 ధీకిడతక - ధీకిడతక-ధీకిడతక - ధీకిడతక...

ధీకిడతకి-ధీకిడతక -ధీకిడతక _ ధీకిడతక——

4 ధీకిడతక - ధీకిడతక ధీకిడతక - ధీకిడతక.
ఝెంతరికిడతక. తళాంగుతకదధిగిణతోం -
ఝెంతరి కిడతక తళాంగుతక దధిగిణతోం..
ఝెంతరి కిడతక. తళాంగుతక దధిగిణతోం.

## రెండవకాలము పరుసలు

ధిత్తోం × తాకిడతక—ధరిగిడతోం ×
ధిత్తోం × ధీకిడతక—తకతక-తోం ×

2 సారులు

తాకిడతక-ధరిగిడతోం × ధీకిడతక-తకతక
తోం × తాకిడతక - ధరిగిడ + ధీకిడతక
తకతక × తాకిడతకదరిగిడ

2 సారులు

దాధధింతక్క-దాదధిందతక్క
దాదదిందతక్క —దాదధిందతక్క.
దాదదిందతక్క × తక్కిడ.కిడతక—తతక్క
దాదదిందతక్క తక్కిడితకి—తతక్క
తక్కిడకిడతక-తక్కిడకిడతక-తక్కిడకిడతక
తతక్క దిక్కిడకిడతక — దిక్కిడకిడతక —
దిక్కిడకిడతక—తతక్క తక్కిడతక—తక్కిడ
తక—తక్కిడతక తక్కిడతక—తక్కిడకిడతక
ధిక్కిడతక—ధిక్కిడతక ధిక్కిడతక—ధిక్కిడ
తక. దిక్కిడకిడతక తక్కిడకిడతకతోం-
ధిక్కిడకిడితక_తోం తక్కిడకిడతక
॥దాదదిందదతక్క॥
దాదధిందక్క—తాకిడతక— తతక్క— దాద
ధిందతక్క—ధీకిడతక దికతక్క—తాకిడతక
తకతక్క—ధీకిడతక—ధిగతక్క

2సారులు

తాకిడతకి—తాకిడతక—తకతక—ధీకిడతక-ధీకి
డతక—ధీకిడతక-తకతక + తాకిడతక తాకి
డతక-తకతక-ధీకిడతక—ధీకిడతక తకతక

తీర్మానం

ధీకిడతక-తాకిడతక— ధీకిడతక— తాకిడతక—
దిందాకిడతక—ధీకిడతక —ధీకిడతక—ధీకిడతక
—తాకిడతక—దిందాకిడతక ధీకిడతక—తాకిడ
తక—ధీకిడతక - తాకిడతక - దిందాకిడతక _
దాదదిందతక్క.

## చతురశ్ర రూపకతాళం

తీంతింద-తీంతింద-కిడతక_తకతక-
తీంతిందకిటతక-తీంతిందకిటతక - తీంతిందకిట
తక-
తీంతింద-కిడతక-తక„తీంతింద కిడతక-తక
-తాంతాంవకిడతక తక... తిందాకిడతక
తిందా కిడతక-తిందాకిడతక -తిందాకిడతక
తిందాకితక——
తద్దిత్తాం దిత్తాం ఝెంకిడతక_తళాంగుతక
దదిగుణతోం_

తద్దిత్తాం దిత్తాం ఝెంతరి కిడతక - తళాంగు
తద్దితాం ధిత్తాం ఝెంతరికిడతక - తళాంగు
తకదదిగిణతోం తీంతింద—తాంతింద -కిడతక
దింద కిడతకు - దిందత్తా కిడతకు — దిందత్తా
కిడతకు

దిందత్తాకిడతకు —దిందత్తాకిడతకు — తీంతింద
తదిందత్తా కిడతక—తదిందత్తాకిడతకు —తదిం
దత్తాకిడతక తదిందత్తాకిడతక
తాకిడతకు—తాకిడతకు—తాకిడతకుతా-కిడతకు
తత్‌తత్ దదిగిణత-తత్ తత్ దదిగిణత-తత్
తత్ దధిగిణత
తద్దదిగిణత—తద్ధధిగిణత తద్దదిగిణత
దధిగిణత-దదిగిణతదదిగిణత......

## మిశ్రగతి వరుసలు నడకలు

1 దాధింద—దాదిందత్తా—దాదింప—దాదిందా
కిడతక

2 దాదిందా—త్తాకిడతక—దరిగిడతోం

3 దాదిందా—త్తాకిడతక—తకతకతోం

4 తాకిడతక దిరిగిడ...తాకిడతక—దరిగిడతోం

5 ధీ. కిడతక-తకతక-ధీకిడతక-తకతకతోం

6 తాకిడతక - తకతక-తకతక—తాకిడతక-తక
తక

7 తాకిడకక-తకతక । దాదిందదింద-దాదింద
దాదింద

8 తాకిడతకు—దిందకు — దిందకు—తాకిడతకు—
దిందకు —— ——

రెండవ కాలము

దధిందా తీంద తీందక్కిడకిడతక

దదింద—తీంద. తాందాకిడతక తకతక

దదింద—తాందతాందా కిడతక—తత్త

తాకిడతకతక—తాకిడతక—తకతక

తాకిడతకతక—తాకిడతాక—తకితక

తకతకతక—తాకిడతక—తకతక

తాకిడతక-తకతక-తాకిడతక — తకతక

తాకిడతక—తకతక— ॥దదింద॥......

దందిందాతీంద తీందక్కిడ కిడతక

తక్కిడతక — తక్కిడకిడతక — తక్కిడతక-
తకిడకిడతక



కుమారి సుధారాణి — నవజనార్దనం కళాకారిణి

తక్కిడతక-తక్కిడ-తక్కిడ — తక్కిడతక-
తక్కిడ-తక్కిడ
తక్కిడతకతోం — తక్కిడతకతోం — తక్కిడ
కిడతక ॥దదిందా॥

(ధూపం సూర్యలింగం).

## సమాప్తం



కుమారి విజయలక్ష్మి



కుమారి శారద



కుమారి కల్పన



కుమారి జ్యోతిర్లత



కుమారి సునీత

వీరు కేంద్ర సంగీత నాటక అకాడమీ స్కాలర్ షిప్పుతో ''నవజనార్దన పారిజాతాన్ని''
అభ్యసించిన విద్యార్థినులు



గౌరవనీయ భారత రాష్ట్రపతి శ్రీ జ్ఞాని జైల్ సింగ్ గారి సమ్ముఖాన ఆంధ్ర నాట్యం, నవజనార్దనం
26-7-1984 తేదీన ప్రదర్శించిన కుమారి రాధిక, ఆచార్య డా. నటరాజ రామకృష్ణ



శ్రీ కేశవరావు
(వాయులీనము)



శ్రీ భారు బలరాము
(మృదంగము)



కుమారి రమ
(గాయిని)



శ్రీ భాస్కరరెడ్డి
(గాయకుడు)



శ్రీ విద్యాము
(రూపశిల్పి)

# ముచ్చటైన ముచ్చట

ఒకనాడు కొంతమంది మిత్రులం అవంత్స సోమ సుందరం గారింటికి విందుకు వెళ్లాం. అక్కడికి శ్రీమతి పెండ్యేల సత్యభామగారు కూడా వచ్చారు. భామాకలాపంలోని ఒక దరువును అభినయించమని ఆమెను కోరాము. ఆమె "మదనా! ఓ మదనా!" అనే దరువును పాడుతూ అభినయించసాగారు. గొంతెత్తి సంగతులు వేసి, చిట్టాలు కొలుస్తూ పాడుతూంటే మేడ దద్దరిల్లింది. ఆమె గొంతుకలో నాకు అలసట గోచరించింది. వృద్ధాప్యం వల్ల ఆమె అలసిపోయినారనుకొని "కొంచెం మెల్లగా పాడండమ్మా, అలసిపోయినట్టున్నారు" అన్నాను.

"భాగవతం పాట మెల్లగా పాడడమేమిటి చిట్టి తండ్రీ! గొంతెత్తి పాడితే ఒక మైలు దూరం వినబడాలి. నా కంఠ మేముంది, మా అమ్మమ్మ పాడితే ప్రక్క గ్రామాలకు వినబడేది. ఈ పిఠాపురం మహారాజావారి తండ్రిగారు శ్రీ గంగాధర రామారావుగారు సజీవులై యుండగా ఒకసారి మేము గొల్లప్రోలులో భాగవతం ఆడుతున్నాం. భామ తెర వెడలేసరికి అర్ధరాత్రయింది. ఆలస్యానికి కారణం తెలియని ఆ యూరు మునసబు కోపగించుకొని కాగడాలు ఆర్పించేసి ఇంటికి వెళ్లి పడుకొన్నాడు.

"ఆనాడు సత్యభామ వేషం మా అమ్మమ్మ కట్టింది. ఆమె మాత్రం సామాన్యురాలా? మంచి గుండె నిబ్బరం, పట్టుదల గల మనిషి. అక్కడ వేసిన పందిరిలో నుండి ఒక్కొక్క తాటాకునే తీసి వెలిగించి, ఆ వెలుగులోనే భాగవతం ఆట కొనసాగించింది. ఆనాటి ఆమె దివ్య గానానికి గంధర్వులు కూడా ఆశ్చర్యపోయి యుండాలి. అప్సరసలు కూడా ఆమె నాట్యం చూసి ముగ్ధులై యుండాలి. ఆమె కంఠం ఆనాడు కంచుగంటలా కొన్ని మైళ్ల దూరం వరకు వినబడింది.

ఆ యర్ధరాత్రి సమయంలో పిఠాపురం మహారాజా వారు కోట పై అంతస్తులో విశ్రాంతి తీసికొంటున్నారు. భామ గానం, మద్దెల, తాళాల మోత వారి చెవిని పడ్డాయి. గొల్లప్రోలులో సత్యభామ నవజనార్దనం ప్రదర్శన జరుగుతున్నదని దాసీజనం చెప్పగా తెలుసుకొన్నారు. ఆ పాటకు తన్మయులై వెంటనే పల్లకీ ఎక్కి గొల్లప్రోలులో భాగవతం ఆడుతున్న చోటుకు పిఠాపురం నుండి వచ్చారు. అంతా చీకటిగా



శ్రీమతి గౌరీకుమారి
నవజనార్దనం కళాకారిణి

ప్రతీ యేటా ఆ యా గ్రామ దేవాలయ ఉత్సవాల్లో మేము ప్రదర్శన లిస్తున్నాం. నేటికీ మాకు అ మాన్యాలే జీవనాధారాలు" అంటూ భాగవతం పాట ఎలా పాడాలో ఆమె తెలియజెప్పారు.

తర్వాత కలాపంలోని మరి కొన్ని దరువులు, చిట్టాలు, శబ్దాలు, ఏలలు, పదాలు పాడి, అభినయించి చూపించి "బాబూ! మద్దెలగాడు, హంగుదారులు ఉండి, ఆ లక్క ఆభరణాలు ధరించి, భామ జడ వేసికొని ఆడితే అప్పుడు నా ఆట చూడాలి. ఇప్పుడేం చేయగలను?" అన్నారామె.



కుమారి పద్మ
నవజనార్దనం కళాకారిణి

ఉంది. అప్పుడే ఒక దరువును ముగించి మా అమ్మమ్మ అలసట తీర్చుకొంటున్నది. ప్రభువులవారికి జరిగిన విషయాలన్నీ తెలిసినవి. ఆయన వెంటనే ఆ మునసబు ఇంటికి వెళ్లి అతని కొప్పును కత్తిరించి బుద్ధి చెప్పారు. ఆ తర్వాత మా ప్రదర్శనను వారు తిలకించి, మెచ్చుకొని ఆరు గ్రామాలలో మాకు మాన్యాలు ఇచ్చారు.



బేబి యోగిత
నవజనార్దనం కళాకారిణి

సాత్వికాభినయంతో ఒక నాయికను ప్రదర్శించమని ఆ తర్వాత మేము కోరాం. వెంటనే ఆమె 'మాతః ! కేళీగృహం...' అనే ముగ్ధనాయిక శ్లోకాన్ని అభినయించడం మొదలుపెట్టారు.

చూస్తూ ఉండగానే ఆమె ముఖం మారజొచ్చింది. సత్యభామ గాంభీర్యం తొలగిపోయింది, ముఖంమీది ముడతలు అదృశ్యమైపోయాయి. కంఠంలోని వణుకు అంతరించిపోయింది. పదహారేళ్ల లేజవ్వనిగా, ముగ్ధగా ఆమె నా కళ్లముందు ప్రత్యక్షమయింది. ఆమె కంఠంలో అమాయకత్వం చోటు చేసికొంది. మెల్లగా, మెత్తగా, మృదువుగా, వినీ వినబడని కంఠస్వరంతో "కేళీ గృహానికి వెళ్ల" నని ఒక నూతన వధువు తల్లితో గారాబంగా చెప్తున్నట్టు నాకు తోచింది.

నాతోబాటు అక్కడున్న వారందరూ ఆశ్చర్య చకితులైనారు. "ఇదే నాయనా ! ఈ సత్యభామ చాతుర్యం !" అంటూ ఆమె మళ్లీ మామూలు మనిషి అయినారు.

"భేష్ ! సత్యభామగారూ ! మీ అభినయాన్ని చూసి మేము నేడు ధన్యులమైనాం !" అంటూ ఆవంత్స సోమసుందరంగారు ఆమెను సత్కరించారు. ఆమె వద్ద నవజనార్దనం అభ్యసిస్తున్న సమయమది. కళా సోదరులు ఆవంత్స సోమసుందరం గారింట జరిగిన ఈ ముచ్చట నా జన్మలో మరుపురాని ముచ్చట ! అందుకే ఈ గ్రంథాన్ని ఈ ముచ్చటతో ముగిస్తున్నాను. శ్రీ ఆవంత్స సోమసుందరంకు నా ధన్యవాదాలు.

ఈ గ్రంథ ముద్రణ ముగిసిన నాటికి, ఈ పారిజాతాన్ని డాక్యుమెంటరీ చిత్రంగా తీయాలన్న సంకల్పం కలిగి పిఠాపురం వెళ్లి రాజా వేంకట మహీపతి రామరత్నంరావు గారిని సంప్రదించాను. వారి కోటలో చిత్రీకరణ చేయడానికి అనుమతి నివ్వడమే గాక అన్ని విధాలా మాకు వారి సహకారాన్ని అందివ్వడానికి వారు దయతో అంగీకరించారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, అభివందనాలు సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథములో ముద్రించిన కొన్ని ఛాయా చిత్రాలను సేకరించి నాకు పంపి, ప్రోత్సహించిన శ్రీ చెలికాని భావనరావు గారికి నా కృతజ్ఞతలు.

నటరాజ రామకృష్ణ


కుమారి నవత


కుమారి అనూరాధ